# బ్రహ్మవిద్య

దివాన్ బహద్దూర్

నంబూరి గోపాలకృష్ణారావు

రిటైర్డు డిస్ట్రిక్టు అండ్ సెషన్సుజడ్జి,

బెజవాడ

ముద్రాపకులు: కవితిలక ప్రెస్ బెజవాడ

డిశంబరు 1947

 [అమూల్యము



శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్లో॥ రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరం తపః
రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మతారకం॥
(రామతాపనీయోపనిషత్తు)

1. ఈ పుస్తకమును, లోకనాయకుండైన, శ్రీరామచంద్ర పరబ్రహ్మమూర్తికి, నాభక్తి పూర్వకముగా సమర్పించబడినది.

2. ఈ పుస్తకము, శ్రుతి, స్మృతులలోని వాక్యములతోను అనేక వేదాంత మహావాక్యరత్నములతోను, శ్రీ భగవత్పాద శ్రీ శంకరాచార్యులవారియొక్కయు, శ్రీవిద్యారణ్యస్వాముల వారియొక్కయు, వాక్యములతోను, నిండియున్నది. దీనిని శుచియైనచోట నుంచుచు, సదాచార సంపత్తితో శ్రవణాదులు చేయుట శ్రేయస్కరము.

3. కేవల వేదాంతశాస్త్రమైన, ఈ పుస్తకమును చదువువారు, మన వేదమతసిద్ధాంతములను (కర్మ, జ్ఞానమార్గములను) తెలుపు నేను వ్రాసి అచ్చొత్తించిన, గీతాసారోద్ధారమునుగాని, మరియొక గ్రంథమునుగాని ముందుచదివిన యెడల నా బ్రహ్మవిద్య అనే గ్రంథము సులభముగా తెలియబడును.

పూర్ణానందంపేట,
బెజవాడ.

ఇట్లు,
నంబూరి గోపాలకృష్ణారావు.

శ్రీ జగద్గురవే నమః

# విజ్ఞప్తి

1. దుఃఖరహితమైన సుఖము, ఆనందము, తృప్తి, కావలయునంటె బ్రహ్మవిద్యతో తుల్యమైనది, జగత్తులో మఱియొకటిలేదు. లౌకిక సంబంధమైన, యేవిధమైన ఐశ్వర్యమును, కలిగియుండనప్పటికి, మండలాధిపత్యముగల మహాచక్రవర్తి అనుభవించే సుఖముఆనందముతృప్తికంటె, లెక్కించుటకలవిగానిఅనేక రెట్లుఆనందమును, బ్రహ్మవిద్యకలుగ జేయుననిన్ని; దుఃఖనివృత్తి శాశ్వత ఆనందావాప్తి (అనగా జీవన్ ముక్తత్వము, విదేహముక్తి) బ్రహ్మవిద్యవలన తప్ప, మఱియొక మార్గము వలన కలుగ దనిన్ని వైదికమత సిద్ధాంతము.

2. ప్రతిమానవుడు కోరు జీవన్ ముక్తిత్వము, విదేహముక్తి, బ్రహ్మవిద్య వలన లభించునని, అష్టోత్తర శతోపనిషత్తులు ప్రమాణము.

శ్రు॥ జీవన్ముక్తి విదేహముక్త్యోరష్టోత్తరశతోపనిషదః ప్రమాణం। ... .. (ముక్తికోపనిషత్తు).

3. బ్రహ్మవిద్యను, అనగా బ్రహ్మజ్ఞానమును, అనగా బ్రహ్మానందమును, అపరోక్షముగా పొందుటకు, అకామహతత్వము, శ్రోత్రియత్వము, సదాచార సంపత్తి కలిగియుండవలెనని, తైత్తరీయోపనిషత్తునందు, స్పష్టీకరించబడినది.

4. వేదోక్తానుష్ఠానములయందు నమ్మకములేని జనులకు వేదాంత శాస్త్రము, ఉపకరించదని, శ్రీవిద్యారణ్యస్వాములు చెప్పిరి.

శ్లో॥ అశ్రద్ధాళోరవిశ్వాసో నోదాహరణ మర్హతి।
శ్రద్ధాళోరేవ సర్వత్ర వైదికేష్వధికారతః॥

వే. పం. 9 అ. 24 శ్లో.

5. బ్రహ్మజ్ఞానము వేదాంత ప్రమాణము చేత పుట్టిన దగును. అట్టి బ్రహ్మజ్ఞానము, బలవంతమైన మరియొక ప్రమాణము లేకనే, నశింపదు. మరియు వేదాంత ప్రమాణము కంటె, బలవత్తరమైన మరియొక ప్రమాణములేదు. గనుక బ్రహ్మజ్ఞానము, వకప్పుడు పుణ్యవశము వలన కలిగిన యడల, ఎప్పటికిని నశింపదు.

శ్లో॥ ప్రమాణోత్పాదితావిద్యా ప్రమాణం ప్రబలంవినా
నన శ్యతిన వేదాంతాత్ప్ర బలం మానమీక్ష్యతే॥
వే. పం. 2_108

6. ఆకారణముచేత, వేదాంత ప్రమాణముచేత సిద్ధించిన, అద్వైత బ్రహ్మవిద్య, నశింపదని సిద్ధాంతము.

శ్లో॥ తస్మాద్వేదాంత సంసిద్ధం సదద్వైతంనబాధ్యతే ;
వే. పం. 2_109.

7 శ్రుత్యర్థమును విశదీకరించుటకు ప్రవర్తించుట వలన వేదాంత శాస్త్రమందు తార్కికుల ఆక్షేపములకు అవకాశము లేదని శ్రీవిద్యారణ్యుల వారి సిద్ధాంతము.

శ్లో॥ శ్రుత్యర్థం విశదీకుర్మో; నతర్కా ద్వచ్మికించన।
తేనతార్కిక శంకానా మత్ర కోఽవసరో వద॥ వే.పం.8_67

8 గనుక ముముక్షువైన వాడు, కుతర్కమును వదలి శ్రుతులను ఆశ్రయించ వలెను; అనగా వేదాంత వాక్యములయొక్క ముఖ్యార్థమును గ్రహించవలయునని శ్రీవిద్యారణ్యు లుపదేశించిరి.

శ్లో॥ తస్మాత్కుతర్కం సంత్యజ్య, ముముక్షు శ్శ్రుతి మాశ్రయేత్॥.
వే. పం. 8_68.

9. కాలవైపరీత్యమువల్ల (అనగా మణి మంత్రౌషధాది ప్రతిబంధమువల్ల) పెద్దపాషాణపురాయి నీటిలో యీదులాడిన, యీదులాడవచ్చును; గాని శ్రుతులలో జెప్పిన విషయములు మాత్రము అప్రమాణములు కాజాలవని, శ్రీజగద్గురుశంకరులవారి ఉపదేశము.

శ్లో. పాషాణప్లవనంచాపి సిద్ధ్యేత్ కాలవిపర్యయే । నక్వచిత్
శ్రుతివాక్యానామ ప్రామాణ్యంతు విద్యతే.॥

మహావాక్య దర్పణము

10. శ్రీవ్యాసప్రోక్తమైన బ్రహ్మసూత్రములు—1 మొదలు 4 వరకు—(చతుస్సూత్రి) సూత్రములున్నూ, వాటిభాష్యమున్నూ, బ్రహ్మశ్రీ పురాణబంద్ల మల్లయ్యశాస్త్రిగారు రచించిన, ఆంధ్రసూత్ర భాష్యమునందలి తాత్పర్యానుగుణముగా, సులభముగా, యేవిషయమును పోకుండా ఈపుస్తకమునందు వ్రాయబడినవి అధ్యాసభాష్యములోని ముఖ్యవిషయములున్నూ, ఇంకా అద్వైత బ్రహ్మవిచారణకు సంబంధించి, బోధకు ఉపకరించు కొన్ని శ్లోకములున్నూ, శ్రీశంకరవిరచిత దక్షిణామూర్తి స్తోత్రమున్ను (తాత్పర్య సహితముగా;) శ్రీమహావాక్యరత్నావళిలోగల, కొన్ని అమూల్యమయిన్ని వాక్యములున్నూ, కొన్ని వేదాంతశాస్త్రసిద్ధాంతములు, న్యాయములున్నూ, వ్రాయబడినవి. వ్రాయబడిన వన్నియు పండితులచే పరిష్కరింపబడినవి.

11. శ్రీ విద్యారణ్య ప్రణీతమైన, వేదాంత పంచదశిలోని, సారమును, సులభముగా, బ్రహ్మశ్రీ మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి గారియొక్క ఆంధ్రటీకా తాత్పర్య వ్యాఖ్యానముల ననుసరించి పండితులవలన విని, తెలుసుకొని, నేను గ్రహించిన విధముగా వ్రాయబడినవి; మహనీయులైన పండితులచే పరిష్కరింపబడినవి.

12. వేదాంత శాస్త్రమును, అద్వైత సిద్ధాంతమును, గురుముఖముగా శ్రద్ధాభక్తులతో, ఈశ్వరానుగ్రహము నపేక్షించుచు, తెలుసుకొనుటకు ప్రయత్నించిన యెడల, గుర్వనుగ్రహము, ఈశ్వరానుగ్రహమువలన, ఆ శిష్యునకు బ్రహ్మానందమును కలుగజేసికొని, శ్రీ విద్యారణ్యులు తృప్తిదీపములో వాక్రుచ్చిన ప్రకారము తనగురువును, శాస్త్రమును, అనేకవిధముల పొగడి, అఖండానందమును పొందుననుటయందు, సందియము లేదు. బ్రహ్మము, స్వసంవేద్యం, అనగా, అనుభవైక గోచరం; గురుశాస్త్ర సంవేద్యము, అనగా, గురువుచేతను, శాస్త్రముచేతను, తెలిసికొనదగినది. అందువల్లనే, శాస్త్రమును, గురువును, జ్ఞానమును, శిష్యుడు, పొగడుచున్నాడు.

శ్లో॥ అహో శాస్త్ర మహో శాస్త్ర మహో గురు రహో గురుః ।
అహో జ్ఞాన మహో జ్ఞాన మహో జ్ఞాన మహోసుఖ మహో
సుఖం. వే. పం. 11—297

13. శాస్త్రవిచారణ, మహనీయులైన, వేదాంతశాస్త్ర పండితుల మూలకముగా జరుపుకొని, స్వయముగా శాస్త్రములవలనను పండితుల వలననున్ను, గ్రహించి, అద్వైత సిద్ధాంతమునకు వుపకరించు, ఉపనిషత్ప్రమాణములను, తేలికగా, సర్వదా మననము నిమిత్తము, వ్రాసుకొన బడినవాటిని, వీటియందు అభిలాష గలవారికి కూడ, ఉపయోగించ వచ్చునని, అచ్చొత్తించ బడినవి. బ్రహ్మశ్రీమంత్రి లక్ష్మీ నారాయణ శాస్త్రిగారు రచించిన శ్రీవేదాంత పంచదశిలోని టీకాతాత్పర్యవ్యాఖ్యానముల వలనను, బ్రహ్మశ్రీ పురాణబండ్ల మల్లయ్యశాస్త్రిగారు రచించిన ఆంధ్ర సూత్రభాష్యము వలనను, వేదాంత శాస్త్రమందు పూర్ణమైన విద్యను సంపాదించి యేమి తెలియని వారివలె, ప్రవర్తించుచు, వారికి తెలిసిన దానిని యితరులకు బోధచేయుట యందు అఖండ ప్రజ్ఞగలిగి, నాకుఅనేక విధములుగా బోధ

చేసిన, బ్రహ్మశ్రీ అద్వ్యాగారి కుమారస్వామి శాస్త్రిగారివల
నను వేదాంత శాస్త్రముయొక్క కొన్ని ముఖ్యవిషయము
లను గ్రహించుట లభ్యపడినది. వీరందరికిన్నీ యీపుస్తకమును
వ్రాయుటలో, సహాయమును పొందిన, యితర గ్రంథకర్తల
కున్నూ, నాకృతజ్ఞతా పూర్వకమైన సాష్టాంగ నమస్కారము
లను, హృదయ పూర్వకముగా సమర్పించు చున్నాను.

14. బ్రాహ్మణులలో, శాస్త్ర జ్ఞానములేక బ్రహ్మవిద్యా సాంప్ర
దాయకము తెలియని వారు కొందరున్నను, వారిలో వేదోక్తాను
ష్ఠానము, వేదాంతశాస్త్ర పరిచయముగలిగి బ్రహ్మజ్ఞానముకొరకు
పాటుబడు వారనేకులు గలరు. వైశ్యులలో కొంతమంది వేదో
క్తానుష్ఠానపరులున్నను, వేదాంతశాస్త్ర పరిచయము గలవారు
చాల తక్కువగా నున్నారు. వేదాంతశాస్త్రా భ్యాసమువలన
కలుగు మనశ్శాంతి, తృప్తి, ముక్తి, మరియొకదాని వలన కలుగ
జాలదు. గనుక సర్వులు, వేదాంత శాస్త్రజ్ఞానము కొరకు ప్రయ
త్నించుదురుగాక.

15. మనమతాచార ప్రకారమున్ను, శాస్త్ర ప్రకారమున్ను,
వేదోక్తానుష్ఠానముల యందు సర్వులకు అన్ని జాతులవారికి,
అధికారము, లేనప్పటికి, వేదాంత శిద్ధాంతములు, పరమార్థవిచా
రణభాగవత భారత పురాణములయందు చక్కగా తెలుపబడి
యున్నవి. ఈకారణము చేతనే, అనేకమంది, మనదేశములో, తత్వ
విచారణ చేయుచు, దానిలాభమునను భవించుచున్నారు. అట్టి
విచారణచేయుటకు, ఫలమునను భవించుటకు, అనేక తేలికమార్గ
ములు గలవు. వాటిని సర్వులు, తెలుసుకుని మనశ్శాంతిని
కలుగ జేసుకొని, దేశశాంతికి తోడ్పడుదురుగాక.

23-10-1947
పూర్ణానందంపేట,
బెజవాడ.

ఇట్లు,
దివాన్ బహద్దూర్,
నంబూరి గోపాలకృష్ణారావు.

# బ్రహ్మవిద్య

## విషయ సూచిక

పుటలసంఖ్య

మొదటి ప్రకరణము. 1_4

శాన్తిపాఠః; శ్రుతివాక్యములు; గురుస్తోత్రం,

రెండవ ప్రకరణము. 5_18

బ్రహ్మవిద్యఅనగానేమి? పరవిద్య, అపరవిద్య, అనగానేమి? బ్రహ్మవిద్యయెటుల లభించును? బ్రహ్మవిద్య నెట్టివారికి ఉపదేశించవచ్చును? బ్రహ్మవిద్యవలన కలిగే ఫలమేమి? బ్రహ్మవేత్తను యెందుకుపూజచేయవలెను? ఎట్టివాడు వేదాంతశాస్త్రమునకధికారి? ముముక్షువుకు సప్తభూమికలు—అనగా, అజ్ఞానదశలోనుంచి మోక్షమార్గము అలవడువరకుగల యవస్థలవివరము. వైరాగ్యము, బోధ, ఉపరతి, వీనివలన తృప్తికలుగుననుట.

మూడవప్రకరణము. 19—40

శ్రుత్యుక్తవేదాంతసిద్ధాంతములు; కొన్ని వేదాంతశాస్త్రన్యాయములు;—

1. వేదములయొక్కయు, వేదాంతములయొక్కయు,స్థితి. 2. ఆచార్యులు త్రివిధములనియు, తదుపదిష్టజ్ఞానమువలన, శిష్యుడు కృతకృత్యుడగుననిచెప్పుట. 3. పరమాత్మ—బ్రహ్మ; బ్రహ్మఈశ్వరః; 4. బంధము—మోక్షము. 5. అవిద్య—విద్య 6. జీవన్ముక్తిః—విదేహముక్తిః; 7. బ్రహ్మజ్ఞానము; 8. పదార్థములు మూడువిధములనుట; 9. శ్రు॥ సత్యం, జ్ఞానమ

నంత, మానందం బ్రహ్మ, అనే శ్రుతిలోని, సత్యం, అవినాశి, జ్ఞానము, అనంతము, ఆనన్దము, అనేపదములకు శ్రుత్యుక్తమైన అర్థము; 10, విద్యానితిచ; 11. మూఢ ఇతిచ; 12. తప ఇతిచ 13. పరమపదం; 14. సన్న్యాస ఇతిచ; 15. అవధూతలక్షణము; 16. మాయాస్వరూపము; ఆమాయను బ్రహ్మజ్ఞాని యెట్లు అనుభవించును,—గ్రహించును! 17. అద్వైతసిద్ధాంతమునకు సంబంధించిన కొన్ని ముఖ్య శ్రుతివాక్యములు, తాత్పర్యములతోసహా—శ్రు॥ తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః॥ శ్రు॥ వాచారంభణం వికారో నామధేయం। మృత్తికేత్యేవ సత్యం॥ శ్రు॥ తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్॥ శ్రు॥ సర్వంఖల్విదం బ్రహ్మ॥ శ్రు॥ నేహనానాస్తికించన॥ శ్రు॥ ఏషాం నోఽయమాత్మాయంలోకః॥ 18. సర్వము పరబ్రహ్మస్వరూపమేనని నిరూపించుట. 19. కొన్ని వేదాంతశాస్త్రన్యాయములు:—1. గంగానిమగ్నార్ధకాయన్యాయము; 2. కాకాక్షిన్యాయము; 3. దేహళీదత్తదీపన్యాయము; 4. బాధాయాం సామానాధికరణ్యన్యాయము; 5. అభేదేసామానాధికరణ్యన్యాయము, 6. అగ్రహణం—అన్యథాగ్రహణం అనగానేమి? 7. ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానంభవతి అనేప్రతిజ్ఞయొక్క తాత్పర్యము. 8. అధ్యారోపము—అపవాదము, అనగానేమి? 9. ఈశ్వరుడు అభిన్ననిమిత్తోపాదాన కారణమనుట. 20. మాండూక్యోపనిషత్తుయొక్క సంగ్రహతాత్పర్యము.

## 4 ప్రకరణము 41—65

అధ్యాస భాష్యములోని విషయములు—అధ్యాస—అధ్యాస యనగానేమి? అధ్యాసకలిగినందువల్ల నష్టమేమి? అధ్యాసయెట్లు పోవును? అధ్యాస నివృత్తివలన ఫలమేమి? 41—45

జిజ్ఞాస—బ్రహ్మజిజ్ఞాస—ధర్మజిజ్ఞాస 46—47

సూత్రభాష్యప్రశంస.-బ్రహ్మసూత్రములు బాదరాయణునిచే రచియింపబడినవనుట.—వేదాంతశాస్త్రమందలి అనుబంధచతు

ష్టయము—సాధనచతుష్టయ సంపన్నునికిఅధ్యాసనివృత్తిచేయుట వేదాంతశాస్త్రమువలని ఫలమనుట—వేదాంతశాస్త్రమునకు ఫలము, బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముకనుక, బ్రహ్మవిచారము కర్తవ్యమనుట—బ్రహ్మసూత్రములయొక్క మొదటి 4 అధికరణములు 4 సూత్రములు—ఈసూత్రములకు సంబంధించిన శ్రుతి వాక్యములు— సిద్ధాంతములు. 47—65

## 5వ ప్రకరణము.

శ్రీవిద్యారణ్య ప్రణీతంబైన శ్రీవేదాంతపంచదశిలోని మొదటి వివేకపంచకములోని విషయములు: 66—88

ప్రత్యక్తత్త్వవివేకము:— 66—72

పంచభూతవివేకము:— 72—78

పంచకోశవివేకము:— 79—82

ద్వైతవివేకము:— 82—87

మహావాక్యవివేకము:— 88

## 6వ ప్రకరణము

దీపపంచకము:— 89—126

చిత్రదీపము:— 89—98

తృప్తిదీపము:— 98—108

కూటస్థదీపము:— 109—112

ధ్యానదీపము:— 113—122

నాటకదీపము:— 122—126

దీపపంచకముయొక్క—సంగ్రహతాత్పర్యము:— 126—129

## 7వ ప్రకరణము

ఆనందపంచకము:— 130—158

బ్రహ్మము, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మానందము—వీటికిగల అన్యోన్య సంబంధము. 130—136

బ్రహ్మానందముయొక్క స్వరూపము:— 136—142
జాగరణావస్థయందు బ్రహ్మానందమునుఎరిగెడి యుపాయములు—:
విషయానందము— 142—145
యోగానందము — 145—147
ఆత్మానందము — 148—152
అద్వైతానందము — 152—154
విద్యానందము — 155—158

## 8వ ప్రకరణము.

శ్రీ వేదాంతమహావాక్యములు, ఆత్మస్వరూపవాక్యములు బ్రహ్మస్వరూపవాక్యములు.
సర్వస్వరూపవాక్యములు; జీవబ్రహ్మైక్యవాక్యములు; విధివాక్యములు; మననవాక్యములు; జగన్మిథ్యావాక్యములు; అవశిష్టస్వరూపవాక్యములు; స్వానుభూతివాక్యములు; జీవన్ముక్తివాక్యములు; సమాధినిర్వచనవాక్యము; విదేహముక్తివాక్యములు; శ్రీరామతత్వమహావాక్యములు. 159—174

## 9వ ప్రకరణము. 175—188

శ్రీమచ్ఛంకరభగవత్పాద విరచిత శ్రీదక్షిణామూర్తిస్తోత్రము తాత్పర్యసహితము. 175—181
స్వప్నజాగ్రత్తలు 181—182
గౌడపాదకారికల సంక్షేపతాత్పర్యము 182—187
కొన్ని వేదాంతశాస్త్రలక్షణములు. 187—188



# బ్రహ్మవిద్య

## 1 ప్రకరణము

శ్రీః

"శాన్తిపాఠః"

శ్లో॥ ఓం గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుదేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥ ౧

శ్లో॥ విఘ్నేశవిధిమార్తాండ బ్రహ్మేన్ద్రోపేన్ద్రవన్దిత ॥
నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే॥ ౨

శ్లో॥ సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా॥ ౩

శ్లో॥ జ్ఞానానన్ద మయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥ ౪

శ్లో॥ శుద్ధస్ఫటిక సంకాశం సచ్చిదానన్ద విగ్రహమ్ ।
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే॥ ౫

శ్లో॥ కామేశ్వరీం పరామీడే కాదిహాది స్వరూపిణీమ్ ।
మాతృకా వర్ణలిప్తాఙ్గీం మహా శ్రీచక్రమధ్యగామ్॥ ౬

## ——♦ శ్రుతి వాక్యములు ♦——

శ్రుతి॥ హరిః॥ ఓం॥ శంనో మిత్రశ్శం వరుణః । శంనో భవత్వర్యమా । శంన ఇంద్రో బృహస్పతిః । శంనో విష్ణు రురుక్రమః । నమో బ్రహ్మణే । నమ స్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తార మవతు । అవతు మామ్ । అవతువక్తారమ్ ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః॥ ౧

శ్రు. సహనావవతు । సహనౌ భునక్తు । సహవీర్యం కరవావహై । తేజస్వినా । వధీతమస్తు । మావిద్విషా వహై । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥ ౨

శ్రు. యశ్ఛన్దసా మృషభో విశ్వరూపః । ఛన్దోభ్యోఽధ్యమృతా త్సంబభూవ । సమేన్ద్రో మేధయా స్పృణోతు । అమృతస్య దేవధారణో భూయాసం । శరీరంమే విచర్షణమ్ । జిహ్వామేమధుమత్తమా । కర్ణాభ్యాం భూరివిశ్రువం । బ్రహ్మణః కోశోసి । మేధయా పిహితః । శ్రుతంమే గోపాయ । ఓం శాన్తి శ్శాన్తిశ్శాన్తిః॥ ౩

శ్రు. అహం వృక్షస్య రేరివా । కీర్తిః పృష్ఠంగిరేరివ । ఊర్ధ్వపవిత్రో వాజినీవ స్వమృతమస్మి । ద్రవిణగ్ం సవర్చసమ్ । సుమేధా అమృతోక్షితః॥ ఇతిత్రిశంకోర్వే దానువచనమ్ । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥ ౪

శ్రు. పూర్ణ మదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే । పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥ ౫

శ్రు. వాఙ్మే మనసి ప్రతిష్ఠితా । మనోమే వాచిప్రతిష్ఠితమ్ । ఆవిరావీర్మ ఏధిః । వేదస్యమ ఆణీస్థః । శ్రుతంమేమాప్రహాసీః । అనేనాధీతేన అహోరాత్రాన్సం దధామి । ఋతం వదిష్యామి । సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తార మవతు ।

అవతుమాం అవతువక్తారం । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥ ౬

ప్రశ. ఆప్యాయన్తు మమాఙ్గాని వాక్ప్రాణ శ్చక్షుః శ్రోత్ర మథో బలమిన్ద్రియాణిచ సర్వాణి । సర్వం బ్రహ్మౌపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం। మామా బ్రహ్మనిరాకరోదనిరాకరణ మస్త్వనిరాకరణం మేఽస్తు । తదాత్మని నిరతే యఉపనిషత్సు ధర్మాస్తేమయి సన్తు తే మయిసన్తు । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥ ౭

ప్రశ. భద్రంనో అపివాతయ మనః । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥ ౮

ప్రశ. భద్రంకర్ణేభిః శృణుయామ దేవాః।భద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః। స్థిరైరఙ్గైస్తుష్టు వాగ్ంసస్తనూభిః । వ్యశేమదేవ హితం యదాయుః । స్వస్తిన ఇంద్రోవృద్ధ శ్రవాః । స్వస్తినః పూషా విశ్వవేదాః । స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తినోబృహస్పతిర్దధాతు । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥ ౯

ప్రశ. యోబ్రహ్మాణం విదధాతి పూర్వంయోవైవేదాగ్ంశ్చప్రహిణోతి తస్మై । తగ్ంహదేవ మాత్మ బుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥ ౧౦

## గురుస్తోత్రం

శ్లో॥ నారాయణం పద్మభువం వసిష్ఠంశక్తించ తత్పుత్ర పరాశరంచ। వ్యాసం శుకం గౌడపదంమహాన్తం గోవింద యోగీన్ద్ర మథాఽస్యశిష్యమ్ । శ్రీశంకరాచార్య మథాఽస్యపద్మ పాదఞ్చహస్తామలకంచశిష్యం । తంత్రోటకం వార్తికకార మన్యా నస్మద్గురూన్సన్తత మానతోఽస్మి॥ ౧

శ్లో॥ శ్రుతిస్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్ । నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్॥ ౨

శ్లో॥ శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం । సూత్రభాష్య కృతౌ వన్దే భగవన్తౌ పునఃపునః॥ ౩

# మొదటి ప్రకరణము

శ్లో॥ నారాయణ సమారంభాం విద్యాశంకర మధ్యమామ్ ।
కుమారస్వామి పర్యంతాం వందేగురుపరంపరాం॥ ౪
ఓం నమో బ్రహ్మాదిభ్యో। బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో।
వంశఋషిభ్యో నమోగురుభ్యః ॥
సర్వోపప్లవ రహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహ
మస్మి॥ బ్రహ్మైవాహమస్మి॥ బ్రహ్మైవాహమస్మి॥

☞ విశ్వందర్పణేత్యాది ఏడుశ్లోకములు పఠించవలెను: ముందు
రాబోవు పేజీలలో వ్రాయబడినవి.



# బ్రహ్మవిద్య

## రెండవప్రకరణము

1 బ్రహ్మవిద్య యనగానేమి?

బ్రహ్మవిద్యయనగా, పరమాత్మయొక్క సంబంధమైనవిద్య; అనగా, పరమాత్మను బోధించుటయే, విషయముగాగలది. ఆదియందు స్వాయంభువగు బ్రహ్మచేత చెప్పబడినవిద్య గనుక బ్రహ్మవిద్య. దేనిని తెలుసుకొన్నయెడల, అంతయు తెలిసికొనబడినది అగుచున్నదో, అట్టిదే బ్రహ్మవిద్య - ఆత్మతత్త్వము- తత్త్వజ్ఞానము.

2 పరవిద్య- అపరవిద్య- అనగానేమి?

పరవిద్య యనగా బ్రహ్మవిద్యే- అనగా పరబ్రహ్మమును- పరమాత్మనుగురించి చెప్పునట్టివిద్య- అనగా, అవినాశియగు బ్రహ్మము ఏ యుపనిషద్విద్యచేత పొందబడునో, ఆవిద్య అనగా ఉపనిషత్తులందు తెలిసికొనదగినదిగా ప్రతిపాదింపబడిన బ్రహ్మవిషయిక విజ్ఞానము. అక్షరమగు ఆత్మతత్త్వము, సర్వమునకు కారణభూతమైన దానినిగా, బ్రహ్మవేత్తలు చూచుచున్నారు. అట్టి అక్షరమగుఆత్మతత్త్వము-బ్రహ్మతత్త్వము- దేనిచేతపొందబడుచున్నదో అదియే పరావిద్య. దుఃఖరూపమగు సంసారమును నశింపజేయుటయే లక్షణముగాగల మోక్షమే పరావిద్యకు విషయము. పరావిద్యవలన మోక్షమునకు కారణమగు అద్వైతతత్త్వము సిద్ధించును.

అపరవిద్య యనగా:- ధర్మాధర్మ సాధనములను తత్ఫలములను బోధించునట్టివిద్య. అపరవిద్య, చతుర్వేదములు; శిక్షా, వ్యాకరణము, కల్పము, నిరుక్తము, ఛందో, జ్యోతిషములను షడంగములును అగును. పరావిద్యకు విషయము సంసారము-దుఃఖరూపము,

అపరా విద్యవలన తెలియబడెడి, కామ్యకర్మానుష్ఠానము వలన స్వర్గాదులు; నిషిద్ధ, నింద్య, కర్మానుష్ఠానము వలన నరకప్రాప్తి కలుగుచున్నది. మరిన్ని, నిత్య (నిష్కామ) కర్మానుష్ఠానము వలన, చిత్తశుద్ధి పాపక్షయము, గలిగి పరావిద్య ప్రాప్తికి అర్హుడగును. అపరావిద్య, విధినిషేధములను మాత్రము తెలుపును. దీనివలన సంసార కారణమగు అవిద్య నశింప బడజాలదు.

**3 బ్రహ్మవిద్య యెటుల లభించును?**

(1) అనేక జన్మార్జిత సుకృతవిశేషముచేత జిజ్ఞాస గలుగును. అట్టి సుకృతముచేతనే తగిన ఆచార్యుడు లభించును. ఆత్మ ప్రాకృత బుద్ధులకు దుర్విజ్ఞేయుడు. దుర్విజ్ఞేయుడైనను ఉపాయముచేత నెఱుంగ శక్యమైనవాడు. ఆత్మతత్త్వము, స్వబుద్ధిమాత్రము గ్రహింప శక్యముకాదు. ఉపనిషద్విచారణాదికముచేత, ఆత్మ నెఱుంగవచ్చును. అయితే, గురూపదేశము, గుర్వనుగ్రహము, ఈశ్వరాను గ్రహములేని కేవలమైన ఉపనిషద్విచారణము చేత లభ్యముకాదు. అనగా, ఆచార్య, పరమేశ్వరానుగ్రహ పూర్వకమయిన ఉపనిషచ్ఛ్రవణ మనన, నిధిధ్యాసములచేతనే లభించును.

శ్రు॥ నాయమాత్మా ప్రవచనేనలభ్యో । న మేధయా బహునా శ్రుతేన। యమేవైష వృణుతేతే నలభ్యస్తస్యైష ఆత్మావివృణుతే తనూస్వామ్॥

—♦ కఠ. 1వఅ; 2వవల్లి; 23వ మంత్రము ♦—

(2.) లోకమునందు జనులు. పుత్రకామేష్టియను పురుషప్రయత్నము నాచరించి పుత్రుని పొందుచున్నారు. కృషి వాణిజ్యాది రూపపురుష ప్రయత్నము నాచరించి ద్రవ్యమును పొందు చున్నారు. జ్యోతిష్టోమాది యజ్ఞముల నాచరించి స్వర్గము

పొందుచున్నారు. అదేవిధముగా పురుష ప్రయత్నముచేత ఆచార్య సమీపమునందు ఉపనిషచ్ఛ్రవణ మొనర్చి తదర్థమున నిధిధ్యాసనాదికముచేత కలిగిన సమాధినిష్టచేత జీవన్ముక్తి విదేహముక్తులు లభించును.

మూ॥ యథా పుత్రకామేష్టినాపుత్రం వాణిజ్యాది, నావిత్తం, జ్యోతిష్టో మేనస్వర్గం, తథా పురుషప్రయత్న సాధ్య వేదాంతశ్రవణాది జనిత సమాధినా జీవన్ముక్త్యాది లాభోభవతి.

(ముక్తికోప నిషత్తు)

(3.) పురుష ప్రయత్నము శాస్త్రనియమముల నతిక్రమించిన దనియు, శాస్త్ర నియమముల ననుసరించినదనియు, రెండు విధములుగా చెప్పబడినది. శాస్త్రనియమము నతిక్రమించిన పురుష ప్రయత్నము, అనర్థము కొరకుఅగును. అనగా నరకము సంభవించును. శాస్త్రనియమము ననుసరించిన పౌరుషము ముక్తి కొరకు అగును. అట్టిపౌరుషము వలన ముక్తి లభించును.

మూ॥ ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతిపౌరుషం ద్వివిధంస్మృతం తత్రో చ్ఛాస్త్ర మనర్థాయ పరమార్థాయ శాస్త్రితం॥

(4.) మూ. పౌరుషేణప్రయత్నేన లాలయేచ్చిత్త బాలకం.

(ముక్తికోప నిషత్తు)

తా॥ తల్లిదండ్రులు తమ పుత్రుని చాంచల్యమును పోగొట్టి మెల్ల మెల్లగా సామదాన దండోపాయముల నవలంబించి మంచిత్రోవకు ద్రిప్పినటుల' శమదమాది గుణాభ్యాసముచేతను, గురు శుశ్రూషా, శాస్త్ర శ్రవణములచేతను, మనస్సును శుభవాసనలనుండి తొలగనీయకుండునటుల చేయుటయే, పురుషప్రయత్నము.

(5.)మూ॥ వాసనాక్షయ, విజ్ఞాన, మనోనాశా, మహామతే। సమకాలం చిరాభ్యస్తా, భవంతి ఫలదాయినః॥

(ముక్తికోపనిషత్తు)

తా॥ తత్త్వజ్ఞానము, వాసనాక్షయము, మనోనాశము, ఈమూడును న్నొకమాటుగా చాలాకాల మభ్యసింపబడు నెడల, మోక్షరూపఫలము నిచ్చుచున్నవని శ్రీరామచంద్రుడు శ్రీఆంజనేయుల కుపదేశించెను.

(6)మూ॥ త్రయమేవం సమం యావన్నాభ్యస్తాశ్చ పునఃపునః । తావన్న పద సంప్రాప్తిర్భవత్యపి సమాశతైః॥

(ముక్తికోపనిషత్తు)

తా॥ తత్త్వజ్ఞానము, వాసనాక్షయము, మనోనాశము, ఎంతకాలము మాటిమాటికి అభ్యసింపబడవో, అంతవరకునూర్లకొలదిసంవత్సరములకైనను, మోక్షముకలుగనేరదు. కారణాంతరములచేత, నీజన్మమునందు లభింపకపోయినను, అభ్యాసపాటవమువలన, జన్మాంతరమునందైన తప్పక లభింపవచ్చునని తాత్పర్యము.

(7)మూ॥ విమూఢాః కర్తుముద్యుక్తా యే హఠాచ్చేతసోజయం ।
తేని బధ్నంతి నాగేంద్రమున్మత్తం బిసతంతుభిః॥

(ముక్తికోపనిషత్తు-ద్వితీయోధ్యాయం-మూ.52)

తా॥ మనోజయమునకు ముఖ్యసాధనములగు (వేదాంత శాస్త్రాభ్యాసము, సజ్జనసహవాసము, మలినవాసనా పరిత్యాగము, ప్రాణ చాంచల్య నిరోధనము) "ఉపాయ చతుష్టయమును వదలి, హఠయోగాదికముచేత నెవ్వరు ప్రయత్నించుదురో, అట్టిమూఢులు, మదించిన గజశ్రేష్ఠమును, తామరకాడనూలుతో, కట్టివేయ ప్రయత్నించువారితో సమానులు. అనగా, హఠయోగాదికముచేత మనోజయము అశక్యము.

(8)మూ॥ ముముక్షవః, పురుషాస్సాధన చతుష్టయసంపన్నాశ్శ్రద్ధావంతం, సత్కులభవం, శ్రోత్రియం, శాస్త్రవాత్సల్యం, గుణవంతమకుటిలం, సర్వభూతహితేరతం, దయాసముద్రం సద్గురుం విధివదుపసంగమ్యోపహారపాణయోऽష్టోత్తరశతోపనిషదం విధివదధీత్య, శ్రవణమనననిదిధ్యాసనాని నైరంతర్యేణ కృత్వా, ప్రారబ్ధక్షయా

ద్దేహత్రయభంగం, ప్రాప్యోపాధివినిర్ముక్త, ఘటాకాశవత్పరిపూర్ణతామేతి విదేహముక్తిస్సైవ కైవల్యముక్తిరితి, అత ఏవ బ్రహ్మలోకస్థా అపి బ్రహ్మముఖాద్వేదాంత శ్రవణాది కృత్వా తేనసహ కైవల్యం లభంతే; అతస్సర్వేషాం కైవల్యముక్తిర్జ్ఞాన మార్గేణోక్తా నకర్మసాంఖ్యయోగోపాసనాదిభిరిత్యుపనిషత్ ...... శ్రీ

(ముక్తికోపనిషత్తు-ప్రథమాధ్యాయః)

తా॥ మోక్షమునం దిచ్ఛగల, పురుషులు సాధనచతుష్టయ సంపత్తి గలవారలయి శిష్యులకుపదేశించి వారిని తరింపజేయుటయందు ఆసక్తికలగియున్నట్టియు, వేదజ్ఞులగువారి వంశమునందుజన్మించినట్టియు, వేదవేదాంగ పారంగతుడయినట్టియు, వేదాంతశాస్త్రమునందు విశ్వాసము కలిగినట్టియు మైత్రి, కరుణ, ఉపేక్షలను కలిగినట్టియు, కపటికానట్టియు సకలప్రాణులకు హితము నొనర్చుటయందు ఆసక్తికలిగినట్టియు దయకు సముద్రుడయినవాడును అగు సదాచార్యుని, కానుకలు హస్తమునందుగలవారయి శాస్త్రానుసారము సమీపించి నూటఎనిమిది యుపనిషత్తులను, •తత్తచ్ఛాంతిమంత్ర పఠనాది పురస్సరముగా పఠించి, శ్రవణమనన నిదిధ్యాసనములను ఎల్లప్పుడు చేసి ప్రారబ్ధనాశమువలన స్థూల సూక్ష్మకారణ శరీరభంగమును పొంది ఉపాధిరహిత ఘటాకాశమువలె పరిపూర్ణత్వమును పొందుచున్నారు. ఆపరిపూర్ణత్వమును పొందుటయే విదేహముక్తి. అదియే కైవల్యముక్తియునగును. కావుననే బ్రహ్మలోకమునందున్న వారలునూ, బ్రహ్మ ముఖమువల్లనుండి ఉపనిషచ్ఛ్రవణ మనన నిదిధ్యాసనములను చేసి ఆబ్రహ్మతోడ నిత్యత్వరూపమగు ముక్తిని, పొందుచున్నారు. అందువలన అందరకు కైవల్యముక్తి జ్ఞానమార్గముచేతనే చెప్పబడినది. కర్మ, సాంఖ్య, యోగ, ఉపాసనములచేత లేదు. ఇట్లని ఉపనిషదభిప్రాయము.

☞ శ్రౌత స్మార్త కర్మలు; యోగములు; ఉపాసనములు; ఇవి పాపక్షయమును వాసనా క్షయమును చిత్తశుద్ధిని కలిగించి జ్ఞానోత్పత్తికి సహాయ భూతములయినను ఇవియే ముక్తి నొసంగునని తలచరాదనియు, జ్ఞానమే మోక్షదాయక మనియుస్పష్టమవుచున్నది. అదియే సిద్ధాంతము.

(9) మూ॥ మాండూక్యమేక మేవాలం। ముముక్షూణాం విముక్తయే
తథాఽప్యసిద్ధం చేజ్ఞానం। దశోప నిషదం పఠ, జ్ఞానంలబ్ధ్వా
చిరాదేవ। మామకం ధామయాస్యసి॥

తా॥ ఓ యాంజనేయా! ఒక మాండూక్యోప నిషత్తును, పఠించుట చేతనే, ధృఢమగు జ్ఞానముకలుగును. మాండూక్యోప నిషత్తును పఠించినను అపరోక్ష జ్ఞానము సిద్ధింపనియెడల ఈశ, కేన, కఠ। ప్రశ్న, ముండక, మాండుక్య, తిత్తిరి, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకములను, దశోపనిషత్తులను పఠింపుము. ఆదశోపనిషత్తుల పఠించుటవలన అపరోక్ష జ్ఞానమునుపొంది సాక్షాత్కారమును పొందగలవు. (ముక్తికోపనిషత్తు)

(10) మూ॥ తథాఽపి దృఢతానోచే ద్విజ్ఞాన స్యాంజనాసుత। ద్వాత్రింశాఖ్యోప నిషదం సమభ్యస్య నివర్తయ॥ విదేహముక్తా విచ్ఛా చేదష్టోత్తరశతంపఠ॥

తా॥ ఓ యాంజనేయా! దశోప నిషత్తులను పఠించినను ధృఢమగు అపరోక్ష జ్ఞానము కలుగనియెడల ముప్పదిరెండు ఉపనిషత్తులను పఠింపుము. నీకు విదేహముక్తి యందిచ్ఛ యున్నయెడల అష్టోత్తర శతోప నిషత్తులను పఠింపుము (ముక్తికోపనిషత్తు)

## 4. బ్రహ్మవిద్యనెట్టివారికి ఉపదేశించవచ్చును?

ఈవిషయము శ్రుతిచేతనే చెప్పబడినది.

(1) ఎవ్వరు వారివారి వర్ణాశ్రమాచారానుష్ఠాన తత్పరులో వేదాధ్యయనపరాయణులో, పరబ్రహ్మమును తెలుసుకొనుటకుకుతూ

హాలము కలిగియున్నారో అట్టివారలకే ఈ బ్రహ్మవిద్యను ఉపదేశించవలయును. ఎవరిచేత అధర్వణ ప్రసిద్ధమగు శిరోవ్రతము శాస్త్రోక్త ప్రకారము ఆచరించబడినదో వారలకువమ్నా ఉపదేశించవలయును.

శ్లో॥ క్రియావన్తః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః స్వయంజుహ్వత ఏకర్షిం శ్రద్ధయంతః । తేషామేవైతాం బ్రహ్మవిద్యాంవదేత । శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణం. (ముండకోపనిషత్తు)

(2) అనుగ్రహముగలిగినయెడల సర్వాభీష్టములను ఇచ్చునట్టి, రాజ్యమునుగాని, ధనమునుగాని ఇవ్వవచ్చును. అష్టోత్తర శతోపనిషత్తులను మాత్రము, దురాచారరతుడు' కృతఘ్నుడు' నాస్తికుడు మున్నగు వారలకు ఉపదేశింపదగదు. ఇవ్వనేగూడదు.

మూ॥ రాజ్యందేయం, ధనందేయం, యాచతః, కామపూరణం, ఇదమష్టోత్తర శతంనదేయం, యస్యకస్యచిత్, । నాస్తికాయ కృతఘ్నాయనై.॥ (ముక్తికోపనిషత్తు)

(3)మూ॥ యమేవవిద్యా. శ్రుతమప్రమత్తం । మేధావినం బ్రహ్మచర్యోపపన్నం । అస్మాఇమా । ముపపన్నాయసమ్య । క్పరీక్ష్య దద్యాద్వైష్ణవీమాత్మనిష్ఠామితి॥ (ముక్తికోపనిషత్తు)

తా॥ ఎవ్వడు వేద శాస్త్రములందు చక్కని పాండిత్యము కలిగి ప్రమాదము లేనివాడై, గ్రహించిన దానిని మరచిపోక, జాగ్రత్తగా జ్ఞప్తియందుంచుకొన సమర్థుడో, బ్రహ్మచర్య నియమము కలవాడో, అట్టివాడు విద్య నభిలషించి నతనిగురువు సమీపమునకు వచ్చి, వినీతుడయి సర్థించినయెడల వాని పరీక్షించి,యీ ఆత్మ విద్యనుఉపదేశింపవలయును.

## 5. బ్రహ్మవిద్యవలన గలిగే ఫలమేమి?

(1) బ్రహ్మవిద్యవలన గలిగేఫలము బ్రహ్మస్వరూపుడే తానని తెలుసుకొని శోకమోహాది సర్వదుఃఖవిముక్తుడై, ఆనంద స్వరూపుడై యుండుటయే.

శ్రు॥ బ్రహ్మవేద బ్రహ్మైవభవతి.
శ్రు॥ పరామృతాత్పరిముచ్యంతిసర్వే.

(2) ఎవ్వడు పరబ్రహ్మమును తెలుసు కొనుచున్నాడో, అట్టివాడు పరబ్రహ్మస్వరూపుడే అగుచున్నాడు. ఈ బ్రహ్మవేత్తయొక్క వంశమందు బ్రహ్మవేత్త కానివాడు కలుగడు. దుఃఖమునుపో గొట్టుకొనుచున్నాడు. పాపమును అతిక్రమించుచున్నాడు. అవివేకము చేతహృదయమునందున్న, సంశయములను విడిచి దృఢములైన బంధములనుండి విడువబడిన వాడై ఆత్మ స్వరూపుడు అగుచున్నాడు.

శ్రు॥ సయోహ వైతత్పరమం బ్రహ్మవేద। బ్రహ్మైవభవతి నాస్యా బ్రహ్మవిత్కులే భవతి । తరతి శోకం తరతిపాప్మానం । గుహా గ్రంధిభ్యో విముక్తో౽ మృతోభవతి॥

(ముండకో- 3ము- 220-9మం.)

(3) కర్మయనగా అగ్నిహోత్రాది లక్షణమైనది. తపస్సనగాజ్ఞానము తత్కృతమైన ఫలము. ఇది యంతయు పరమును అమృతమును అగు బ్రహ్మమును ఎవడు సర్వప్రాణులయొక్క హృదయ గుహా యందున్న వానిగా బ్రహ్మము నెఱుగుచున్నాడో, వాడు బ్రతికియుండగానే అజ్ఞాన గ్రంధిని నశింప జేసుకొనుచున్నాడు.

శ్రు. పురుష ఏవేదం విశ్వం కర్మతపో బ్రహ్మపరామృతమ్ । ఏత ద్యోవేద నిహితం గుహాయాంసో౽ విద్యాగ్రంధిం వికిర తీహ సోమ్య ॥

(ము-3ము-127-)

(4) పరమాత్మజ్ఞానము లభించినయెడల మమకారాత్మక రూప ముతోనున్నహృదయగ్రంధిసందేహములునివర్తించును. అనగా సంచితకర్మలు నశించును. ప్రారబ్ధకర్మను మాత్రము అను భవించును,

శ్లో॥ భిద్యతేహృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః । క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టేపరావరే ॥

(ముం-2ముం-2ఖ-8వమం.)

(5) స్వరూపముచేత ఆత్మ' ఆకాశతుల్యుడు అయి, అనిత్యము లగు శరీరములందున్న వాడు; అనగా నిత్యనిర్గుణ, గోప్పవాని గను విభువుగను, సర్వవ్యాపిగను ఆత్మనుతలంచి' అనగా "అయంఅహం, ఇతి" (నేనేపరబ్రహ్మమని) తలంచుచున్న విద్వాంసుడు, శోకింపడు.

శ్లో॥ అశరీరగ్ంశరీరేష్వనవస్థేష్వవస్థితమ్ । మహాంతం విభుమాత్మానంమత్వాధీరోనశోచతి ॥

(కఠ. 1అ: 2వవల్లి: 22మం.)

(6) సంసారసముద్రమును దాటిమోక్షమును పొందుటకు ఆత్మజ్ఞానముకంటె వేరుమార్గములేదు. ఆత్మతత్త్వముజ్యోతిస్సులన్నిటికి జ్యోతిస్సు. ఆత్మజ్ఞాననిష్ఠులకు జీవన్ముక్తియు కర్మానుష్ఠాన సహితముగ కార్యబ్రహ్మోపాసనాపరులకు సత్యలోకప్రాప్తిపూర్వకముగా క్రమముక్తియు కలుగునని వేదములు ఉపదేశించుచున్నవి.

(7) బ్రహ్మ జ్ఞానముచేత సంచితకర్మ నశించును.

శ్లో॥ అహం బ్రహ్మేతి విజ్ఞానాత్కల్పకోటి శతార్జితం । సంచితం విలయంయాతి ప్రభోధాత్స్వప్న కర్మవత్ ॥

అధ్యాత్మోపనిషత్. 40

తా॥ నేను బ్రహ్మము, అనియెడి అపరోక్ష సాక్షాత్కారమువలన కల్పకోటి శతములనుండి పుణ్యపాపకర్మల నాచరించి చేర్చుకొనియున్న సంచితకర్మ యంతయు, మెలుకువరాగానే స్వప్నకృతము నశించిన విధముగా నశించును.

(8) బ్రహ్మజ్ఞానిని ఆగామికర్మ అంటజాలదు.

శ్లో॥ స్వమసంగము దాసీనం, పరిజ్ఞాయనభోయథా । నశ్లిశ్యతేయతిః కించిత్కదాచి ద్భావికర్మభిః॥

అధ్యాత్మోపనిషత్. 51.

తా॥ తాను ఆకాశమువలె అసంగమును, ఉదాసీనమును, అగు బ్రహ్మస్వరూపమనియు తెలిసికొనిన యెడల, ఆగామికర్మ ఫలములచేత ఎప్పటికిని పీడింపబడడు.

శ్లో॥ నసభోఘట యోగేన సురాగంధేన లిప్యతే । తథాఽఽత్మోపాధియోగేన తద్ధర్మైర్నై లిప్యతే॥ అధ్యాత్మోపనిషత్. 52.

తా॥ కల్లు వాసనగల కుండయందున్న ఆకాశమును ఆకల్లుయొక్క వాసన నేవిధముగా నంటజాలదో, అదేవిధముగా ఆత్మ ఉపాధిధర్మములచేత అంటబడదు.

(9) ప్రారబ్ధము, భోగము చేతనే నశించునుగాని, జ్ఞానముచేత నశింపదు. ప్రారబ్ధక్షయ పర్యంతము, జీవన్ముక్తుడయి అనంతరము తదవస్థను దాటి, దేహపాతానంతరము, బ్రహ్మజ్ఞాని బ్రహ్మస్వరూపుడగును. ఇదియే విదేహముక్తి.

శ్లో॥ జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మ జ్ఞానాన్న నశ్యతి । అదత్వా స్వఫలం లక్ష్యముద్దిశ్యోత్సృష్టబాణవత్.॥

అధ్యాత్మోపనిషత్ 53

శ్లో॥ వ్యాఘ్రబుద్ధ్యావినిర్ముక్తో బాణః పశ్చాత్తుగోమతౌ । నతిష్ఠతిభినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరం.

(10) మూ. కైవల్య ముక్తిరేకైవ పారమార్థిక రూపిణీ॥

(ముక్తికోపనిషత్తు)

తా॥ ఉపాసనా సాధ్యములగు ముక్తులకు భేదముగలదు. కాని పారమార్థికమగునట్టి ముక్తిమాత్రము ఒక్కటియే

(11) మూ॥ సర్వోపనిషదాంమధ్యేసారమష్టోత్తరంశతంసకృచ్ఛ్రవణమాత్రేణసర్వాఘౌఘనికృంతనం॥

ముక్తికోపనిషత్తు ప్రథమోధ్యాయః

తా॥ ఉపనిషత్తులన్నింటిలో, నూటయెనిమిది ఉపనిషత్తులు మోక్ష సాధనభూతములు, కావున శ్రేష్ఠములగుచున్నవి. ఒక్కమారు వినినంతమాత్రమున నే, సకల పాపములు నశించును.

(12) కేవల శాస్త్రజ్ఞానముకలిగిననూ, పాపపుణ్యములునశించును:—

మం॥ గృహస్థో బహ్మచారీవా వానప్రస్థోఽథ భిక్షుకః । యత్ర తత్రస్థితో జ్ఞానీ పరమాక్షరవిత్సదా. ॥ విషయీ విషయాసక్తోయాతి దేహాంతరేసుఖమ్। జ్ఞానాదేవాస్య శాస్త్రస్య సర్వావస్థోఽపిమానవః ॥ బ్రహ్మహత్యాశ్వమేధాద్యైః పుణ్యపాపైర్నలిప్యతే॥ (బహ్మవిద్యోపనిషత్తు మం ౪౬-౪౭)

తా॥ గృహస్థుడుగాని, బ్రహ్మచారిగాని, వానప్రస్థుడుగాని, యతీశ్వరుడుగాని, యేయాశ్రమియైనను, యెట్టిసామాన్యస్థలమునందున్నప్పటికిన్నీ, ఏతచ్ఛాస్త్రసంబంధమైనసామాన్యజ్ఞానమును మాత్రమెఱింగియున్ననూ, అట్టి విషయమందాసక్తిగలవాడై యుండి, జన్మాంతరమందు తప్పక ముక్తినిగాంచును. మానవుడగువాడు, యీశాస్త్రముయొక్క కేవలపరిజ్ఞానముమాత్రముచేత నే బ్రహ్మహత్యాశ్వమేధములకు సంబంధించిన, పాపపుణ్యముల యొక్క లేశమునుకూడ పొందజాలడు.

## 6· బ్రహ్మవేత్తను యెందుకుపూజచేయవలెను?

ఆత్మవేత్తయగువాడు, నిర్మలాంతఃకరణముగలవాడు కావున, తనమనస్సుచేత, యేయేలోకముగాని, విషయముగాని; తనకుగాని ఇతరులకుగాని కావలయునని తలంచునో, సత్యసంకల్పుడగనుక, అట్లేవెంటనేసిద్ధించును. గనుక బ్రహ్మవేత్తను సర్వవిధముల పూజచేయవలెను.

శ్రు॥ యంయంలోకం మనసాసంవిభాతి । విశుద్ధసత్వః కామయతే యాంశ్చకామాన్ । తంతంలోకం జయతేతాంశ్చకామాన్ । తస్మాదాత్మజ్ఞంహ్యర్చయేద్భూతికామః॥.

(ముండకో—3ముం-1 2-10మం)

**(7) ఎట్టివాడు. వేదాంతశాస్త్రమున కధికారి?**

జవాబు – సాధన చతుష్టయ సంపత్తి గలవాడు.

సాధన చతుష్టయ సంపత్తి యనగానేమి?

(1) జవాబు: నిత్యానిత్య వివేకము: సద్గురువునద్ద బ్రహ్మము సత్యము, జగత్తుమిథ్యయని యెఱుగుట.

(2) ఇహాముత్ర ఫలభోగ విరాగమము. ఈలోక సుఖములు, పరలోక సుఖములు, అశాశ్వతములు, దుఃఖ ప్రదములు, అని తెలుసుకొని, వైరాగ్యమును వరించుట.

(3) శమాది షట్కము.

శమము:– అంతరింద్రియ నిగ్రహము.

దమము:– బాహ్యేంద్రియ నిగ్రహము.

తితిక్ష:– ప్రతిక్రియ చేయక, విలపింపక సర్వదుఃఖములు నోర్చుట.

ఉపరతి:– విధ్యుక్తముగ కర్మ సన్యాస మొనర్చుట.

శ్రద్ధ:– గురువునందు వేదాన్త శాస్త్ర వాక్యములయందు దృఢవిశ్వాసము గలిగియుండుట.

సమాధానము:–చిత్తవృత్తి కవకాశమియ్యక బ్రహ్మయందు బుద్ధినిలుపుట

☞ ఈ శమాదులయందు కొన్ని మొదట లేకున్నను, వేదాంతవిచారము చేయుచు క్రమక్రమముగా, దక్కినవానిని సంపాదించుకొన వచ్చును.

(4) ముముక్షుత్వము:—

సంసారములో చిక్కుపడితిని: దీనిలోనుండి తప్పించుకొనుట యెట్లులభించును? నన్ను రక్షించునది ఎవరు? మోక్షమెట్లు లభించును? అని అతికాంక్షతో, మోక్షమును పొందకోరుట. అన్నిటికంటె, ముఖ్యము, సద్గురుకటాక్షము గురుశుశ్రూష [illegible]

**8 ముముక్షువయినజీవునకుసప్త భూమికలు– అనగా, అజ్ఞానదశలో నుంచి మోక్షమార్గము అలవడు వరకు గల యవస్థలు:—**

(1) అవిద్య: సమస్తము బ్రహ్మమనుమని తెలియక నుండుట– అనగా కూటస్థబ్రహ్మము నెఱుగకనుండుట; ఇదియే కారణశరీరము.

(2) ఆవృతి (ఆవరణ): కూటస్థబ్రహ్మము కలదని బోధింపబడినను, దాని, నమ్మక, ప్రవర్తించుట.

అగ్రహణం = తనను తాను గ్రహించుకొన లేక పోవుట

(3) విక్షేపము; తానుజీవుడనని సంసారమునందు వ్యవహరించుట ఇదిస్థూలసూక్ష్మశరీర స్వరూపమైనది. ఇదియంతయు నవిద్యా కార్యము.

అన్యథాగ్రహణం = ఇతరునిగా, కర్తనుగా, జీవునిగా తెలుసు కొనుట.

(4) పరోక్షజ్ఞానము; సంసారమునవిసికి మోక్షాపేక్ష గల్వాడై సద్గురువునాశ్రయించియతనివలనకూటస్థబ్రహ్మము న్నదని యెరుగుట.

(5) అపరోక్షజ్ఞానము, శ్రవణము, మననము నిధిధ్యాసము, సమాధి వీట్లవలనతానే కూటస్థబ్రహ్మ నేనని యెరుగుట.

(6) దుఃఖనివృత్తి: తానుకూటస్థ బ్రహ్మమని తెలుసుకొనినతోడనే– అనగా తాను దేహము, ప్రాణము, ఇంద్రియములు మొదలగునవి కాదనిన్ని, తెలిసికొనిన తక్షణమే, శరీరాదులకు గలుగు జనన మరణాదులకు దుఃఖంపడు.

(7) తృప్తి; నడుమవచ్చిన దుఃఖము నశించుచుండగా, తానే బ్రహ్మమను నిరతిశయానందము, అనగా సుఖము, స్ఫురించు చుండును. శాశ్వతమైనది సుఖమనిన్ని, దుఃఖము ఆగంతు కమనిన్ని, దెలియును. నిరతిశయ, ఆనందము స్ఫురించుటయే తృప్తి;అభ్యాసము వలన గ్రమక్రమముగా దుఃఖనివృత్తియై తృప్తికలుగును.

9. తృప్తి:— వైరాగ్యము; బోధ; ఉపరతి; వీనిని, ధృఢముగ నభ్యసించినయెడల తృప్తి గలుగును.

(1) వైరాగ్యము: విషయములందలి దోషమును గ్రహించి, భోగములను, తక్షణంవిడిచి, వాటిని మరలగోరక యుండవలయును

(2) భోధ: జ్ఞానము: శ్రవణ, మనన, నిది ధ్యాసలవలన జ్ఞానము సంపాదించి శరీర అహంకారాను లకంటె కూటస్థ బ్రహ్మ విలక్షణుడైయున్నా డని తెలుసుకుని, ఇట్టి జ్ఞానము యన్నటికి మఱుగుపడక, అజ్ఞానము ఉదయింప కుండుటయే జ్ఞానము.

(3) ఉపరతి: యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారములను విధియుక్తముగ, నభ్యసించి, చిత్తవృత్తి నిరోధము సంపాదించి సర్వ వ్యవహార సంక్షయము కావించుట ఉపరతి.

(4) పైమూటిలో బోధము- జ్ఞానము ప్రధానమైనది. ప్రత్యక్షమోక్ష ప్రదము. బోధగలిగిన వానికి, వైరాగ్య, ఉపరతులవలన మిక్కిలి సుఖము గలుగును.

(5) గనుక సాధనచతుష్టయసంపత్తిగల అధికారి వేదాంత విచారము సేయుచు వైరాగ్య బోధోపరతులు, తనకెట్లు వున్నవనితెల చుచు, పై సప్తభూమికలలో నుత్తరోత్తర భూమికలయందు నుండుటకు ప్రయత్నింప వలయును.



# బ్రహ్మవిద్య

## 3 వ ప్రకరణము

### శ్రుత్యుక్త వేదాన్త సిద్ధాంతములు

కొన్ని వేదాంత శాస్త్రన్యాయములు.

1. వేదముల యొక్కయు, వేదాంతములయొక్కయు, స్థితి.

ముక్తికోపనిషత్తునందు, శ్రీరామచంద్రమూర్తి, ఆంజనేయుల కిట్లుపదేశించెను.

మూ॥ హనూమాన్, శ్రుణు, వక్ష్యామి, వేదాంత స్థితిమంజసా.
నిశ్వాసభూతామే, విష్ణోర్వేదా, జాతా, సువిస్తరాః । తిలేషు,
తైలవద్వేదే, వేదాంతస్సుప్రతిష్ఠితః ॥

తా॥ ఓయాంజనేయా! వేదాంతములయొక్క స్థితిని శీఘ్రముగా చెప్పుచున్నాడను, ఆలకింపుము.

సర్వవ్యాపకుడనగు, నా యొక్క నిశ్వాసములే మిక్కిలి విస్తారములగల, వేదములగుచున్నవి. నువ్వులందు, తైలమువలె, వేదములందు, ఉపనిషత్తులు (వేదాంతములు). సుప్రతిష్ఠితములయి యున్నవి.

(ముక్తికోపనిషత్తు - ప్రథమాధ్యాయము 8-9 మూ)

2. ఆచార్యులు త్రివిధములనియు, తదుపదిష్టజ్ఞానమువలన, శిష్యుడు కృతకృత్యుడగుననియు, చెప్పబడినది.

మం॥ చోదకో బోధకశ్చైవ మోక్షదశ్చ పరః స్మృతః ।
ఇత్యేషాం త్రివిధో జ్ఞేయ ఆచార్యస్తు మహీతలే ।
చోదకో దర్శయేన్మార్గం బోధకః స్థానమాదిశేత్ ॥
మోక్షదస్తు పరంతత్త్వం యద్‌జ్ఞాత్వాఽమృతమశ్నుతే ॥
(బ్రహ్మవిద్యోపనిషత్తు- 51, 52, మంత్రములు)

తా॥ ఆచార్యులు చోదకుడు, బోధకుడు, మోక్షదుడు, అని త్రివిధములు-అందు 1 బోధకుడు- అజ్ఞుడగువానిని అహం బ్రహ్మాస్మి యని ఉపదేశించి తదనుసంధాన మొనర్పు చుండుమని ప్రేరేపించునట్టి ఆచార్యుడు 2 బోధకుడు- ఇతడు కేవలం మార్గదర్శకుడు. ఆ బ్రహ్మమునీవే "తత్, త్వమేవ, త్వమేవతత్" అని అజ్ఞుడగువానికి బోధించునట్టి ఆచార్యుడు బ్రహ్మప్రాపకుడవుట వలనబోధకు డనంబడు చున్నాడు. 3. మోక్షదుడు- అంతయు నాస్వరూపమే, నన్నే పొందగలవు, నాకంటె భిన్నముగ అణుమాత్రమైనను లేదు, అని పరమోపదేశ మొనర్చి స్వాతిరిక్తమైనది గలదను భ్రమనణగొట్టి మోక్షము నొసంగువాడు మోక్షదుడగు ఆచార్యుడు. అట్టి యాచార్యుడే పరతత్వము. యట్టి పరతత్వము నెరుంగుటవలన సాధకుడగువాడు అమృతత్వమును-అనగా మోక్షమును పొందుచున్నాడు. అట్టిపరతత్వస్వరూపుడే మోక్షదుడగు ఆచార్యుడు.

3. పరమాత్మ- బ్రహ్మ.

పరమాత్మ

శ్రు॥ సత్యం జ్ఞానమనన్తమానన్దం, సర్వజ్ఞత్వాద్యుపేతం, మాయోపాధికం, తత్పదార్థః పరమాత్మా । (సర్వసారోపనిషత్తు)

బ్రహ్మ:-

శ్రు॥ సర్వోపాధి వినిర్ముక్తం, నిర్విశేష చిన్మాత్రం, సదద్వైత మానస్థం, అవాఙ్మానసగోచరం, బ్రహ్మ. (సర్వ సారోపనిషత్తు)

బ్రహ్మ.

శ్రు॥ మహదహఙ్కార, పృథివ్యప్తేజోవాయు రాకాశాత్మక త్వేన, బృహద్రూపేణాణ్డ కోశేన, కర్మజ్ఞానార్థ రూపతయా, భాసమాన మద్వయ మఖిలోపాధి వినిర్ముక్తం, తత్సకలశక్త్యుప బృంహిత మనాద్యనన్తం, శుద్ధం, శివం, శాన్తం, నిర్గుణమిత్యాది వాచ్యమ నిర్వాచ్యం, చైతన్యం బ్రహ్మ. (నిరాలంబోపనిషత్తు)

తా॥ మహదహంకారమైన పృథ్వి జలము, అగ్ని, వాయువు ఆకాశము, అనునీభూతము లణగినట్టి మహద్రూపములై ప్రకాశించునవియును, రెండవది లేనిదియును, సకలమైనఉపాధి (అబద్ధపు వేషము) లేనిదియును, సర్వశక్తితో గూడినదియును, ఆద్యంతములు లేనిదియును, శుద్ధము, శుభము, శాంతము, నిర్గుణములను నీశబ్దములచే జెప్పబడు నదియును, వాక్కున కందనిదియును, అయినట్టి చైతన్యమే బ్రహ్మము.

ఈశ్వరః

శ్రు॥ బ్రహ్మైవ, స్వశక్తి, ప్రకృత్యాభి దేయమాశ్రిత్య, లోకాన్ సృష్ట్వా, ప్రవిశ్యాన్తర్యామిత్వేన, బ్రహ్మాదీనాం బుద్ధీన్ద్రియ నియంతృత్వా దీశ్వరః॥ (నిరాలమ్బోప నిషత్తు)

తా॥ బ్రహ్మమే తనయొక్క శక్తియగు ప్రకృతిచేత (ఈశ్వరుడనడి) పేరునుబొంది లోకములను సృష్టించి (అందు) అంతర్యామియై ప్రవేశించి బ్రహ్మాదులయొక్క బుద్ధికిని, ఇంద్రియములకును, నియామకుడై యుండుటవలన ఈశ్వరు డగుచున్నాడు.

## 4. బంధము – మోక్షము.

### బంధము.

శ్రు॥ ఆత్మానాత్మనో ర్దేహాదీన్ స్వాత్యస్తాత్మత్వే నాభిమన్యతే సోఽభిమాన ఆత్మనోబన్ధః॥ (సర్వసారోపనిషత్తు)

తా॥ ఆత్మయైనవాడు, ఆత్మ కానట్టిదైన దేహాదులను తానని భావించుకొని, వానిని ఆత్మయని అభిమానించుటచేత, ఆయభిమానము, ఆత్మకు బంధమగుచున్నది.

### మోక్షము.

శ్రు॥ తన్నివృత్తి ర్మోక్షః.

తా॥ దాని (బంధము) యొక్క నివృత్తియే మోక్షమనబడును.

### బంధము.

శ్రు॥ అనాద్యవిద్యావాసనయా, జాతోఽహమిత్యాదిసంకల్పో బన్ధః; పితృమాతృ సహోదరాఽపత్యగృహారామక్షేత్రాది మమతా బన్ధః సంసారావరణ సంకల్పో బన్ధః; కర్తృత్వాద్యహంకారసంకల్పో బన్ధః; అణిమాద్యష్టైశ్వర్యాశాసిద్ధి సంకల్పో బన్ధః; దేవమనుష్యాద్యుపాసనా కామసంకల్పో బన్ధః; యమాద్యష్టాఙ్గ యోగాభ్యాసాదిసంకల్పో బన్ధః; వర్ణాశ్రమ ధర్మకర్మ సంకల్పోబన్ధః; ఆజ్ఞా, భయ, సంశయాత్మ, గుణసంకల్పోబన్ధః, యజ్ఞవ్రత తపోదాన విధివిధాన జ్ఞానసంకల్పో బన్ధః; కేవల మోక్షాపేక్షా సంకల్పో బన్ధః; సంకల్పమాత్ర సంభవోబన్ధః॥ (నిరాలమ్బోపనిషత్తు)

### మోక్షః.

శ్రు॥ నిత్యానిత్య వస్తు విచారాదనిత్య సంసార సుఖదుఃఖవిషయ సమస్త క్షేత్రమమతాది సమస్త బన్ధ సంకల్పక్షయో మోక్షః॥ (నిరాలమ్బోపనిషత్తు)

5. అవిద్య — విద్య:—

అవిద్య:—

శ్రు॥ యాతదభిమానం కారయతి సావిద్యా.

(సర్వసారోపనిషత్తు)

తా॥ (దేహమే ఆత్మయనెడి) అభిమానమును ఏదికలుగజేయుచున్నదో అదే అవిద్య - (అజ్ఞానము) - అనబడుచున్నది,

విద్య:—

శ్రు॥ సోఽభిమానోయయానివర్తతే సావిద్యా .॥

తా॥ ఆయభిమానము దేనివలననివృత్తియగుచున్నదో, అదేవిద్య, (జ్ఞానము) అనబడుచున్నది.

6. జీవన్ముక్తిః — విదేహముక్తిః:—

జీవన్ముక్తిః.

మూ॥ స హోవాచ శ్రీరామః :—పురుషస్య కర్తృత్వ భోక్తృత్వ, సుఖదుఃఖాదిలక్షణః, చిత్తధర్మః, క్లేశరూపత్వాద్బంధో భవతి, తన్నిరోధనం జీవన్ముక్తిః .

(ముక్తికోపనిషత్తు – ద్వితీయాధ్యాయము – మూ 2)

తా॥ పురుషుడు, నేను కర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని, అనిచిత్తధర్మములను తనయందారోపించుకొనుట చేతనే సకలక్లేశములు, సంసారము ప్రాప్తించుచున్నవి, అదియే బంధము. గుర్వాచార్యాను గ్రహమువలన తానట్టిబంధమునుండి, ముక్తుడగుటయేజీవన్ముక్తియనంబడును. జీవన్ముక్తుడు లోకదృష్టికి సంసారివలె తోచునుగాని, తాను మాత్రము బ్రహ్మస్వరూపుడయ్యేయుండును.

విదేహముక్తిః:—

మూ. ఉపాధి వినిర్ముక్తఘటా కాశవత్, ప్రారబ్ధక్షయా ద్విదేహ ముక్తిః; జీవన్ముక్తి విదేహ ముక్త్యోరష్టోత్తర శతోపనిషదః ప్రమాణాం। కర్తృత్వాది దుఃఖ నివృత్తిద్వారా, నిత్యానంద వాప్తిః ప్రయోజనం భవతి; తత్పురుషప్రయత్న సాధ్యో భవతి॥ (ముక్తికోపనిషత్తు)

తా॥ ఆంజనేయుని ప్రశ్నను నొనర్చిన పిదప శ్రీరామచంద్రుండీ విధముగా చెప్పుచున్నాఁడు. పురుషుఁడు నేనుకర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని, అని చిత్తధర్మములను తన యందారోపించు కొనుటచేతనే సకలక్లేశములు, కాలవాలమగు, సంసారము ప్రాప్తించుచున్నది. అదియే బంధమనియు, చెప్పబడును. గుర్వాచార్యాను గ్రహమ్మువలన, తానట్టి బంధమునుండి, ముక్తుఁడగుటయే, జీవన్ముక్తి యనబడును. జీవన్ముక్తుఁడు, లోకదృష్టికి, సంసారివలె తోచునుగాని, తానుమాత్రము బ్రహ్మస్వరూడయ్యేయుండును.

7. బ్రహ్మజ్ఞానము.

శ్రు॥ సమూలా (ల + అ)నాత్మ, నివర్తకం సద్బ్రహ్మణి, విలీయతే॥ (సర్వసారోపనిషత్)

తా॥ అనాత్మయైన దేహాదులను, సమూలముగాని హ్యాత్తి చేసికొని సత్తామాత్రమైన బ్రహ్మమునందు లయమొందుటయే — బ్రహ్మజ్ఞానము.

8. పదార్థములు 3 విధములు:—

వా॥ సదసన్మిథ్యా చేతి త్రయః ॥

తా॥ సత్, అసత్, మిథ్య అనిమూడు విధములు.

వా॥ సదేవ తత్ర బ్రహ్మ॥

తా॥ వానిలో సత్తే బ్రహ్మము.

వా॥ అసత్తుచ్ఛమ్.

తా॥ తుచ్ఛమైనది, అసత్తు (లేనిది).

వా॥ జగత్కల్పితం బ్రహ్మణ్య సత్యంమిథ్యా.

తా॥ లేని ప్రపంచమును బ్రహ్మమునందారోపించుటమిథ్య.

వా॥ బ్రహ్మైవాత్మా జ్ఞేయః.

తా॥ ఆత్మయైన బ్రహ్మమే తెలియదగినది. (సర్వసారోపనిషత్తు)

౨. శ్రు. సత్యం,జ్ఞాన,మనంత. మానందంబ్రహ్మ (సర్వసారోపనిషత్)

సత్యం,

| | |
|---|---|
| (అ) సదితిశ్రౌత, ప్రతీతి, లక్ష్యం సత్యం | వేదములచే నిరూపింపబడు లక్ష్యమగున సత్తుయేదియో అదేసత్యము. |
| (ఆ) అసదిత్యవాచ్యం సత్యం | అసత్తని లేనిని చెప్పగూడదో అదే సత్యము. |
| (ఇ) త్రికాలాబాధ్యం సత్యం | త్రికాలములయందు బాధింపబడని దేదియో అదే సత్యము. |
| (ఈ) త్రికాలానుస్యూతం సత్యమ్. | త్రికాలముల యందును విడువక చేరి యుండున దేదియో అదేసత్యము. |

(ఉ) యదస్తితత్సత్యమ్, :— ఏదియున్నదో అదిసత్యము.

| | |
|---|---|
| (ఊ) ఏకమేవాద్వితీయం సత్యం. | రెండవది లేక ఒక్కటే యైన దేదియో అదే సత్యమ్. |
| (ఎ) సజాతి, విజాతిస్వగత,భే దరహితం సత్యమ్. | సజాతీయ విజాతీయ స్వగతభేదము లేనిది సత్యము. |
| (ఏ) సర్వకల్పనాధిష్ఠానం, వాసత్యమ్. | సకల కల్పనలకునుఅధిష్ఠానమై నెలవై యుండున దేదియో అదేసత్యము. |

అవినాశి.

| | |
|---|---|
| దేశకాల వస్తునిమిత్తాదిషువినశ్యత్సు యున్న వినశ్యతీతి | దేశము, కాలము, వస్తునిమిత్తము మొదలగు నవినాశము జెందినను ఏదినాశము జెందకయుండునో అదే అవినాశి యనంబడును |

జ్ఞానము:

(అ) స్వప్రకాశం జ్ఞానమ్ :—తనంతట ప్రకాశించునదే జ్ఞానము.

| | | |
|---|---|---|
| (ఆ) | సర్వప్రకాశకం జ్ఞానమ్. | సమస్తమును ప్రకాశింప జేయునదే జ్ఞానము. |
| (ఇ) | నిరావరణచిన్మాత్రం జ్ఞానమ్ | ఆవరణములేని చిన్మాత్రస్వరూపమే జ్ఞానము. |
| (ఈ) | అనాద్యనన్తం నిరంతరమవృత్తివృత్తిసాక్షి చైతన్యమేవ జ్ఞానమ్. | అనాదిగను, అనంతముగను, నిరంతరముగను, వృత్తిలేనిదిగను వృత్తికి సాక్షిగను, నుండు చైతన్యమే జ్ఞానము. |

అనంతము:

| | | |
|---|---|---|
| (అ) | ఉత్పత్తి వినాశరహితమనన్తమ్ | ఉత్పత్తియును, నాశమును లేనిది అనంతము. |
| (ఆ) | షడ్భావవికారరహితమనన్తమ్ | షడ్భావ వికారములు లేనిదే అనంతము. |
| (ఇ) | సర్వోపాధివినిర్ముక్తమనన్తమ్ | ఉపాధు లేవియు లేనిది అనంతము. |
| (ఈ) | మృద్వికారేషు మృదివ, స్వర్ణవికారేషు స్వర్ణమివ, తన్తువికారేషు తన్తురివ, అవ్యక్తాదిసృష్టిప్రపఞ్చేషు, వ్యాప్య, పూర్ణమవినాశి, చైతన్యమనన్తమ్. | కుండ, మూకుడు, మొదలగునవి యన్నియు, మట్టిలోవలెను; కటకకేయూరాదు లన్నియు బంగారములోవలెను; అంగవస్త్రము, పాగా మొదలగునవి యన్నియు, నూలులో వలెను; అవ్యక్తము మొదలగు సృష్టి ప్రపంచమునందు వ్యాపించి; పూర్ణమై, నాశరహితమై, యుండు చైతన్యమే అనంతము. |

ఆనన్దము:—

| | |
|---|---|
| శ్రు॥ అమ్బుపామర్ణవఇవ. సుఖ చేతనానామధిష్ఠానం నిత్య, శుద్ధాఖణ్డాద్వైత చిదానందైకరసమానన్దః. | జలములకు సముద్రమువలె, సుఖరూపమైన చేతనములకు, ఆధారమై శాశ్వతమై, శుద్ధమై, అఖండమై, అద్వైతమై, చిదానందమై, ఏకరసమై యుండునదేదియో అదే ఆనందము (సర్వసారోపనిషత్తు) |

10. విద్వానితిచ.

| | |
|---|---|
| శ్రు॥ సర్వాన్తస్థ, స్వసంవిద్రూప విద్విద్వాన్. | విద్వాంసుడు. సర్వమునందును అంతర్యామియైయుండునట్టి స్వజ్ఞాన స్వరూపమును తెలిసినవాడు విద్వాంసుడు. |

11. మూఢఇతిచ.

| | |
|---|---|
| శ్రు॥ దేహావర్ణాశ్రమ కర్తృత్వ భోక్తృత్వా ద్యహంకార భావనారూఢో మూఢః | తనదేహము, తనజాతి, తనయాశ్రమము తానేచేయువాడు, తానే అనుభవించువాడు, అనునీ మొదలగుఅహంకార భావన కలవాడు మూఢుడు. (నిరాలమ్బోపనిషత్తు) |

12. తపఇతిచ.

| | |
|---|---|
| శ్రు॥ బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యపరోక్షజ్ఞానాగ్ని నాదగ్ధబ్రహ్మాద్యైశ్వర్యాశాసిద్ధసంకల్పబీజసన్తానరూపం తపః, (నిరాలమ్బ పనిషత్తు) | తపస్సనగా:— బ్రహ్మముసత్యము, జగత్తు అసత్యము, అనెడి అపరోక్షజ్ఞానాగ్ని చేత, బ్రహ్మాదుల యైశ్వర్యమునందలి. దృఢాభిలాషయనెడి బీజమునుకాల్చుటయే |

13. పరమపదం

శ్రు॥ ప్రాణేంద్రియాద్యంతఃకరణ, గుణాదేఃపరతరం, సచ్చిదానందమయం, సర్వసాక్షికం, నిత్యముక్తబ్రహ్మస్థానం, పరమపదమ్.

పరమపదము: ప్రాణము, ఇంద్రియములు, అంతఃకరణము, గుణములు, వీనికంటె మిక్కిలి శ్రేష్ఠమైనదియు, సచ్చిదానంద స్వరూపమైనదియు, సర్వసాక్షియైనదియు, నగు నిత్య, ముక్త బ్రహ్మస్థానము పరమపదము.

(నిరాలమ్బోపనిషత్తు.)

14. సన్న్యాస ఇతిచ.

శ్రు॥ సర్వధర్మాన్ పరిత్యజ్య, నిర్మమో, నిరహఙ్కారోభూత్వా బ్రహ్మైకంశరణముపగమ్య, తత్త్వమసి, సర్వంఖల్విదంబ్రహ్మ, నేహనానాస్తికించనేత్యాది, మహావాక్యార్థాను సన్ధానానుభవజ్ఞానాద్బ్రహ్మైవాహమస్మీతి, నిశ్చిత్య నిర్వికల్ప సమాధినా, స్వతన్త్రో, యతిశ్చరతి: ససన్న్యాసీ, సముక్తస్సపూజ్యస్సయోగీ సపరమహంస స్సోఽవధూతస్సబ్రాహ్మణ ఇతిచ.

(నిరాలమ్బోపనిషత్తు)

15 అవధూతలక్షణం

శ్లో॥ అక్షరత్వాత్ । వరేణ్యత్వాత్ । ధూతసంసారబంధనాత్ తత్త్వమస్యాదిలక్ష్యత్వాత్ । అవధూత ఇతీరితః.

16. మాయాస్వరూపము.

(సర్వసారోపనిషత్తులోని వాక్యములు)

(1). శ్రు॥ అనాత్మనో మూలంమాయా.

తా॥ అనాత్మకు మూలమైనదిమాయ.

(2). శ్రు॥ సాచబ్రహ్మణ్యాకాశే, మేఘాదిరివ, దృశ్యతే॥

తా॥ ఆమాయయనునది, ఆకాశమందు మేఘము మొదలగు వాని వలె బ్రహ్మమునందు కనబడుచున్నది.

(3). శ్లో॥ మాయానామ, అనాది, రన్తవతీ । ప్రమాణాప్రమాణ, సాధారణా । న, సతీ । న, అసతీ । న సదసతీ। అనిర్వాచ్యాధిష్ఠాన, ఏవాZవిద్యమానా । అన్తర్వాణి వికల్పా నిరూప్యమాణోచ్చావచవ్యవహారభేదవతీ । యా, నవిద్యతే, వస్తుతః, సామాయా.॥ అనగా:—

మాయా, నామ, అనాదిః, అన్తవతీ = మాయానామమల్గిలె ఆదిలేనిది, అన్తముకలదిన్నీ.—

ప్రమాణాప్రమాణ సాధారణా॥ చక్షురాది ప్రమాణములున్ను, ప్రమాణము లేకపోవుటకున్ను, సమానమైనది; అందువల్లనే ఈమాయను అనిర్వాచ్యమని, బ్రహ్మవేత్తలు చెప్పుదురు. జాగ్రత్ స్వప్నావస్థలయందు వుండుటచేతనున్ను, సుషుప్త్యవస్థయందు, తూష్ణీంభావావస్థయందు, నిర్వికల్పకసమాధియందున్ను, లేకపోవుటచేతనున్ను, ప్రమాణా ప్రమాణ సాధారణమైనది.

నసతీ నాసతీ న, సదసతీ అనిర్వాచ్యా అధిష్ఠానఏవ, అవిద్యమానా॥

మాయ, వున్నదికాదు; లేనిదికాదు; వున్నదీ లేనిదికాదు; చెప్పుటకు శక్యముకాదు; ఆధారమైన బ్రహ్మయందు లేనిదిన్ని,

అన్తర్వాణి, వికల్పా, నిరూప్యమాణా, ఉచ్చావచ, వ్యవహారభేదవతీ॥

మాయ, మనస్సుయందైన, స్వరూపముచేత చూపబడేదిన్ని; (మనస్సుచేత మాత్రమును గోచరింపబడునది): నానావిధమైన వ్యవహార భేదముకలదిన్ని,

యా, సవిద్యా తేవస్తుతః, సామాయా.

యదార్థముగా విచారిస్తే, ఏదిలేదో, అదిమాయ.

(4). తత్స్వరూప మజ్ఞానమ్.॥:— మాయఅనునది అజ్ఞానము.

(5). తదేవ మూల ప్రకృతిః } ఆ మాయయే మూల ప్రకృతియనబడును.

(6). గుణసామ్యమ విద్యేత్యాద్యనేకాకారాజగదాకారేణ పరిణతా } ఆమాయ, గుణసామ్యము (సత్వాది గుణములు ఒకనితో ఒకటికలియక యుండు స్థితి) అవిద్య, ఈమొదలగు పలువిధములైన ఆకారములుగలది, ప్రపంచాకారముగా పరిణమించి యుండునది.

(7). తదేవం బ్రహ్మ విజ్ఞానాత్ అను భవతిచ.

తా॥ ఆమాయను బ్రహ్మజ్ఞాని యీవిధముగా దెలిసియనుభవించుచున్నాడు:—

(అ)శ్లో॥ నైవం భవామ్యహం దేహో । నేన్ద్రియాణి, దశైవతు । నబుద్ధిర్మన ఈశశ్చ । నాహఙ్కారస్త థైవచ॥

తా॥ నేను దేహముగాను పది యింద్రియములునుగాను, బుద్ధి మనస్సు ఈశ్వరుడుగాను, ఆరీతిగనే అహంకారముగాను

(ఆ)శ్లో॥ అప్రాణో హ్యమనా శ్శుభ్రో । బుద్ధ్యాదీనాం హిసర్వదా సాక్ష్యహం । సర్వదా నిత్యశ్చిన్మాత్రోఽహం సదాశివః॥

తా॥ ప్రాణము కలవాడనుకాను; మనస్సు గలవాడనుకాను; పరిశుద్ధుడను; బుద్ధి మొదలగు వానికెల్లపుడును, నేను సాక్షిగానుండువాడను; నేనే కాలమందును నాశమొందని వాడను, చిత్స్వరూపుడను; సర్వకాలము నందును శుభకరుడను.

(ఇ) శ్లో॥ నాహంకర్తా, నైవభోక్తా । ప్రకృతే స్సాక్షిరూపకః । మత్సాన్నిధ్యాత్ప్రవర్తన్తే దేహాద్యా అజడా ఇవ ॥

తా॥ నేనుకర్తకాను, భోక్తకాను, ప్రకృతికి సాక్షిస్వరూపముగనుండువాడను; నాతో గూడినంతనే దేహాదులు జడముకానియట్లు కార్యములు చేయుచున్నవి.

(ఈ) శ్లో॥ స్థాణుర్నిత్యస్సదానన్దశ్శుద్ధో జ్ఞానమయోఽమలః । ఆత్మాఽహంసర్వభూతానాం విభుస్సాక్షీనసంశయః ॥

తా॥ నేనుస్థిరమును, నిత్యముగను, సర్వదా ఆనందముగను నిర్మలముగను, జ్ఞానస్వరూపముగను మలరహితుడుగను, సర్వభూతములకును ఆత్మగను, సర్వత్రవ్యాపించియుండువాడుగను, సాక్షిగనుండువాడను. (వీనికి) సందేహములేదు.

(ఉ) శ్లో॥ బ్రహ్మైవాహం సర్వవేదాన్తవేద్యం, నాహంవేద్యంవ్యోమవాతాదిరూపమ్ రూపంనాహం । నామనాహం । నకర్మ, బ్రహ్మైవాహం । సచ్చిదానన్దరూపమ్.

తా॥ సకల వేదాంతముల చేతను తెలిసికొనదగిన బ్రహ్మము నేనే. తెలియదగిన ఆకాశము వాయువు మొదలగురూపము నేను కాను. నేనురూపముకాను, నామముకాను, కర్మముకాను, సచ్చిదానంద స్వరూపియైన బ్రహ్మమే నేను.

(ఊ) శ్లో॥ నాహం దేహోజన్మ మృత్యూకుతో మే । నాహంకారః క్షుత్పిపాసే కుతో మే । నాహం చేతశ్శోక మోహౌకుతో మే। నాహం కర్తా । బంధమోక్షౌ కుతో మే॥

తా॥ నేను దేహముకాను (కనుక) నాకు పుట్టుచావు లెక్కడివి? నేను అహంకారము కాను (కనుక) నాకు ఆకలిదప్పులెక్కడివి? నేను మనస్సుకాను; నాకు దుఃఖమోహము లెక్కడివి? నేను కర్తకాను-గాన- నాకు బంధమోక్షము లెక్కడివి?

(ఏ) శ్లో॥ ఇతిమునీ । సదృశ్య వాణ్యువాచ । సత్యమితి మునీ సదృశ్య వాణ్యువాచ । సత్యమిత్యుప నిషత్ ॥

ఓం సహనా వవతిత్వితిశాంతిః

తా॥ అని మునులకు (పైచెప్పిన ఆరుశ్లోకములను) అదృశ్యవాణి చెప్పెను.

సత్యమని మునులకు, ఆకాశ వాణిచెప్పెను. ఈఉపనిషత్తు సత్యమే

(సర్వసారోప నిషత్తు)

**17.** అద్వైత సిద్ధాంతమునకు సంబంధించిన కొన్నిముఖ్య శ్రుతివాక్యములు:—

(1) శ్రు॥ తస్మాద్వాఏతస్మా దాత్మన ఆకాశస్సంభూతః॥ అనేగతి శ్రుతికి అర్థము.

తా॥ ఆ, ఈఆత్మవల్లనుంచి ఆకాశము పుట్టినది. ఆకాశంవల్ల — వాయువున్ను—ఆవాయువువల్ల అగ్నియున్ను ఉదకమున్ను—ఉదకంవల్లను-పృథివియున్ను— పృథివివలన— ఓషధులున్ను—వాటివలన అన్నమును—అన్నం వలన పురుషుడున్ను (జీవుడున్ను) పుట్టినవి—అని;

అనగా కారణము కంటె కార్యము వేరుకాదు; గడక—మురుగులు ఉంగరములు మొదలైన ఆభరణములు సువర్ణముకంటె వేరుకానట్లు—ఈజగత్తు—జీవుడున్ను—కారణమైనబ్రహ్మకంటెవేరు కాదనితాత్పర్యము.

(2) శ్రు॥ "వాచారంభణం వికారోనామధేయం। మృత్తికేత్యేవసత్యం అనె ఆరంభణ శ్రుతి కూడా ఈఅర్థమునే చెప్పుచున్నది.

ఈ ఆరంభణ శ్రుతితాత్పర్య మేమనగా:— కార్యమైన ఘటశరావాదులకంటె— కారణమైన మన్ను వేరుకానట్లు— కార్యములైన జగజ్జీవులు కారణమైన బ్రహ్మకంటె వేరుకావని తాత్పర్యము.

(3) శ్రు॥ తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్"॥ అనేప్రవేశశృతికి అర్థము.
సూపం పక్త్వా— ఓదనంపచతి— అనే వాక్యమందు— పప్పువండి

అన్నమును వండుచున్నాడు— అనే వాక్యమందు పప్పువండే వాడున్ను అన్నం వండేవాడున్ను ఒక్కడే అయినట్లు—సృజించినవాడున్ను—ప్రవేశించిన వాడున్ను—ఒక్కడే అని ఏకకర్తృకత్వమును బోధించుచున్నది. శ్రు॥ సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్॥— అనే శ్రుతి ప్రకారం అర్థము— ఈసృష్టికంటె పూర్వమందు సద్రూపమైన బ్రహ్మముకంటె వేరుఏమియు లేదనియున్ను బ్రహ్మవక్కటే వున్నదనియున్ను చెప్పుచున్నది. ఇతరసామగ్రి ఏమీలేక, తను ఒక్కడువున్నప్పుడు—సృష్టియనగా అనేక రూపములగా కనపడుట— గారడీవాడు అనేక వస్తువులను సృష్టించినట్లు—అనగా—వాడి గారడీ శక్తివలన అనేక స్వరూపములు— స్వతః లేనివి అయినప్పటికి అనేకంగావుండి కనపడినట్లు, బ్రహ్మయొక్క మాయాశక్తిచేత, బ్రహ్మ అనేక రూపములు లేనప్పటికి— అనేకరూపములు ఏమరుకుండా వున్నట్లున్ను వాటినిచూచే ఒక చిదాభాసుండు వున్నట్లున్ను, అవిద్యచేత—ఏకప్రకార కనుపించునేగాని— రజ్జువునందు సర్పము కనుపించునట్లు. అనగా తనయందే నానా రూపములు వున్నట్లు, బ్రహ్మయందు మాయచేత కనుపించునేగాని వస్తుతః ఒక్కటే—బ్రహ్మస్వరూపము అయి వున్నదని ప్రవేశ శ్రుతియొక్క తాత్పర్యము.

(4) శ్రు॥ సర్వం ఖల్విదం బ్రహ్మ । నేహనానాస్తి కించన॥ అనే శ్రుతికి అర్థము: ఇదం = ఈ కనుపించే దృశ్యజాతమంతయు—బ్రహ్మస్వరూపమేగాని—అతనికంటె వేరుగా లేదని। అనగా ఆరంభణ శ్రుతిప్రకారం కార్యకారణములకు అభేదమేగనుక కార్యప్రపంచమునూ వస్తుకారణమైన బ్రహ్మకంటె వేరుకాదనిన్ని—బ్రహ్మమే మాయచేత — ఒక్కటి అయినప్పటికి, అనేకములుగా—సముద్రమునందు — తరంగములు, బుద్బుదములు మొదలైనవి — మూలములకు వేరుగాను అనేకములుగాను కనుపించినట్లు కనుపించునే

గాని – తెలిసిన వారికి వక్క సముద్రముగానే కనుపించినట్లు– అనేకములైన జగజ్జీవులుకూడా తెలిసిన విద్వాంసులకు వక్క బ్రహ్మముగానే కనుపించును.

(5) శ్రు॥ ఏషాంనోఽయమాత్మాయంలోకః అనే శ్రుతికిఅర్థము–విద్వాంసులము అయినమాకు, ఏఆత్మ అయితే వున్నదో – ఆ ఆత్మే మాయొక్క స్వరూపము అని, తెలిసిన విద్వాంసులు తలుస్తూవుంటారు గనుక–ఈ జగత్తు – ఈపంచభూతములవల్ల పుట్టిన మాదేహేంద్రియాదులున్న ఆత్మస్వరూపమే అని ఆత్మజ్ఞానులు చూచు చున్నారని తాత్పర్యము. అనగా ఆత్మ స్వరూపమే మాయచేత బహువిధములుగా కనుపించు చున్నదని తాత్పర్యము, అనగా తాడునుచూచి పాము అనుకున్నప్పుడు పాముకాదు, తాడు ఇది అని చెప్పినప్పుడు పాముపోయి తాడు మిగిలినట్లు– "బాధాయాం సామానాధికరణ్యాం"। అనే న్యాయంచేత– తాడె పరిశేషించును.

(6) గనుక ఏవిధంగాచూచినను జీవబ్రహ్మలకు ఏకత్వము తప్పకుండా సిద్ధించును. ఈ ప్రకారంగానే సర్వశ్రుతులు– జీవుడే– బ్రహ్మము– బ్రహ్మమే జీవుడు– అని ఇద్దరికి ఏకత్వమునే చెప్పుచున్నవి. అనగా మొత్తంమీద ఒక్కడేగాని ఇద్దరు లేరు గనుక ఈనాలుగు విధములైన శ్రుతుల ప్రకారమున్ను– ఇతరమైన సమస్త శ్రుతులును అనుసరించి చూడగా ఒక్క బ్రహ్మమే అనేకములుగా మాయచేతను స్థాణువునందు పురుషుడుకనుపించుచున్నట్లు, భ్రాంతి జనితబుద్ధి వికారములచేత బహువిధంగా కనుపించునుగాని గుర్వనుగ్రహముచేత శాస్త్రాభ్యాసం చేతనైన శ్రవణ మనన నిధిధ్యాసలచేత; బ్రహ్మసాక్షాత్కారం అయిన తర్వాత, భ్రాంతిపోవగానే పరిశేషన్యాయంచేత, బ్రహ్మమిగులు చుండును. జీవబ్రహ్మైక్యము సిద్ధించిన పిమ్మట విద్వద్దృష్టిచేత చూచినయెడల, సిద్ధవస్తువైన శుద్ధబుద్ధముక్తస్వభావమైన బ్రహ్మమే సిద్ధించును.

మిథ్యాభూతులైన జగజ్జీవులు నశించును. స్వప్నమునందు కనుపించిన వ్యాఘ్రగజాదులు వలెనే, జగద్భావ జీవభావములు నశించగా, ఒక్క బ్రహ్మమే మిగులును. ఇదిసర్వశాస్త్రసిద్ధాంతము. ఈ ప్రకారము తెలిసిన వారే బ్రహ్మవేత్తలు-వీరికి దేవతలు కూడా నమస్కరించెదరు. వీరివంశమునందు అజ్ఞానులు పుట్టరు. ఈజ్ఞానుల యొక్క వంశీకులందరు ముక్తినిపొందెదరు.

**18.** సర్వము పరబ్రహ్మ స్వరూపమే.

బ్రహ్మ

| 1 | 2 | 3 |
|---|---|---|
| పరిశేష న్యాయముచేత జగజ్జీవులు మిథ్యాభూతులుగనుక, ఆత్మశేషించును. భ్రాంతికల్పితమైనసర్పము పోతే రజ్జువే శేషించినట్లు. | ఆత్మయందు-స్వప్నావస్థయందు తనకు కనిపించే వ్యాఘ్ర గజాదులు, మేలుకొన్నప్పుడు, అవి మిథ్యాభూతములై తను వక్కడే మిగిలినప్పుడు, అవితనకంటె యితరమైనవి యెట్లుకాదో జాగ్రదవస్థయందు కూడా, తనఆత్మ చైతన్యమందుకనుపించే దృశ్యజాతమంతాకూడా, ఆత్మ చైతన్య జ్ఞానముకంటె యితరముకాదు. అనగా సర్వము ఆత్మస్వరూపమే. దీనికి ప్రమాణం శ్రు॥ సర్వం ఖల్విదం బ్రహ్మ॥ | సుషుప్త్యవస్థయందు, స్వప్నప్రపంచము జాగ్రత్ ప్రపంచము, మిథ్యయైనప్పుడు, ఒకఆత్మయేమిగిలియుండును గనుక, అసంగుడైన ఆత్మయేపరిశేషించియుండును. ఇందుకుప్రమాణము:— శ్లో॥ అవినాశి తుతత్ విద్ధి-యేన సర్వమిదం తతం॥. గీతావాక్యంప్రమాణము. |

## 19. కొన్ని వేదాంతశాస్త్ర న్యాయములు:—

(1). బ్రహ్మవేత్తయొక్క స్వరూపము, జీవన్ముక్తి దశయందు "గంగా నిమగ్నార్ధ కాయ న్యాయముగా" వుండునని, పంచదశి మొదలైన వేదాంత శాస్త్రములందు నిరూపించ బడినది, అనగా, గంగలో స్నానము చేసేటప్పుడు, ఊర్ధ్వభాగముచేత, ఉష్ణత్వమును, అధోభాగముచేత, శైత్యమునున్ను ఉభయమునున్ను ఏక కాలమందు అనుభవించుట వలెనే బ్రహ్మవేత్త విషయ సుఖమునున్ను మోక్ష సుఖమునున్ను ఏక కాలమందే అనుభవించుచుండును. అనగా జ్ఞాని దుఃఖానుభవ కాలమందును నిజానుసంధానమును జేయును. దుఃఖకాలమందుకూడ, బ్రహ్మానుభవము చెడదు. బ్రహ్మవేత్త, విషయానందమును, బ్రహ్మానందమును రెండు భావములను తెలిసిన వాని వలెనరిగినవాడగును. ఇదే గంగానిమగ్నార్ధకాయ న్యాయము,

(2). కాకాక్షి న్యాయమనగా బ్రహ్మవేత్త, విషయజ్ఞానము, మోక్షజ్ఞానము కలవాడై సందర్భానుసారముగా, జీవన్ముక్తుడై రెంటిని అనుభవించును. అనగా, జ్ఞానియొక్క బుద్ధి, విషయ సుఖమునందును, బ్రహ్మానందమందును, కాకికన్నువలె, ఈవైపునకు, ఆవైపునకు, గమనాగమనములను చేయుచుండును. మరియు, ఈ విషయానందమును, బ్రహ్మానందమందు, అంతర్భావన చేసుకొనును.

(3). దేహళీదత్త దీప న్యాయమనగా, గుమ్మము మీదవుంచిన దీపము, ఇల్లు వెలుపలికైన్ని, అటు లోపలికైన్ని, వకటే, ఏక కాలమందు ఉభయత్రా, ప్రకటించి, ఎటుల ప్రకాశించునో, ఆ ప్రకారమే, జీవన్ముక్తుడైన బ్రహ్మవేత్తయున్ను, ఇటు సంసారమందున్ను, అటు మోక్షమందున్ను, ఉభయత్రా ఏక కాలమందే ప్రకాశించు నప్పటికి ఆయనకు సంసారబంధ ముండదు. విదేహముక్తుడగును. అనగా, అటు జీవభావమును, ఇటు

బ్రహ్మ భావమును జీవన్ముక్తుడు బ్రహ్మానేత్తనుభవించును. ఇది సమస్తవేదాంత శాస్త్రములయొక్క ముఖ్య అభిప్రాయము.

(4). బాధాయాం సామానాధికరణ్యా న్యాయము మనగా । తాడును చూచి పామనుకొన్నప్పుడు దీపము తెచ్చిన తరువాత, తాడేనని దృఢనిశ్చయము కలిగినప్పుడు, ఆపాముపోయినట్లు, యీ బ్రహ్మయందు కలిగినట్టి మిథ్యాజ్ఞానము, గురువువల్లను, శాస్త్రముయొక్క, శ్రవణ, మనన, నిధిధ్యాసలచేత, పోయి, పరిశేష న్యాయముచేత, బ్రహ్మమిగులుటయే, బాధాయాం సామానాధికరణ్యాం అనే న్యాయము.

(5). అభేదే సామానాధికరణ్యమనగా, జగత్తువున్న కాలములో కూడా, బ్రహ్మకంటె, వేరుగా లేకపోవుటయే; అనగా, కార్యము, కారణముకంటె వేరుగా లేదనిప్రూహించుట; దీనికి దృష్టాంతము, ఆభరణమైన కార్యరూపముగా వున్నప్పటికి కారణమైన సువర్ణముకంటె వేరుగానే లేదు. అనగా భ్రాంతిచేత, వేరుగావున్నట్టు మాత్రముకనుపించును. విమర్శిస్తే, కార్యకారణములగు బ్రహ్మ, జగత్తులకు, యేకత్వమేగానిపృథక్త్వములేదు. మాయచేత, వేరుగా వున్నట్లుకనుపించును జగన్మిథ్య, బ్రహ్మసత్యం, అనగా యిదే.

(6). అగ్రహణం, — అన్యథాగ్రహణాం, అనగా, వున్నట్టి బ్రహ్మస్వరూపమును గ్రహించలేక పోవుట అగ్రహణా. అసత్తే లేనట్టి మిథ్యాభూతమైన, జీవస్వరూపమును, ఆబ్రహ్మయందు ఆరోపించుటయే అన్యథాగ్రహణా. అనగా తాను బ్రహ్మముని గ్రహించలేకపోవుట; తానుజీవుడనని గ్రహించుట.

(7). ఏకవిజ్ఞానేనసర్వవిజ్ఞానంభవతి అనే, ప్రతిజ్ఞ వేదాంతశాస్త్రజ్ఞులచేత, వేదాంతమతమందు చేయబడ్డది. అనగా, వక సువర్ణము తెలిస్తే దానికి కార్యములైన సర్వాభరణములు, సువర్ణమేనని తెలిసినట్లు, దృష్టాంతమివ్వబడినది. ఈ ప్రకారముగానే, వక బ్రహ్మ

తెలిస్తే, బ్రహ్మకార్యములైన జగజ్జీవులు, యావత్తు తెలియబడు నని దార్ష్టాంతికము. ఈ ప్రతిజ్ఞా విషయములో, మరియొక దృష్టాంతము వకమృత్పిండము తెలిస్తే, దానికి కార్యములైన, ఘట, శరావాదులు సర్వమున్నూ, మృణ్మయము లేనని, తెలియబడును. ఒక అయః పిండము, అనగా, ఇనపముద్ద తెలిస్తే, దానికి కార్యములైన, సమస్త ఇనపసామాగ్రి తెలియబడును. ఇదే, ఏకవిజ్ఞానేన, సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ, అని చెప్పబడును.

(8). అధ్యారోపము– అపవాదము. శ్రుతి బ్రహ్మయందు, సృష్టిని వుందని, సత్యముగ, అధ్యారోపణచేసి అటుతరువాత, యీసృష్టియంతా మాయయని, అనగా, మిథ్యయని, అనగా అనృతమని, నిశ్చయించి పరిశేష న్యాయముచేత, బ్రహ్మవక్కడే వున్నాడని, నిశ్చయించును. ఇదే అధ్యారోప, అపవాద న్యాయము. లోకసిద్ధమైనది. అధ్యారోపధ్యాన శ్లోకములు; అపవాద ధ్యానశ్లోకములువుండును

(9). ఈశ్వరుడు అభిన్న నిమిత్తోపాదాన కారణము. ఈశ్వరుడు నిమిత్త కారణము, కులాలుడువలె,; మాయాపరిణామ్యుపాదాన కారణము, అనగా మన్నువంటిది. ఇదితత్వమసి అనేజహదజహల్లక్షణచేత ఈఅధ్యారోపాప వాదములు పోవును.

బ్రహ్మ, జీవ, జగత్తులకు, అన్యోన్యాధ్యాసచేత అభేద సామానాధికరణ్యము, బాధాయాం సామానాధికరణ్యము చేత వివర్త కారణ కార్యభావము నశించి బ్రహ్మవక్కడేమిగులును.

**20.** మాండూక్యోపనిషత్తు యొక్కయు, దీనికి వ్యాఖ్యానమైన గౌడపాదకారికలు యొక్కయు, ఈకారికలుకు వ్యాఖ్యానమైన శంకర భాష్యము యొక్కయు, సంగ్రహ, తాత్పర్యము:—

(1.) జాగ్రత్స్వప్న సుషుప్త్యభి మానులగు విశ్వతైజస ప్రాజ్ఞులు అను ఈముగ్గురు, ఓంకార స్వరూపులే. సర్వమోంకార ఏవ అనే మాండూక్య శ్రుతిప్రథమ మంత్రముచేత చెప్పబడి యున్నది.

(2.) ఇక రెండవ మంత్రమునందు చెప్పబడేయర్థమేమనగా శ్రు॥ స
ర్వగ్ంహ్యేతద్బ్రహ్మ ॥ అయమాత్మా బ్రహ్మ । సోయమా
త్మా చతుష్పాత్॥ అర్థము॥ విశ్వతైజస ప్రాజ్ఞులు అభిమానులు
గల జాగ్రత్స్వప్న సుషుప్త్యాత్మకమగు సమస్తమైన జంగమ
స్థావ రాత్మకమైన సకల ప్రపంచమున్ను బ్రహ్మస్వరూపమే
యనియు, ఆ బ్రహ్మనీ స్వరూపమే అనిన్ని నీస్వరూపమైన
యీఆత్మ నాలుగు పాదములు కలదనిన్ని చెప్పబడినది-

(3.) నాలుగు పాదములు వివరించ బడుచున్నవి. జాగ్రత్తులో వున్న
వాడున్ను వైశ్వానరుడుఅనే స్థూల పదార్థములను అనుభవించు
వాడున్ను । వకటవ పాదమని చెప్పబడుచున్నాడు; పాద
మనగా భాగము. స్వప్నావస్థయందుండి లోపలనే సమస్తపదా
ర్థములను చూచేవాడు తైజసుడు 2వ భాగము. ఇంక మూడవ
సుషుప్తి స్థానీయుడు 3వ భాగమని చెప్పబడుచున్నాడు. సుషు
ప్త్యవస్థయందు ఏకోరిక వుండదు. ఏస్వప్నమువుండదు. అనగా
జీవుడైన తనకు, పరమార్థ స్వరూపుడైన ఆనందమునే అనుభ
విస్తూవున్న ప్రజ్ఞాన ఘనుడైన ఆనందమునుఅనుభవించే, ఆనం
దమయుడై, ప్రాజ్ఞుడయిన మూడవ పాదము

(4.) నాలుగవ పాదమైన తురీయుడు యొక్కస్థితి యీయన సర్వే
శ్వరుడు- సర్వజ్ఞుడు- సర్వాంతర్యామి అందరియొక్క- ఉత్పత్తి
వినాశములు యీయనవలననే కలుగుచున్నవి ఈయనే తురీ
యుడైన నాలుగవ పాదము అనగా అమాత్రుడు.

(5.) అనగా నాటకంలో వకే పురుషుడు వేరుగా నాలుగు వేషము
లు వేసి, నాలుగు భాగములుగా నాలుగు అంశలుగా, స్వరూ
పములుగా వేరుగా, కనుబడునప్పటికి, పరమార్థంగా అసలు
స్వరూపుడు వక్కడే, వేషములు తీసివేసిన తరువాత, యీము
గ్గురు నిజంగా నే రేలేరు గనుక, అసలువాడే అయిపోయినట్లుగా,
వక అసలు వున్న అమాత్రుడైన తురీయుడే మిగిలి, వేషములు
మోస్తరైన, కల్పించబడ్డ విశ్వతైజస ప్రాజ్ఞులు ముగ్గురు అత్యం

తము లేనివారై, ఒక్క అమాత్రతురీయ బ్రహ్మమునే మిగులు చుచుందురు.

తరువాయి జంగమస్థావరాత్మక ప్రపంచాభిమానులు అయిన విశ్వతైజస ప్రాజ్ఞులు ముగ్గురు, అత్యంతము లేరుకాబట్టి, దీనించే విమర్శించిన తను గాక లేని మాయాకారులు అయిపోయి నట్లుగా ఒక్క తురీయుడే అయిపోతున్నారు. ఇదే సారాంశము. ఈ ప్రకారంగా తెలుసుకున్న బ్రహ్మవేత్తను, అందరము నమస్కరించుచున్నాము. అయనే బ్రహ్మస్వరూపుడు. ఇది చాలా కష్టసాధ్యము. అందరికిశక్యముకాదు. ఈ ప్రకారం నిత్యము ఎవరు ధ్యానం చేసెదరో వారు మహాజ్ఞానులు అనగా లోకోత్తరులని తాత్పర్యము.

మాండూక్యోపనిషత్తు యొక్క సంగ్రహము

సమాప్తము.

# బ్రహ్మ విద్య

## 4 వ ప్రకరణము

### 1. అధ్యాస భాష్యములోని విషయములు:

### అధ్యాస

(1) శాస్త్రమును యెందుకు అభ్యసించవలెను? యెందుకు తెలుసుకొనవలెను?

జవాబు: అధ్యాస నివృత్తికొఱకు.

(2) అధ్యాస యనగా నేమి?

జవాబు: అది కానిదానియందు అది అనేబుద్ధి అధ్యాస; వెండికాంతివంటి ముత్యపుచిప్పయందు, వెండియని, ముత్యపుచిప్పను చూచి అనుకొనుట అధ్యాస; వెండి ధర్మములనుబట్టి, అనగా తెలుపునుబట్టి తళతళనుబట్టి, ముత్యపుచిప్పను వెండిగా భావించుట అధ్యాస. ఒకచోట త్రాడువున్నది గాని పాములేదు; అయితే భ్రమవలన త్రాడు పాముగా కనుపించును; అది అధ్యాస. జగత్తు, జీవుడు, కాని బ్రహ్మయందు జగజ్జీవులనే బుద్ధి అధ్యాస. బ్రహ్మ, సత్యము, నిత్యము, నామరూపములు లేనిది; జగత్తు, జీవులు, నశించేస్వభావము గలవిన్ని, నామరూపములు గలవిన్ని అయివున్నవి. బ్రహ్మకున్నూ, జగజ్జీవులకున్నూ, సమానధర్మములు లేవు; అధ్యాస నిజముగా వుండకూడదు; ధర్మములనుబట్టిగాని, వస్తువునుబట్టిగాని, బ్రహ్మకున్ను, జగజ్జీవులకున్నూ, అధ్యాస కుదరదు; అధ్యాస కుదరక పోయినప్పటికి, వున్నదని చెప్పకతప్పదు.

అధ్యాస వలన, సత్యమైన బ్రహ్మను అసత్యమైనశరీరాదులను, జీవులను, కలిపివేశి, నాది, నేను, అని స్వాభావసిద్ధముగా లోకమునందు వ్యవహరిస్తున్నారు.

సమానధర్మములను చూచి అనుకున్నావొకటే, విభజించి కనుక్కొనలేక పోవడముచేత కలిగినదైనను వొకటే; యేవిధముచేత భ్రమకలిగినను, అధ్యాసయే యవుచున్నది. కేవల అజ్ఞానము వలన, – భ్రమవలన – అధ్యాస కలుగుచున్నది. త్రాటి యందు, పాము అనేబుద్ధివలె.

జీవుడు, జగత్తు, బ్రహ్మయందు కల్పించబడినవి. బ్రహ్మ లేక పోతే, నీవే లేకపోతావు. ఆత్మధర్మములు అనాత్మయందు అనాత్మధర్మములు, ఆత్మయందు, పెట్టి, జనులు వ్యవహరిస్తు న్నారు.

పుత్రదారాదులు చిక్కుతూవుంటే, తాను చిక్కుతున్నానని, అనుకొనుట (బాహ్యధర్మము); దేహముచిక్కితే నేను చిక్కుతున్నాననుకొనుట (దేహధర్మము); నేను మూగవాడిని అనుకొనుట (ఇంద్రియధర్మము); జగత్తుధర్మములన్నీ ఆత్మయందు ఆరోపించుచున్నాడు; ఇదివున్నది, దేహము సత్యము, (వస్తుత్వము, సత్యత్వము, అనేఆత్మధర్మములను దేహమందు చూచుచున్నాడు) ఇది అన్యోన్యాధ్యాస; అనగా, అవిద్య; అజ్ఞానము, తమస్సు, మూలప్రకృతి; ఈ అధ్యాస, మాయ, మొదటినుంచి, అందరికివున్నది; అంతఃకరణధర్మములు, ఆత్మధర్మములుకావు; నిజంగా అధ్యాస (సమానధర్మములు కలిగియుండుటవలన కలిగిన అధ్యాస,) లేనప్పటికిలోకవ్యవహారము కుబట్టివున్నది. లోకానుభవమునుబట్టి, తప్పకుండా వున్నదిగనుక అధ్యాస కుదరదని శంకించకూడదు.

అధ్యాసనే పండితులు అవిద్యయని చెప్పుదురు. విద్యయనగా నిత్యానిత్యవస్తువిభాగము. అనిన్నీవివేకము.

అధ్యాసను పురస్కరించుకుని సర్వవ్యవహారములు, లౌకికవ్యవహారములు జరుగుచున్నవి విధి ప్రతిషేధశాస్త్రములు, మోక్షశాస్త్రము, వేదాంతశాస్త్రము, యీ అధ్యాసను పురస్కరించుకునే ప్రవర్తించుచున్నవి.

అధ్యాస కలిగినందువల్ల నష్టమేమి? అధ్యాసమువలన - అజ్ఞానమువలన - చేయబడినసంబంధమే ప్రకృతిపురుషులసంబంధము. ఇదేసంసారకారణము; సంసారము దుఃఖహేతువు;

ప్రాణధర్మములను, ఇంద్రియధర్మములను, మనోధర్మములను అంతఃకరణధర్మములను తనయందు ఆరోపించుకొనుచున్నాడు; ప్రకృతితాదాత్మ్యమును పొందినవాడై, నేనుఎఱ్ఱగానున్నాను. (శరీరధర్మము), మంచివాడను (మనోధర్మము), గ్రుడ్డివాడను (ఇంద్రియధర్మము), నాకుఆకలిగినున్నది (ప్రాణధర్మము), అని అనుచున్నాడు. ఈధర్మములు, తనవి - జీవునవి; ఆత్మవిగావు;

దారాపుత్రాదులు కష్టపడుచుండగా, తాను కష్టబడుచున్నట్లు దుఃఖించుచున్నాడు; శరీరము మృతిబొందునప్పుడు, తాను మృతిబొందినట్లు భావించి దుఃఖపడుచున్నాడు. ఆత్మతాను, తన శరీరమునకు, సంబంధములేదని తెలుసుకొనలేకున్నాడు. సమస్త దుఃఖములు, కష్టములు, జనులు, అధ్యాస కలిగినందువల్లనే పొందుచున్నారు.

అధ్యాసఎట్లుపోవును?

వేదాంతశాస్త్ర విచారణవలన - అధ్యాస నివృత్తికాగలదు. అధ్యాస నివృత్తికొరకే వేదాంతశాస్త్రము ప్రవర్తించుచున్నది. శాసించేవన్నీ, మంచిమార్గమందు ప్రవేశపెట్టి ప్రభువులాగున మనిష్యుని బాగుచేశేదిన్నీ శాస్త్రము. ప్రకృతి పురుషవిచారణవలన అధ్యాస నివృత్తిఅవును.

అధ్యాస నివృత్తివలన ఫలమేమి?: అధ్యాస నివృత్తి యనగా సంసారనివృత్తి; నిరతిశయానందావాప్తి. ఇదే మోక్షము. సంసారము దుఃఖకరమైనది, గనుకనున్నూ; సంసారనివృత్తి, అధ్యాస నివృత్తివలన కలుగుచున్నది గనుకనున్నూ; అధ్యాస నివృత్తివలన శాశ్వతసుఖము కలుగును గనుకనున్నూ, శాస్త్రము యెందుకు అభ్యసించవలెనని శంక చేయకూడదు.
బ్రహ్మజ్ఞానమువలన, సూక్ష్మశరీరము –(లింగశరీరము – కర్మేంద్రియములు 5, జ్ఞానేంద్రియములు 5, ప్రాణపంచకము 5, మనస్సు, బుద్ధి, వెరశి 17,) – భంగమైతేగాని ముక్తిరాదు. అనగా లింగ భంగమైతే గానిముక్తి కలుగదు. జీవభావము ముక్తిపొందే వరకు నిశ్చయమై వుండును.

శరీరముయొక్కయు, ఆత్మయొక్కయు జ్ఞానము తెలుసుకొనవలెను. సర్వభూతములయందున్న ఆత్మవస్తువు, ఏకరూపము గలదనిన్నీ, నశింపదనిన్నీ జ్ఞాని తెలుసుకొనును. ప్రకృతి తత్కార్యములు ఆత్మయందు కల్పించబడినట్లును, ఆత్మకంటె సత్యమైనవస్తువ మరియొకటి లేదనిన్నీ ఆత్మకంటె వేరుగా తోచబడుచున్నను, ఆత్మసత్తాకంటె వేరుసత్తా లేదనిన్నీ, ఆత్మనుండియే ద్వైతస్ఫురణ యావత్తు కలుగుచున్నదనిన్నీ, ఆత్మ వ్యతిరిక్తమైనవస్తువే లేదనిన్నీ, సర్వము ఆత్మయేఅనిన్నీ శాస్త్ర విచారణవలన తెలుసుకుని బ్రహ్మవేత్త సుఖమునొందును.
ప్రకాశింప జేసేదాత్మ; ప్రకాశింపబడేదిఅనాత్మ; ఆత్మవస్తువే బ్రహ్మ; 'అహంబ్రహ్మాస్మి' అనేజ్ఞానము కలిగేవరకు అధ్యాస వుండును.
అధ్యాస యెక్కడనుంచివచ్చినది? యెందుకువచ్చినది? జీవుడు

జగత్తు, బ్రహ్మయందు కల్పించబడినట్లు, శాస్త్రము, గురువులు, అనుభవము, తెలియ జేయుచున్నవి. అన్యోన్యాధ్యాసకు, విషయి, ఆత్మ; కంటికి కనబడవలెననే నిర్బంధము లేదు, సాక్షాత్తు కనబడుచున్నాడు; నేనువున్నానంటున్నాడు–వీడుఅను

కొనుటవల్ల, - అధ్యాసవల్ల, వకదాని ధర్మములు, మరియొక దానికిఅంటవు. త్రాడు, నిజమైనకరిచేపాముకాలేదు. అనుకోవడమువలన, బ్రహ్మకాజాలేము. నీవువేరు, బ్రహ్మవేరు, అని గాకుండా ఏకత్వంగా తెలుసుకుంటే, ఆనందావాప్తికలుగుతుంది వేదాంత వేద్యమైనఆత్మను - ముఖ్యాత్మను తెలుసుకొనవలెను వానికి క్రియేలేదు. జీవాత్మను తెలుసుకుంటే చాలదు. ముఖ్యాత్మను తెలుసుకుంటె అవిద్యవుండదు.

అధ్యాస మూలముగానే, నేను,నాదిఅనుటచేతనే, అందరికి ప్రవృత్తికలుగుచున్నది; అధ్యాసలేనివానికి లోకములో వ్యాపారముండదు ఆత్మస్వరూపమునకు ప్రమాతృత్వములేదు. అవిద్య వున్నప్పుడే వుండును. పండితులుకూడా అవిద్యావంతులే. పశుప్రాయులే. ఒకదుర్జనుడు తననునరుకుటకు వచ్చినప్పుడుపారి పోవును. భయము, భయములేకపోవడము, అవిద్యవలననే వచ్చినవి. విద్యకలిగినవానికి, శరీరమేలేదు. తనకంటె సర్వ ప్రపంచమును, ఇతరముగాలేదని, సమన్వయించుకుంటాడు. శ్రుతి॥ సర్వంఖల్విదంబ్రహ్మ. శ్రుతి॥ నేహనానాస్తికించన. అనేశ్రుతులవలన అట్టివానికి, అధ్యాసేలేదు.

ఏకత్వజ్ఞానము కలిగినతరువాత నానాత్వజ్ఞానము ఎన్నడు తిరిగి కలుగదు.

ప్రమాత = భోక్త = ద్రష్ట = విజ్ఞాత = తెలుసుకునేవాడు = చిదాభాసుడు = సంసారి = జీవుడు.

జీవుడిని, బ్రహ్మగాచూస్తే హృదయగ్రంధులు విడుచున్నవి. జీవుడే బ్రహ్మయని తెలుసుకుంటే, ఆనందావాప్తి అనర్థనివృత్తి కలుగుతుంది.

జ్ఞానమే, మోక్షరూపేణపరిణమించుతుంది. వేదాంతవిచారణ వలన కలుగుజ్ఞానమువలన, నీవు జీవుడవుకావు, పరబ్రహ్మ స్వరూపుడవేనని చెప్పి, మోక్షప్రతిబంధమును పోగొట్టును. అనగా అధ్యాసను నివృత్తిజేయును.

# 2 జిజ్ఞాస=తెలుసుకొనవలెననే ఇచ్ఛ

| బ్రహ్మజిజ్ఞాస | ధర్మజిజ్ఞాస |
| --- | --- |
| (1) బ్రహ్మమును తెలుసుకొనవలెననే ఇచ్ఛ. | (1) ధర్మమును తెలుసుకొనవలెననే ఇచ్ఛ. |
| (2) మోక్షమే ఫలము గాగలది; నశించనది; శాశ్వతమైన ఫలముగలది; బ్రహ్మజిజ్ఞాస. | (2) అభ్యుదయఫలంగలది; అనగా అభివృద్ధి; లోకములో వున్న ఫలముగలది. ఇది నశించునది. శాశ్వతమైనదికాదు. |
| (3) బ్రహ్మజ్ఞానము, చెయ్యడముయొక్క అపేక్ష లేనిది. | (3) ధర్మఫలము, అనుష్ఠానాపేక్షమైనది. అనగా చేస్తేఅయ్యేది. |
| (4) బ్రహ్మజ్ఞానము తెలుసుకొనుట మాత్రమువలననే, కలుగుతుంది; వస్తుతంత్రము గాని కర్తృతంత్రముగాదు. | (4) ఫలము ముందు (అనగా, తరువాత) కలుగుతుంది; అనగా, సామగ్రిసంపాదించి యథాశాస్త్రముగా చేస్తేఅయ్యేది |

(5) బ్రహ్మసిద్ధవస్తువు. సిద్ధవస్తువులు రెండురకములు:—పుట్టుక వున్నసిద్ధవస్తువు: పుట్టుకలేనిసిద్ధవస్తువు. బ్రహ్మ పుట్టుకలేనిసిద్ధవస్తువు. భూమిమొదలైనవి పుట్టుకకల, సిద్ధవస్తువులు. బ్రహ్మను తెలుసుకుంటేచాలును. చెయ్యడంపనియేమిలేదు.

| | |
| --- | --- |
| (6) వేదాధ్యయనము వుండవలెను. మరిన్ని సాధనచతుష్టయసంపత్తికావలెను. ధర్మజిజ్ఞాసతో సంబధము లేకుండా, సాధన చతుష్టయసంపత్తివుంటేసరి; | (6) వుపనయనము, వేదాధ్యయనము అయినతరువాత, ధర్మవిధి పురుషుణ్ని నియోగిస్తుంది. |

| | |
|---|---|
| (7) బ్రహ్మను తెలుసుకొనుటకు శాస్త్రము కావలెను గనుక శాస్త్రమునకు వ్యాఖ్యానము కావలెను. | (7) ధర్మజిజ్ఞాసలో వేదమే ప్రమాణము. |

బ్రహ్మము ప్రసిద్ధమా (కంటికి కనుపించేవా) అప్రసిద్ధమా (కనుపించనిదా), అనివిచారించుటలో, నేను అనేదాన్ని విభాగము చెయ్యవలెను. దేహమునుండి విభాగించి చూపుటకు, శాస్త్రముకావలెను. బ్రహ్మజ్ఞానమునకు శ్రుత్యాదులు, అనుభవాదులు ప్రమాణములు. బ్రహ్మజ్ఞానముకు శాస్త్రమే చెప్పవలెను. గురువేచెప్పవలెను. తనయొక్క అనుభవము వుండవలెను. బ్రహ్మజ్ఞానము పుట్టునదికాదు. అదికాదు, ఇదికాదు, అనిచెప్పి, వూరుకొనుట. సహోఢన్యాయము. క్రొత్త పెళ్ళికూతురు మాదిరిగా, నేతి నేతి వాక్యముల వల్ల తెలుసుకోతగినది.

(8) బ్రహ్మ సిద్ధవస్తువైనను (పరినిష్ఠితవస్తువైనప్పటికి,) ఘటపటాకాదులవలె, ఇంద్రియములకు గోచరము కాదు. ఇంద్రియములకు విషయముకాదు. అనగా లోపలికి చూచేశక్తి ఇంద్రియములకు లేదు. గనుక గురువేశాస్త్రమే, చెప్పవలెను. తనయొక్క అనుభవముకూడా ప్రమాణము.

| | |
|---|---|
| (9) జ్ఞానమైతే చేయదగినది వుండదు; తెలుసుకోవడమే, ఇందుకు నిత్యఫలము, మోక్షము. | (9) విధియైతే చేయదగినది అవుతున్నది. స్వర్గాదులువస్తున్నవి. అవిఅనిత్య ఫలములు. |
| 10) మోక్షములో తారతమ్యము లేదు. మోక్షము సాధ్యము కాదు. ఇప్పుడు చేసేది అయితే కార్యము. మోక్షము పుట్టేది కాదు. అది సిద్ధవస్తువు. చేయదగ్గ ఫలముకన్నా వేరు[illegible]. | (10) విధిలో, ఫలతారతమ్యతగలదు. పుణ్యపాపములనుబట్టి అధికారితారతమ్యముగలదు. |

# 3 సూత్రభాష్య ప్రశంస.

---

(1) సూత్రభాష్యము. శాంకర బ్రహ్మసూత్రభాష్యము శారీరక మీమాంసా భాష్యము. ఈనామములవలనఁ దెలియబడు గ్రంథము ఒకటే. అనగా బాదరాయణుని వలన రచియింపబడిన బ్రహ్మసూత్రములకు శ్రీమచ్ఛంకర భగవత్పాదులు రచియించిన వ్యాఖ్యాన రూపమైనభాష్యము.

(2) బాదరాయణుడు, కృష్ణద్వైపాయనుడు. అనునామాంతరములు గల వ్యాసులు బ్రహ్మసూత్రములను రచించెను

(3) ఉపనిషత్తులందు చర్చింపబడిన జీవస్వరూపము, బ్రహ్మస్వరూపము మోక్షస్వరూపము మొదలగు విషయములు ఈసూత్రములయందిమిడియున్నవి. బాదరాయణునిచే రచియింపబడినందు వలన బాదరాయణ సూత్రములనఁబడెను.

(4) జన్మస్థానము యమునానదీతీరము గాబట్టి ద్వైపాయనుఁడనియు, నల్లని వాడగుట చేసి కృష్ణుఁ డని యు, రేగు తోట యం దుండితపముజేయుటచే బాదరాయణుడనియు, వేదమునువిభజించుటచే వేదవ్యాసుడనియు, సూత్రకర్తకునామములు కలవు.

(5) బాదరాయణసూత్రములు, అనగా బ్రహ్మసూత్రములు 555. ఈసూత్రములను, శారీరక (జీవ)మీమాంసయనియు, నుత్తర మీమాంసాశాస్త్రమనియుజెప్పుదురు. ఈ555సూత్రములు 192 అధికరణములుగాను; శ్రీశంకరాచార్యునివలన భాష్యము వ్రాయబడి నాలుగుఅధ్యాయములు గాను; ప్రతిఅధ్యాయము 4 పాదములుగాను; ఒక్కొక్క-పాదములో కొన్నికొన్నిసూత్రములు చెప్పబడినవి.

(6) అనగా సూత్రములన్నియు అధ్యాయములుగ విభజింప బడినవి. మొదట యధ్యాయమున వేదాంతవాక్యములకెల్లనద్వితీయమగు

బ్రహ్మమునందు సమన్వయము ప్రతిపాదింపబడినది. అందువలన నీఅధ్యాయమునకు సమన్వయాధ్యాయమను పేరు. రెండవఅధ్యాయమున స్వపక్షమునకు ప్రాప్తమగువిరోధము పరిహరింపబడినది. మూడవయధ్యాయమున జ్ఞానసాధనములు నిర్ణయింపబడినవి. నాల్గవయధ్యాయమున జ్ఞానఫలము నిరూపింపబడినది.

(7) అన్ని శాస్త్రములయందువలె వేదాంతశాస్త్రమందు, అనుబంధచతుష్టయము నిరూపింపబడినది. అవియేవనగా:—

(i) విషయము—బ్రహ్మము.

(ii) ప్రయోజనము—అధ్యాసనివృత్తిపూర్వక బ్రహ్మానంద ప్రాప్తి.

(iii) సంబంధము—బ్రహ్మమునకును, వేదాంతశాస్త్రమునకును గల బోధ్య బోధక భావము.

(iv) అధికారి—సాధనచతుష్టయ సంపన్నుడు.

(8) సాధనచతుష్టయ సంపన్నునికి అధ్యాసనివృత్తి చేయుట వేదాంత శాస్త్రమునవలనిఫలము.

**4** వేదాంతశాస్త్రమునకు ఫలము బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము కనుక బ్రహ్మవిచారము కర్తవ్యమని మొదటయధికరణమునందు (జిజ్ఞాసాధికరణమునందు) చెప్పబడినది.
శ్రు॥ "స్వాధ్యాయోఽధ్యేతవ్యః"
నిత్యమును వేదమునుచదువవలయును అనువిధిపై శ్రుతివాక్యము వలన నేర్పడుచున్నది.

**5.** <u>పైవిధిననుసరించి వేదమును చదువగా, క్రిందివాక్యములు కనుపించుచున్నవి:—</u>

(1) శ్రు॥ ఛాం॥ తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే.

తా. ఈలోకమునందు సంపాదింపబడిన ధాన్యము మొదలగు భోగ్య పదార్థమంతయు ఏ ప్రకారము కొంత కాలమునకు నశించునో, అదే ప్రకారము యజ్ఞాదిపుణ్య కర్మలచేత, పరలోకమునందు సంపాదింప బడిన భోజ్య పదార్థము (అనగా స్వర్గలోకభోగము) కొంతకాలము అనుభవించుట వలన నశించుచున్నది.

(2) శ్రు॥ ముం॥ పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాన్నాస్త్యకృతః కృతేన.

తా. బ్రాహ్మణుడు, విహితములు నిషిద్ధములునగు కర్మములవలన సంపాదింపబడిన, స్వర్గాధిభోగస్థానములను అనిత్యములని నిశ్చ యించి, నిత్యమగు మోక్షము, కర్మముచే సంభవింపదని, కర్మ ములనుండియు, వాని ఫలములనుండియు వైరాగ్యముసంపాదిం పవలసినది. అనగాకర్మఫలమును అపేక్షింపకుండా కర్మలను చేయవలెను.

(3) శ్రు॥ పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరాఙ్ పశ్య తి నాంతరాత్మన్.

తా. పరమేశ్వరుడు ఇంద్రియములను బహిర్ముఖములుగ చేసియు న్నాడు. కావున ప్రతిపురుషుడు వెలుపలికి జూచునుగాని, లోప లిదయిన బ్రహ్మమును చూడనేరడు.

(4) శ్రు॥ బృ॥ శాంతో దాంత ఉపరత స్తితిక్షుస్సమాహిత శ్శ్రద్ధా న్వితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యతి.

తా. శాంతః (ఇంద్రియములను వాని వ్యాపారమునుండి మఱలించి నవాడును) దాంతః (అంతఃకరణమును విషయాదులనుండి మఱలించినవాడును), ఉపరతః (విహితములగు కర్మలను విధి పూర్వకముగసన్న్యసించినవాడును, తితిక్షుః (ద్వంద్వములను సహించినవాడును), శ్రద్ధాన్వితః (గురువాక్యమునందును బ్రహ్మ మునందును విశ్వాసముగలవాడును), భూత్వా-అయి, ఆత్మన్యే

వ- తనదేహేంద్రియాదులందును తక్కిన యెల్లచోట్లను, ఆత్మానం- ప్రత్యక్చైతన్యమును, పశ్యతి-చూచుచున్నాడు.

(5) శ్రు॥ తై॥ యతోవా ఇమాని భూతానిజాయంతే యేన జాతాని జీవన్తి ఇత్యాదిశ్రుతులు.

"తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి"

తా॥ బ్రహ్మ మొదలగు ప్రాణులన్నియును దేనినుండి పుట్టుచున్నవో పుట్టినయా ప్రాణులన్నియు దేనిచే ప్రాణములను ధరించుచున్నవో - అనగా వర్తిల్లుచున్నవో - ఆభూతములు మరణించినతరువాత, దేనిని ప్రవేశించుచున్నవో అది బ్రహ్మము. దానినిమిక్కిలి తెలియగోరుము అనగా భూతసముదాయము ఉత్పత్తిస్థితిలయకాలములయందు దేనిరూపమును విడువకుండునో యది బ్రహ్మమునకు లక్షణమని యును నట్టి బ్రహ్మమును మిక్కిలి తెలియగోరుము.

(6) శ్రు॥ ఛాం॥ తత్త్వమసి

తా॥ ఆయీశ్వరుడవే నీవు అగుచున్నావు

(7) శ్రు॥ బృ॥తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి.

తా॥ (ఓశాకల్యుడా) క్షుత్పిపాసాదిదోషవర్జితుడును, ఉపనిషద్వాక్యములవలననే తెలియదగినవాడునునగు, పురుషునిగూర్చి నిన్నడుగుచున్నాను, అనగా చైతన్యస్వరూపుడగు నా బ్రహ్మ వేదాంతవాక్యములవలననే తెలియదగినవాడునునగు

(8) స్మృతి॥ నజాయతే మ్రియతేవా విపశ్చిత్.

తా॥ నిత్యజ్ఞానస్వరూపుడగు నాత్మజన్మింపడు, మరణింపడు.

(9) శ్రు॥ ఛాం॥ యోవై భూమా తదమృతమ్.

తా॥ ఏది ఇంద్రియాతీతమై పూర్ణమగుపదార్థమో అదిఅమృతము - నిత్యము.

(10) శ్రు॥ బృ॥ అన్యదార్తమ్.

తా॥ దానికంటె అనగా బ్రహ్మముకంటె ఇతరమైనది తుచ్ఛము — నశించునది.

(11) శ్రు॥ బృ॥ ఆత్మనస్తుకామాయ సర్వం ప్రియం భవతి.

తా॥ తనకొఱకే, తననిమిత్తమునకే అన్నియు ప్రియములగుచున్నవి

(12) శ్రు॥ ఛాం॥ నచస పునరావర్తతే.

తా॥ ముక్తినొందినవాడు మరల జన్మింపడు శ్రు॥ బ్రహ్మ విదాప్నోతిపరమ్ తా॥ బ్రహ్మవేత్త ముక్తిని జెందును.

(13) శ్రు॥ ఛాం॥ తరతి శోకమాత్మవిత్.

తా॥ ఆత్మవిత్ - తననుయథార్థముగా తెలిసికొనినవాడు మనస్తాపమును అతిక్రమించుచున్నాడు. అనగా తననుబా టెలిసికొనిన వాడు కృతార్థుడనుగానని విచారపడడు.

(14) శ్రు॥ తై॥ బ్రహ్మవిదాప్నోతి పరమ్

తా॥ బ్రహ్మము నెఱిగినవాడు నిరతిశయమగు బ్రహ్మమునే పొందుచున్నాడు.

(15) శ్రు॥ తై॥ తద్విజిజ్ఞాసస్వ.

తా. ఆబ్రహ్మమును మిక్కిలి తెలియ గోరుము.

(16) శ్రు॥ ఛాం॥ సోన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః

తా॥ ఆయాత్మయే శాస్త్రముచేతను, గురూపదేశముచేతను తెలియదగినది. అదియే మిక్కిలి తెలియుంగోరదగినది.

(17) శ్రు॥ బృ॥ ఆత్మావా, అరేద్రష్టవ్యశ్శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసి తవ్యః.

తా॥ ఓమైత్రేయీ, ఆయాత్మయె మొదటగాచార్యునివలన శాస్త్రములవలన వినదగినది. తరువాత యుక్తులవలన, చింతింపతగి

నది. ఏకాగ్రముగ ధ్యానింపఁదగినది. ఇట్లు శ్రవణ మనన నిధి ధ్యాసములు చేయుట వలన ఆత్మదర్శనము సంభవించును.

6. ఇట్లు పైనకనబరచబడిన శ్రుతి వాక్యములవలన అనగా వేద వాక్యములవలన గ్రహింపవలసిన విషయములేవి యనగా:—.

(1) ఏవేదములు, కర్మలు ముఖ్యములనియు, వానిని ఆవశ్యముగా ఆచరింప వలెననియును జెప్పుచున్నవో, ఆవేదములే,కర్మలిచ్చు ఫలములు శాశ్వతములు కావని చెప్పుచున్నవి.

(ii) భూతసముదాయము, ఉత్పత్తిస్థితి లయకాలములయందు బ్రహ్మ రూపమును విడువకున్నది.

(iii) ఆబ్రహ్మము నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావముకలదియు, సర్వజ్ఞత్వ మును, సర్వశక్తిసమన్వితమును నైయున్నది.

(iv) అట్టిబ్రహ్మముయొక్క జ్ఞానము వలన పరమపురుషార్థములభిం చును. బ్రహ్మవిచారముచేతనే మోక్షమును సంపాదింప వలయు నుగాని యితర సాధనములచే నక్కార్యము జరుగదు.

(v) బ్రహ్మము నొందినవాడు అనగాముక్తినొందినవాడు మఱలజన్మిం పడు.

(vi) అట్టిబ్రహ్మమును గుఱించి కొందఱు కుమక్కతర్కయుక్తులచేతను కొందఱు కొన్ని శ్రుతివాక్యములజేతను విపరీతజ్ఞానమును కలి గియుందురు.

7.(1) కావునముముక్షువులందఱకును నిశ్శ్రేయసప్రాప్తికై బ్రహ్మజిజ్ఞా సపూర్వకముగా వేదాంత విచారము కర్తవ్యమనియును,

(2) సాధనచతుష్టయసంపత్తిగలవాడు బ్రహ్మవిచారమునందు అధి కారి యగుననియును ,

(3) అట్టియధికారి కర్మలయందు అభిమానమును విడచి, అనగా, నేనుచేయుచున్నాననెడు కర్తృత్వాభిమానమును విడచి, ఫల ముకోరకయే, బ్రహ్మవిచారము, చేయువలయు ననియును,

(4) దీనిచే బ్రహ్మజ్ఞానముగలిగి శాశ్వతమగు మోక్షమును చెందునని యును బోధించుటకు మొదటి అధికరణమున మొదటి సూత్రమునందు జెప్పబడుచున్నది.

## 8. జిజ్ఞాసాధికరణము ప్రారంభము.

సూ. అథాతో బ్రహ్మజిజ్ఞాసా.

తా. బ్రహ్మవిచారమునందు అధికారముకలిగిన పిదప, (అనగా సాధనచతుష్టయసంపత్తికలిగిన తరువాత) కర్మలవలన ఫలములు అనిత్యములు గనుక; బ్రహ్మముయొక్క విచారమును చేయవలయును.

(ఇతిజిజ్ఞాసాధికరణము ప్రథమాధికరణము సమాప్తము.)

## 9. జన్మాధికరణము—2వ అధికరణము

బ్రహ్మవిచారము కర్తవ్యమని ఇంతవరకుచెప్పబడినది. ఆబ్రహ్మముయొక్క లక్షణము, 2 వ సూత్రములో జెప్పబడినది.

(1) ౨. సూ॥ జన్మాద్యస్యయతః.

తా॥ ఈకనుపించెడి ప్రపంచముయొక్క సృష్టి, స్థితి, లయములు, యే సర్వజ్ఞము, సర్వశక్తిమంతమునగు వస్తువునుండి కలుగుచున్నవో యదియే బ్రహ్మము. (అస్య-ఈజగత్తుయొక్క, జన్మాది-సృష్టి, స్థితి, లయములు. యతః-ఎవనివలనగలుగుచున్నవో, తత్ బ్రహ్మ -అది బ్రహ్మము)

(2) ఈసూత్రమునకు సంబంధించిన శ్రుతివాక్యములు.

(i) శ్రు॥ తై॥ భృగుర్వై వారుణిః వరుణం పితరముప ససార అధీహి భగవో బ్రహ్మేతి.

యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేనజాతానిజీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తీతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి.

తా॥ వరుణ పుత్రుడైన భృగువు తండ్రియగు వరుణునిసమీపించి బ్రహ్మయొక్క లక్షణమును చెప్పుమనికోరగా–తండ్రియగు వరుణుడు అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రం మనః–అనగా శరీరము మొదలగునవి బ్రహ్మసాక్షాత్కారమునకు మార్గములనిచెప్పి–భూతసముదాయము, ఉత్పత్తి స్థితి నాశ కాలములయందు దేని రూపమును విడువదో, యది బ్రహ్మరూపమునకులక్షణమనియు, దానిని మిక్కిలి తెలియ గోరుమనియు ఆకుమారునికి జెప్పెను.

(ii) శ్రు॥ తై॥ ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేన జాతానిజీవన్తి, ఆనందం ప్రయంత్యభిసంవిశన్తీతి.

తా॥ ఈజంతువులన్నియు ఆనందమువలననే పుట్టుచున్నవి, పుట్టిన ఆభూతములు, ఆనందముచేతనే వృద్ధినొందుచున్నవి. ఆభూతములు మరణించుచు ఆనందమును ప్రవేశించుచున్నవి.

(iii) నిర్గుణ బ్రహ్మమునకు జగత్కర్తృత్వము లేదు.

శ్రు॥ విజ్ఞానమానందంబ్రహ్మ.

శ్రు॥ సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ.

(iv) సర్వజ్ఞమగు బ్రహ్మమునుండియే ప్రపంచముద్భవించె ననుటకుమఱియొక శ్రుతి ప్రమాణము

శ్రు॥ యస్సర్వజ్ఞ స్సర్వవిత్ ... తస్మాన్నామరూప మన్నంచజాయతే.

<u>ఫలితార్థము</u> : ఈసూత్రమువలన, సర్వజగత్కర్తయగు బ్రహ్మ సర్వజ్ఞుడని, సర్వశక్తిమంతుడనియుఁ దెలియుచున్నది.

ఇతి జన్మాధికరణము సమాప్తము, ద్వితీయాధికరణము సమాప్తము

10. బ్రహ్మసర్వజ్ఞుడని యెట్లునిరూపింపనగునని సంశయముకలుగగా. అట్టిసంశయనివారణార్థము 3 వఅధికరణము, శాస్త్రయోనిత్వాధికరణము, మూడవసూత్రముచెప్పబడినది.

## సూ॥ 3॥ శాస్త్రయోనిత్వాత్.

(i) తా॥ శాస్త్రములకు అనగా ఋగ్వేదాది వేదములకు కారణమగుట వలన బ్రహ్మము సర్వజ్ఞుడనుటకు సందియము లేదు.

కనబడునట్టియు, కనబడనట్టివియునగు విషయములను గుఱించి వేదములు చెప్పును. అట్టి వేదములకు బ్రహ్మకర్త కనుక బ్రహ్మ సర్వజ్ఞుడని చెప్పుటకు సంశయము లేదు.

(ii) రెండవయర్థము, బ్రహ్మమును విచారించుటకు సాధనమేమి? సర్వజ్ఞుడని చెప్పుటకు ప్రమాణమేమి?

జవాబు శాస్త్రమే, వేదమే ప్రమాణముగాగలవాడు ప్రత్యక్షము, మొదలగు ఇతర ప్రమాణములచేత గ్రహింపబడడు. ఉపనిషద్వాక్యములచేతనే బ్రహ్మవిచారము చేయవలయును. అనుట.

ఈసూత్రమునకు సంబంధించిన వేదవాక్యములు.

(1) శ్రు॥ బృ॥ అస్యమహతో భూతస్యనిశ్వసితమేతద్ యదృగ్వేదో యజుర్వేద స్సామవేదః

తా. ఓ మైత్రేయీ! ఋగ్వేదము యజుర్వేదము సామవేదమనెడు వేదమంత్రసముదాయమంతయును, ఇప్పుడు చెప్పబడుచున్న మహాపదార్థమగు బ్రహ్మముయొక్క నిశ్వాసముంబోలి, పురుష నిశ్వాసమువలె అనాయాసముగా నామహాభూతమునుండి పుట్టినవియే.

(2) శ్రు॥ యతోవా ఇమాని భూతాని జాయంతే. అను మొదలగునవి, శాస్త్ర ప్రమాణము వలననే జగజ్జన్మాది కారణమగు బ్రహ్మము తెలియబడునని చెప్పుటకు ఉదాహరణము.

(3) వేదములు బ్రహ్మను చెప్పుచున్నవి అనుటకు నుదాహరణము.

శ్రుత్యంతరము:—

శ్రు॥ తై॥ తంత్రయో వేదా అన్వసృజ్యంత.

(4) శ్రు॥ తంత్వౌపనిషదంపురుషం పృచ్ఛామి.

ఇట్లు బ్రహ్మము వేదైకవేద్యమని కూడ సూచింపబడినది.

తా. ఉపనిషద్వాక్యములచేత మాత్రమే వర్ణింపబడు నాపురుషుని గూర్చి నిన్నడుగుచున్నాను.

ఇది శాస్త్రయోనిత్వాధికరణము సంపూర్ణము—తృతీయాధికరణము-3 వ అధికరణము సంపూర్ణము.

## 11· సమన్వయాధికరణము

(i) వేదము లన్నియు కర్మపరములగుటచే, కర్మ ప్రతిపాదకములు కాని వేదవాక్యములు నిష్ఫలములనియు; (జై. సూ॥ ఆమ్నాయస్య క్రియార్థత్వా దానర్థక్య మతదర్థానామ్."

(ii) వేదాంతవాక్యములు కర్మప్రతిపాదికములు కాకపోవుటచే, నవి యదార్థవాదములై విధిశేషములయి యున్నవనియు,

(iii) సిద్ధవస్తుపరములగు వేదాంతవాక్యములుకర్మవిధిశేషములు, ఉపాసనావిధిశేషములు అనియు, అనగా, వేదాంతశాస్త్రముపాసనా కర్మవిధిశేషమనియు,

(iv) వేదాంత వాక్యముల తాత్పర్యములు అనేక విధములుగా తోచుట వలనను;

(V) ఆయా కారణములవలన, బ్రహ్మమునకు శాస్త్రప్రమాణకత్వము లేదని పూర్వపక్షము (వాదన)రాగా, ఆవాదనను నిరాకరించుటకు 4 వ సూత్రముయొక్క అధికరణముచెప్పబడినది.

4 వ। సమన్వయాధికరణము.

సూ॥ 4॥ తత్తు సమన్వయాత్.

తా॥ తు॥ పూర్వపక్షము యుక్తముగా నుండ లేదు. ఉపక్రమము మొదలగు తాత్పర్యలింగములచేత, బాగుగసమన్వయించి(విమర్శించి)నట్టైన, వేదాంత వాక్యము లన్నియుబ్రహ్మస్వరూపమునుగూర్చిమాత్రమే బోధించుననియు, మఱియొకదానినిబోధిం

పవనియు, అఖండబ్రహ్మపరముగా శాస్త్రప్రమాణముకలదనియు
వుపాసనలనుగూర్చి చెప్పనునువిషయమున్నా స్పష్టమవును.

## 12. ఈసూత్రమునకు సంబంధించిన సిద్ధాంతములు:—

(1) బ్రహ్మమునుఁ దెలిసి కొనుటకు వేదాంతవాక్యములుమాత్రమే సాధనములు.

(2) ఉపనిషత్తులు బ్రహ్మము నే చెప్పును.

(3) మోక్షేచ్ఛగలవాఁడు వానినవశ్యము విచారింపవలయును.

(4) చిత్తశుద్ధికలుగుటకై వేదముమొట్టమొదట కర్మాదుల నుపదేశించియున్నది. మనశ్శుద్ధి లేక బ్రహ్మమును గ్రహించుట కష్టము. నిష్కామకర్మకాండ బ్రహ్మ జ్ఞానమునకు సాధనము.

(5) మోక్షమనగ, స్వస్వరూపస్థితియే. అదియొకప్పుడు లేనిది కాదు. ఒకప్పుడు ఉన్నది కాదు. అజ్ఞానము వలన బ్రహ్మమే జీవుడగుచున్నది. అజ్ఞానంచేత తన్నె తనకంటెనన్యునిగా భావించుచున్నాడు. ఈయజ్ఞానము తొలగినచో మోక్షము చేకూరును.

(6) లోకమున యథార్థానుభవమువలె, అయథార్థానుభవము కూడ ననుభవసిద్ధమైయున్నది. బ్రహ్మమునందు జీవత్వము కల్పింపబడినది. జీవత్వము హేయము. బ్రహ్మత్వముపాదేయముగా (అంగీకరింపఁదగినది). ఉపనిషత్తులందు జెప్పబడిన బ్రహ్మకు పారమార్థికములగు హేయోపాదేయత్వములు లేవన్నను, భ్రాంతి కల్పితమైన జీవునకు హేయోపాదేయత్వములుకలవు. సర్వశాస్త్రములు భ్రాంతినాశ్రయించియే ప్రవర్తించుచున్నవి. భ్రాంతి చేనయిన జీవత్వము వదలు సమయమున,పూర్వపుణ్యముచేత నా బ్రహ్మస్వరూపమును విచారించుట ప్రారంభించును. భ్రాంతి తొలగినపిదప నా బ్రహ్మమే, స్వస్వరూపముతో నిలుచును.

(7) ఉపనిషత్తులు కూడ కర్మనే చెప్పును, అను ఆగ్రహము కూడదు. అటెన్నశ్రుతిలో, "యత్రత్వస్యసర్వమాత్మైవాభూత్తత్కేన కం

పశ్యేత్. తా॥ సర్వము ఆత్మరూపమే అని యెఱిఁగినతరువాత, ఏపదార్థమును ఏసాధనచే, నేకర్తకనుఁగొనఁ గలడు? అనుశ్రుతి యెట్లు సమన్వయించును? బ్రహ్మాభిన్నముగా, కర్తగాని సాధనము గాని లేదని తెలియుచున్నది.

(8) బ్రహ్మము ఉపాసనకు నంగముకాదు. బ్రహ్మజ్ఞానము అభేదజ్ఞానము. ఉపాసనా విధి, భేద జ్ఞానముండినగాని, సాధ్యముకాదు. ఈరెంటికిని సంబంధముండజాలదు. చిత్తశుద్ధికై కొన్నియుపాసనలం జెప్పిన, జెప్పునుగాక; సర్వోపాసనా వాక్యములతో, వేదాంత వాక్యములను గూడ సంబంధింప నక్కఱలేదు.

(9) ఉన్నవాఁడు జీవుఁడే; వాఁడు సర్వలోకప్రసిద్ధుడు. జీవుని గుఱించి శాస్త్రము ప్రవర్తింప నక్కఱలేదు. బ్రహ్మ అనునది లేదు, లేని దానిని గుఱించి శాస్త్రముఅవసరము లేదు, అని యనఁగూడదు; జీవబ్రహ్మలకు భేదము లేదని శ్రుతులు వేనవేలు చెప్పుచున్నవి. జీవుడు శశవిషాణమువలె లేడుగనుక, బ్రహ్మమునుగూర్చియే వేదముచెప్పుచున్నదనుట స్పష్టము. ఆబ్రహ్మమందే, అవిద్య వలన ప్రపంచముకలదు అని భ్రాంతికలుగుచున్నది.

(10) ఉపనిషత్తులు బ్రహ్మస్వరూపమునుమాత్రమే చెప్పును. ఆవిషయములను గ్రహించుటయే పరమపురుషార్థమని వేదముబోధించుచున్నది. బ్రహ్మమునుపాస్యమని చెప్పుటసరికాదు. బ్రహ్మము నెఱుంగుట మానసికకర్మఅయినను, బ్రహ్మ, వస్తుతంత్రమే గాని కర్తృతంత్రముకాదు. వేదాంతవాక్యములు, 'అహం బ్రహ్మాఽస్మి' అనివస్తుతంత్రమైనదానినే బోధించుచున్నవిగాని కర్తృతంత్రమైన మానసక్రియయైన ఉపాసనను బోధించుటలేదు.

(11) శాస్త్రము విధి నిషేధములలో దేనినైన చెప్పితీరవలయును, అనునియమము లేదు. హితమును బోధించుట, దానియందు పురుషునిఁ బ్రవర్తింపఁ జేయుట, అహితమునుగూడ బోధించి దానినుండి నివర్తింపఁ జేయుట అనునవియే శాస్త్రమునకు

షయులు ఉపనిషత్తులు బ్రహ్మస్వరూపమును చెప్పుటలో విధి నిషేధములను చెప్పకపోయినను, సంసారదుఃఖమునుతొలగించి స్వస్వరూపమగు మోక్షసుఖమును చెందించుటకై హితమును బోధించుచున్నవి.

(12) స్వర్గాది ఫలములను, ఆయాలోకములకుఁ దగిన శరీరములతో అనుభవింపవలయును. మోక్షమునకు శరీరసంబంధము లేదు. స్వర్గాదులు ఆత్మకంటె భిన్నములు; మోక్షము ఆత్మస్వరూపము. మోక్షము కర్మవలన కలుగదు. మోక్షము నిత్యమైనది. స్వర్గాదులు అనిత్యములు. ఉపనిషత్తులు, జ్ఞానకాండకును, కర్మకాండమునకును ఫలమునందు భేదముకలదు. అథాతో ధర్మజిజ్ఞాసా — అథాతో బ్రహ్మజిజ్ఞాసా — అని వేరువేరు శాస్త్రములు ఆరంభింపబడినవి. కర్మలవలన స్వర్గాదులు, ఉపనిషద్విచారణ వలన బ్రహ్మజ్ఞానము (మోక్షము) కలుగును.

(13) బ్రహ్మమును విధిశేషముగా వేదము చెప్పుననుట సంభవింపనేరదు. ఈక్రింది శ్రుతివాక్యములు దీనికిఁ బ్రమాణములు:—

శ్రు॥ ఆత్మవా అరే ద్రష్టవ్యః!

శ్రు॥ ఆత్మేత్యేవోపాసీత.

(ఆత్మయనియే, బ్రహ్మము నుపాసన చేయవలయునని.)

శ్రు॥ "విజ్ఞానమానందం బ్రహ్మ. స ఆత్మా."

(బ్రహ్మమునందు జీవజ్ఞానాదులు కల్పితములు. ఆ బ్రహ్మమే నీయాత్మ) నీయాత్మయే ఆ బ్రహ్మము.

శ్రు॥ ఆత్మానమేవ లోక ముపాసీత.

శ్రు॥ య ఆత్మాऽపహతపాప్మా సోऽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః.

శ్రు॥ బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి.

పై శ్రుతివాక్యముల వలన లిఙ్, లోట్. తవ్యప్రత్యయ ఘటితము లైన ఉపనిషద్వాక్యములనన్నిటిని, ఉపాసనాపరములుగను,

విధిశేషములనుగను, సమన్వయింపవలయుననుట సరికాదు. ఇం
కయేమనగా బహిర్ముఖుడైన సంసారమునబడిపొరలువాని నంత
ర్ముఖునిగాఁజేయుటకైయట్టివాక్యములు పుట్టినవి.

(14) ఈక్రింది శ్రుతివాక్యములవలన బ్రహ్మము అవాఙ్మానస గోచరమని
యును, ఉపాసనకు సాధ్యముగాని స్వరూపముగలదనియును
స్పష్టపడుచున్నది.

(అ) శ్రు॥ తత్కేన కంపశ్యేత్.

తా॥ జ్ఞానదశయందువ్వరుఏపదార్థమును దేనితో జూచును?
సర్వమును ఏకరూపమేగద.

(ఆ) శ్రు॥ నదృష్టేర్ద్రష్టారం పశ్యేః.

తా॥ అనగా చూపును చూచువాని జూడలేవు.అనగా చూపును
అనగా బ్రహ్మ. ఆబ్రహ్మకన్న పైగా బ్రహ్మనుచూచె ఇంకో
కబ్రహ్మను,చూడకుము. బ్రహ్మనుచూచే మఱియొకబ్రహ్మ
లేదనుట.

(ఇ) శ్రు॥ యద్వాచా నభ్యుదితం యేనవాగభ్యుద్యతే తదేవబ్రహ్మత్వం
విద్ధినేదం యదిదముపాసతే॥.

తా॥ ఏపదార్థము వాక్కుచేఁజెప్పబడుటకు శక్యముకానిదో, దేని
ప్రభావమువలన వాక్కు సర్వశబ్దముల నుచ్చరింపగలుగు
చున్నదో అదియేబ్రహ్మమని తెలిసికొనుము. నీవేబ్రహ్మమని తెలిసి
కొనుమని అర్థముకూడ నీశ్రుతియందున్నది.
ఫలితార్థము:— బ్రహ్మనుపాసనచేయుటకు నవకాశము లేదని
శ్రుతియే నిరూపించుచున్నది.

(ఈ) శ్రు॥ విజ్ఞాతారమరేకేన విజానీయాత్.

తా॥ సర్వము తెలిసికొనువానిని (సాక్షిని) ఏ సాధనముచే తెలిసికొన
గలము?

ఫలితార్థము:—బ్రహ్మము జ్ఞానక్రియకు కర్తకానేరదని శ్రుతి స్పష్టము చేయుచున్నది.

(ఉ) శ్రు॥ యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ.

తా॥ ఏబ్రహ్మమునందు (బ)వర్తింపనేరక వాక్కులుమనస్సుతోగూడ మరలుచున్నవో

(ఊ) శ్రు॥ అన్యదేవతద్విదితాదథో అవిదితాదధి.

తా॥ ఆబ్రహ్మము తెలియబడుచున్న ఘటపటాది కార్యముల కంటెను తెలియబడని కారణముఅయిన ఈశ్వరునికంటెను వేఱైనది.

(ఎ) శ్రు॥యస్యామతం తస్యమతం,మతం యస్యన వేదసః, అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతామ్॥ తా॥ఎవ్వడుపరబ్రహ్మమునాబుద్ధికిగోచరముకాదు అని తెలిసికొనునో వాడు బ్రహ్మరూపము నెఱిగినవాడు; ఎవ్వడు నేను బ్రహ్మము తెలిసికొంటిని అని తలంచునో వానికిబ్రహ్మ రూపము తెలియలేదు.

(ఏ)బుద్ధికి సాక్షియైన బ్రహ్మము, బుద్ధికి విషయమెట్లగును? కావున బ్రహ్మము ఉపాసనార్థమై శాస్త్రమునఁజెప్పబడలేదు. అనగా ఆబ్రహ్మము జ్ఞేయము కాదని శాస్త్రముచెప్పుచున్నది. అనగా విధిక్రియకు విషయము కాకుండా బ్రహ్మను తెలిసికొనవలెను అతడే బ్రహ్మవేత్త.

(ఐ) శ్రు॥ నిత్యస్సర్వజ్ఞ స్సర్వగతో నిత్యతృప్తో నిత్య శుద్ధ బుద్ధముక్త స్వభావో విజ్ఞాన మానందం బ్రహ్మ.

(15)జ్ఞానము మానసిక క్రియకానేరదు. మానస క్రియకును, జ్ఞానమునకును అధిక భేదము కలదు.జ్ఞానము ప్రత్యక్షాది ప్రమాణముల వలనఁగలుగునది యగుటచే నెట్టిమార్పునుఁ జెందక పురుషునకు నధీనముకాక, వస్తుతంత్రమై ఎప్పటికి నొక్కవిధముననే నిలిచి యుండును

(16) విధినిషేధములు బ్రహ్మవిషయమై లేకున్నను, బ్రహ్మ శబ్దార్థమునుఁ దెలిసికొనుటకుపాయము లనేకములు కలవు. శాస్త్రము పరబ్రహ్మమును విధిపూర్వకముగ చెప్పనక్కరలేదు. పరబ్రహ్మము స్వతంత్రము. ఉపాసనాదులకు శేషము కాదు. ఉపాసనల వలన మోక్షము సిద్ధించదు అనిసిద్ధాంతము.—బ్రహ్మభావమే మోక్షము. బ్రహ్మము సంస్కారయోగ్యముకాదు. మోక్షము జ్ఞానైక సమధిగమ్యమైయున్నది.

(17) బ్రహ్మము కర్మాంగశేషముగానిఉపాసనా విధి శేషము గాని కాదు.

బ్రహ్మము శాస్త్రప్రమాణము కలదని వేదాంతవాక్యసమన్వయమువలన సిద్ధించుచున్నది.

అథాతో ధర్మజిజ్ఞాసాయని కర్మకాండనుఁ ఉపాసనాకాండను అనగా పూర్వమీమాంసాశాస్త్రమును చెప్పినపిమ్మట, అథాతో బ్రహ్మజిజ్ఞాసా అని నూతనశాస్త్ర మారంభించుట చేతను; మానసికధర్మములను క్రొత్తగాఁ జెప్పుటకు నూతన శాస్త్రము ప్రారంభించినదని చెప్పినయెడల;అథాతః పరిశిష్ట ధర్మజిజ్ఞాసాయని ప్రారంభముఁ జేయవలసి యుండును, గనుకనునట్లుగాక అథాతో బ్రహ్మజిజ్ఞాసయని నూతన శాస్త్రము ప్రారంభించుటచే, అదివరకు సిద్ధబ్రహ్మ వస్తువను, బ్రహ్మాత్మైకజ్ఞానమ్మునుఁజెప్పక, క్రొత్తగా నూతనశాస్త్రమును ప్రారంభింపదలచి, అథాతో బ్రహ్మజిజ్ఞాసా అని ప్రారంభించి, సిద్ధబ్రహ్మవస్తువును, బ్రహ్మాత్మైకజ్ఞానమును వేదాంతశాస్త్రము బోధించెను, అని సిద్ధాంతము.

(18) బ్రహ్మాత్మైకత్వజ్ఞానము తత్వజ్ఞానముగాని; భేదజ్ఞానముతత్వజ్ఞానముకాదు; ఎందుకన

(i) శ్రు॥ యత్రహిద్వైత మివభవతి తదితర ఇతరంపశ్యేత్.
భేదజ్ఞానము భ్రాంతిమూలకము.

(ii) శ్రు॥ మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి.

భేదజ్ఞానము అనర్థహేతువు.

(19) శ్లో.॥. స్థితప్రజ్ఞస్యకాభాషా యను మొదలగు స్మృతులును విద్వాంసునకు నేప్రవృత్తితోడను సంబంధము లేదని చెప్పు చున్నవి. అట్టివానికి మునుపటివలె సంసారిత్వముండదు. పూర్వము వలె సంసారిధర్మ మెవనికిగలదో, వాడు బ్రహ్మాత్మభావము ఎఱింగినవాడుకాడు., ముముక్షువు, ఉపాసనల వలనను, కర్మలవలనను, పాపమునుపోగొట్టుకొని, చిత్తశుద్ధికలిగి, బ్రహ్మాభిముఖమవును. శాస్త్రము అవిద్యనుపోగొట్టుటవలన, బ్రహ్మజ్ఞానమును తెలుపుచున్నది. బ్రహ్మజ్ఞానము(బ్రహ్మము)సిద్ధవస్తువగావున, శాస్త్రము దానిని పుట్టించలేదు. గురువు, శాస్త్రము, కర్మకాండ, ఉపాసనకాండ, ఇవిఅవిద్యను పోగొట్టుటచేత బ్రహ్మజ్ఞానమునకు సాధనములు. బ్రహ్మము స్వతంత్రమైన శాస్త్రముచే ప్రతిపాదింపబడుచున్నది యని సిద్ధాంతము.

(20) బ్రహ్మమునకు స్వాతంత్ర్యము కలుగుటవలన, అథాతో ధర్మసజ్ఞాసా అనే కర్మకాండకంటె వేరుగా, అథాతో బ్రహ్మజిజ్ఞాసాయని వేరు శాస్త్రముప్రారంభించి చెప్పబడినది.

(21) నేనుబ్రహ్మనను జ్ఞానము కలుగుటకుబూర్వమే, సకలవిధులును, దక్షిణప్రమాణములు గలవు; అనగా అద్వైతాత్మజ్ఞానము కలిగినతరువాత, అన్నివ్యవహారములు, విధులు సమసిపోవుచున్నవి.

(22) బ్రహ్మవేత్తలగాథలు;

(అ) శ్లో॥గౌణ మిథ్యాత్మనోస త్వేపుత్ర, దేహాది, బాధనాత్ । సద్బ్రహ్మాత్మా హామిత్యేవంబోధే, కార్యంకథంభవేత్ ॥.

తా॥ నేను సర్వమునకు సాక్షినని జ్ఞానము కలుగుచుండగాను,

పుత్రుడు, దేహము, మొదలగునవి మాయాకల్పితములను నిశ్చయము కలిగిన పిమ్మట‌ను పుత్రదారాదులందు నేనను గౌణాభిమానమునకున్నూ, నేను మనుజుడను, కర్తను, మూఢుడను అను మిథ్యాభిమానమునకున్నూ, అభావముసంప్రాప్తింపగాను; విధినిషేధవ్యవహారము ఎట్లగును? ఎట్లును గాదని యర్థము.

2) శ్లో॥ అన్వేష్టవ్యాత్మవిజ్ఞానాత్ ప్రాక్ప్రమాతృత్వ మాత్మనః
అన్విష్టః స్యాత్ప్రమాతైవ పాప్మదోషాది వర్జితః॥

తా॥ జీవునకు పరమాత్మ జ్ఞానము తెలియుట కంటెను పూర్వము నందే, ప్రమాతృత్వము (జీవభావము, కర్తృత్వము) కలదు; బ్రహ్మ తెలియంబడినప్రమాతయే, జీవుడే, పాపము, రాగము, ద్వేషము మొదలగు వానిచేవిడువబడిన పరమాత్మయేయగును;

3). శ్లో॥ దేహాత్మప్రత్యయో। యద్వత్ప్రమాణత్వేనకల్పితః।
లౌకికం, తద్వదేవేదం। ప్రమాణం త్వాత్మనిశ్చయాత్॥.

తా॥ దేహాదులందు, సత్యత్వబుద్ధి, భ్రాంతిచే కల్పింపబడినది. ఏప్రకారముగా (వైదికులచేత, లౌకికులచేత) వ్యవహారాంగముగా ప్రమాణమని అంగీకరింపబడునో, అప్రకారమే, ఈలోకమందలిప్రత్యక్షాది ప్రమాణ సముదాయమును, ఆత్మజ్ఞానము గలుగునందాకను వ్యవహార కాలమున బ్రమాణముగ(సత్యముగా—మూఢులచేత)నంగీకరింపబడుచున్నది.

సమన్వయాధికరణము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

నాలగవఅధికరణముసమాప్తము. శ్రీచతుస్సూత్రిసమాప్తము.

ఓం. తత్సత్

# బ్రహ్మవిద్య

## నవప్రకరణము



### శ్రీవిద్యారణ్య ప్రణీతంబైన శ్రీవేదాంత పంచదశిలోని మొదటి, వివేకపంచకము లోని విషయములు-

—:—

## 1. ప్రత్యక్ తత్త్వవివేకము.

(1) ప్రత్యక్తత్త్వ వివేకము = పరమాత్మను పంచకోశములనుండి, విడదిసి చూచుట = ప్రత్యక్ అనగా, ప్రాతిలోమ్యేన,- నైలక్షణ్యేన- అంచ్యతీతి- ప్రత్యక్ = అనృత జడస్వరూపమైన, జగత్తుకంటే విలక్షణమైన, సచ్చిదానంద స్వరూపముగానుండేది కాబట్టి ప్రత్యక్ అని చెప్పబడు చున్నది.

ప్రత్యక్చాసౌ- ఆత్మాచ- ప్రత్యగాత్మ అని కర్మధారయ సమాసము- అనగా అర్థము- అసౌ ఈయన ప్రత్యక్చ- ప్రత్యక్ అయిన వాడున్నూ ఆత్మాచ- ఆత్మయయిన వాడున్ను కాగా- ప్రత్యగాత్మ అని చెప్పబడు చున్నాడు. స్నాతానులిప్తాః। అనునట్లు విశేషణోభయ పదకర్మ ధారయ సమాసము ప్రత్యక్ తత్త్వవివేకము అనే పదమునందలి, తత్త్వ శబ్దమునకు ఆత్మ అర్థము

(2) పరబ్రహ్మము అఖండ సచ్చిదానంద స్వరూపము. ఆపరబ్రహ్మము కల్పితముగాదు. వాస్తవ స్వరూపముగలది. మాయాం కల్పితమగు జగంబునకున్ను, పరబ్రహ్మమునకున్నూ గలసంబంధమును, ఈ ప్రకరణమందు చెప్పబడును. అనగా, పంచకోశాది లక్షణముగల జగంబువల్ల బ్రహ్మతత్వమును విభజించి యెరిగెడి వివేకము కలుగును.

(3) శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదిసర్వవిషయములను, ఎరిగెడిది జ్ఞానము. అది, ఏకాకారముగా, ఆకాశమువలె, బాల్యాది,జాగ్రదాది, సర్వావస్థలయందును, సర్వకాలములయందును, సమస్త భూతములయందును, జనన, మరణాది, వికారములను బొందక, స్వప్రకాశస్వభావముచేతప్రకాశించుచు, సర్వజగంబునుప్రకాశింపజేయుచున్నది; అనగా యీజ్ఞానవస్తువవల్లనే, సర్వజగంబు, ప్రకాశింపబడుచున్నది. నిత్యత్వ, సత్యత్వ, స్వప్రకాశస్వభావములుగలఈఅద్వితీయమైన జ్ఞానవస్తువు, ఆత్మయనెడి శబ్దము చేతవ్యవహరింపబడుచున్నది.

(4.) ఈ జ్ఞానవస్తువైన ఆత్మ, నిరతిశయస్నేహమునకు విషయుడు; పరమానందస్వరూపుడు; నాకెప్పుడును నాశముకలుగకూడదు నాకుసర్వదాశాశ్వతమైనస్థితికలుగవలయును అని, ఆత్మయందు పరమస్నేహభావమును ప్రతివాడుకోరుచున్నాడు; ఇదిసర్వానుభవసిద్ధము. ఆత్మయందుగలస్నేహము అన్యనిమిత్తకముకాదు. ఇదినిరుపాధికస్నేహము.

శ్లో॥ ఇయమాత్మా, పరానందః పరప్రేమాస్పదంయతః।
మానభూవం హిభూయాసమితి ప్రేమాత్మనీక్ష్యతే॥ వే. పం.– 8

టీ॥ ఇయం = ఈజ్ఞానవస్తువు, ఆత్మా = ఆత్మశబ్దము చేత, వ్యవహరింవబడును; యతః = ఏకారణమువల్ల, పర = నిరుపాధికమైన, ప్రేమ = స్నేహమునకు, ఆస్పదం = విషయమో, అతః = ఆకారణమువల్ల పరానందః = పరమసుఖస్వరూపుడగును; హి = ఏకారణమువల్ల, ఆత్మ ని = తన విషయమైం మాభూవమితిన = తాను వుండకూడదని లేదో; భూయాసం = సర్వదానేనుండువాడ నగుదునుగాక; ఇతి = ఇట్లని, ప్రేమ = స్నేహము, ఈక్ష్యతే = చూడబడుచున్నదో, అనగా సర్వజనులచేత అనుభవింపబడు చున్నదో.

శ్లో॥ తత్ప్రేమాత్మార్థ మన్యత్ర, నైవమన్యార్థమాత్మని।
అతస్తత్పరమం, తేన పరమానందతాత్మనః॥ 1–9

టీ॥ అన్యత్ర = పుత్రభార్యాదులయందే ప్రేమగలదో, తత్ప్రియ ఆస్నేహము, ఆత్మార్థం = తనప్రయోజనముకొరకే అగును; ఏవం = ఈ ప్రకారము ఆత్మని = తనయందుగల స్నేహము, అన్యార్థం = పుత్రభార్యాదుల నిమిత్తమైనది న = కాదు; అతః = అట్టి నిరుపాధికత్వమువల్ల, తత్ = ఆత్మవిషయమైన స్నేహము, పరమం = మిక్కిలి యతిశయమైన దగును; తేన = అట్టి నిరతిశయ స్నేహవిషయత్వముచేత, ఆత్మనః = ఆత్మకు, పరమానందతా = పరమానందస్వరూపము సిద్ధమగును.

(5.) ఆత్మయొక్క ఆనందము, సామాన్యముగా స్ఫురించుచున్నది. అవిద్యవలన విశేషాకారముగా స్ఫురింపకున్నది. ఈఅవిద్యఉత్పత్తిలేక విపరీత జ్ఞానములకు కారణమై, యనాదిగా నున్నది. అది జ్ఞానానందస్వరూపమైన పరబ్రహ్మముయొక్క ప్రతిబింబముతోటికలిసియుండును.

(6.) పరబ్రహ్మంబును, ఆత్మవలె సచ్చిదానంద స్వరూపము. ఆయాత్మ బ్రహ్మములైన, త్వంపదార్థ తత్పదార్థకములకు ఏకత్వరూపమగు అఖండైక రసత్వము, ఉపనిషత్తుల వలన చెప్పబడుచున్నది.

శ్లో॥ ఇత్థంసచ్చిత్పరానంద ఆత్మా, యుక్త్యాతథావిధం।
పరంబ్రహ్మ, తయోశ్చైక్యం శ్రుత్యంతేషూపదిశ్యతే.

టీ॥ ఇత్థం = ఈ ముందు చెప్పినప్రకారం, యుక్త్యా = యుక్తిచేత, ఆత్మా = ప్రత్యగాత్మ, సత్ = సద్రూపుడున్నూ, చిత్ = చిద్రూపుడును, ఆనందః = ఆనందస్వరూపుడును అగును; పరబ్రహ్మచ = పరబ్రహ్మంబును, తథావిధం = సత్యజ్ఞానానంద స్వరూపమేయగును; తయోః = ఆ ప్రత్యగాత్మ పరబ్రహ్మములకు, ఐక్యం = ఏకరూపత్వము, శ్రుత్యంతేషు = వేదాంతములయందు. ఉపదిశ్యతే = చెప్పబడుచున్నది.

(7.) జీవులు, దేవమనుష్య, పశ్వాదిరూపవంతులగుచు, ప్రత్యగాత్మ రూపమగు పరబ్రహ్మముయొక్క జ్ఞానములేనివారై, బాహ్య విషయములనే చూచుచున్నారు. గాని, ప్రత్యగాత్మను జూడలేరు.

శ్రు॥ పరాంచిఖాని, వ్యతృణత్స్వయం,
భూస్తస్మాత్పరాక్పశ్యతి నాంతరాత్మన్.

సుఖములేక సంసారమందు ప్రవర్తించుచూ జనన మరణాది దుఃఖమును పొందుచున్నారు,

(8) అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము, ఆనందమయకోశము, అని 5 కోశములు.) పంచీకరింపబడిన, స్థూలభూతములవల్లపుట్టిన స్థూలమనెడి శరీరము అన్నమయకోశము లింగదేహమందు వర్తించెడిప్రాణము అపానము, సమానము, ఉదానము, వ్యానములనెడి పంచవాయువులును; వాక్కుపాణి, పాదము, పాయువు, ఉపస్థలనెడి పంచకర్మేంద్రియములును; ఈపదియుసుంజేరి ప్రాణమయకోశమగును. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడి జ్ఞానేంద్రియ పంచకముతో కూడిన సంశయవృత్తిరూపమగుమనస్సుమనోమయకోశమగును. ఆజ్ఞానేంద్రియ పంచకముతో గూడినిశ్చయ రూపమగుబుద్ధివిజ్ఞానమయకోశమని చెప్పబడును. కారణ శరీరరూపమగు అవిద్యయందు ఏమలినసత్వగుణముగలదో, ఆ మలినసత్వగుణము, ప్రియమోదప్రమోదములనెడి సుఖవిశేష వృత్తులతోగూడినదై, ఆనందమయమనెడికోశమగును స్థూలదేహాదులకుఅన్నాదులచేత వికారత్వముకలిగియుండుటవలన, ఆస్థూల దేహాదులకు అన్నమయ, ప్రాణమయాది నామములు కలిగెను. ప్రత్యగాత్మయో, ఆయాకోశములతోటి సంబంధమువల్ల, అది నేననెడి తాదాత్మ్యాభిమానముచేత, అన్నమయాదికోశమయుడాయెనని, శ్రుతిచేత చెప్పబడెను. వ్యవహారకాలమందు అన్నమయాది పంచకోశప్రాధాన్యముగలిగియుండుటవల్ల, ఆత్మయు అన్నమయాదిశబ్దములచేత చెప్పబడుచున్నాడు.

(9). అన్వయవ్యతిరేకములచేత పంచకోశములయొక్క, వివేకముచేత, అనగా, పంచకోశములను, ప్రత్యగాత్మకంటె, భిన్నముగాచేయుటచేత, అనగాస్వాత్మానం = ప్రత్యగాత్మను, తతః = ఆపంచకోశములనుండి, ఉధృత్య = బుద్ధిచేతనెత్తి, అనగాచిదానందస్వరూపమును, ఆయాత్మకు నిశ్చయించి, పరంబ్రహ్మ = పంచకోశవిలక్షణపరబ్రహ్మమును, ప్రపద్యతే = జీవుడు పొందుచున్నాడు. అనగా బ్రహ్మమే యగుచున్నాడు.

శ్లో॥ అన్వయవ్యతిరేకాభ్యాం పంచకోశవివేకతః
స్వాత్మానంతత ఉద్ధృత్య, పరంబ్రహ్మ ప్రపద్యతే॥ |_37

అన్వయమనగా = అనువృత్తి; సర్వావస్థలయందు స్వాభావికముగా వర్తించుట;

వ్యతిరేకమనగా = వ్యావృత్తి = నకఅవస్థయందు తోచుచుండి, మరియొకయవస్థయందు నివర్తింపబడుట.

(10). స్వప్నావస్థయందు, స్థూలదేహము అన్నమయకోశము, స్ఫురింపకుండుటవల్ల, స్థూలదేహమునకు వ్యతిరేకమగును. ఆయవస్థయందు ప్రత్యగాత్మకు స్వప్నసాక్షిత్వముచేత, యేస్ఫురణముగలదో, అదియాత్మకు అన్వయమగును. ఇట్లుస్థూలదేహమునకు,అనాత్మత్వము, స్పష్టమగుచున్నది. సుషుప్త్యవస్థయందు స్థూలసూక్ష్మదేహములు స్ఫురించవు: ఆసుషుప్త్యవస్థకు సాక్షిత్వముచేత, ఆత్మస్ఫురించుచున్నాడు మెలకువవచ్చిన తరువాత, సుఖముగా నిద్రపోయనానంటున్నాడు. ఆట్టిస్ఫురణమే, జ్ఞానస్వరూపుడగు ఆత్మకు అన్వయమగును. స్థూలసూక్ష్మదేహములు స్ఫురించకపోవుటయే స్థూల సూక్ష్మదేహములకు వ్యతిరేకమగును; ప్రాణమయ మనోమయ, విజ్ఞానమయకోశములు మూడును, సత్త్వరజోగుణములయొక్క స్థితివిశేషమువల్ల, ఆలింగదేహమునందు అనగా సూక్ష్మదేహమందు భిన్నముగాచెప్పబడినవి. లింగదేహము ఆత్మకంటె, భిన్నముగనుక లింగదేహ

మగు ప్రాణమయ, మనోమయ. విజ్ఞానమయ కోశములు మూడును ఆత్మకంటెభిన్నములు.

కారణ శరీరమే ఆనందమయకోశమగును. సమాధ్యవస్థయందు, సుషుప్తియందుంౘెడికారణ దేహరూప అజ్ఞానముయొక్క స్ఫురణము, వుండదు, లేదు. అప్పుడు ఆత్మకే స్ఫురణము గలిగియున్నది. స్ఫురణము గలుగుటకు, ఆత్మకు, అన్వయము; అజ్ఞానముయొక్క స్ఫురణములే కుండుట, అజ్ఞానమునకు వ్యతిరేకమగును.

ఇట్లు, ప్రత్యగాత్మ, సర్వావస్థలయందును, సర్వదావర్తింపుచున్నాడు; పంచ కోశములకంటె అన్యుడు.

(11). పైన చెప్పబడిన విధముగా, పంచ కోశములచేత ఆత్మస్వరూపము కప్పబడియున్నది. అవి, ఆత్మయొక్క ఆనందాది స్వభావములను మరుగుపరచి జీవునకు దుఃఖహేతు వగుచున్నవి, పూర్వజన్మ పుణ్యవశమువలన, జ్ఞానసాధన, శ్రవణముచేత. అన్నమయాది పంచకోశములును ఆత్మకంటే భిన్నములైనవని వివేకముకలుగును. ఆవివేకముచేత మోక్షముకలుగును. తత్త్వమస్యాది వాక్యములచేత, ఆవాక్యార్థమగు జీవబ్రహ్మైక్య లక్షణ మునువిని, తెలుసుకుని, మనన, నిధిధ్యాసలచేత ఆత్మ స్వరూపమందు చిత్తమును ధారణావంతముచేసి, నిరంతరము ఆత్మను ధ్యానించుటచేత, చిత్తమునకు యేకాకారవృత్తిత్వము కలుగును. ఇదియే నిదిధ్యాస. ఆనిధిధ్యాసమందు, చిత్తము ఎప్పుడు ధ్యాతృ ధ్యానములను విడచి, ధ్యేయమువంటిదియై యుండునో, అప్పుడు సమాధియని చెప్పబడును. యీసమాధి చేత పుణ్యాపాప లక్షణ కర్మలు, వాసనలు అన్నియు నశించును. మూలాజ్ఞానము నిశ్శేషముగా నశించును. యీసమాధిపుణ్య లక్షణములైన అమృతధారలను వర్షించుచున్నది. ప్రత్యక్షముగా బ్రహ్మస్వరూపమును ప్రకాశింప జేయుటకు సమర్థమైన

జ్ఞానమును, పుట్టించుచున్నది. సత్యజ్ఞానానందలక్షణ పరబ్రహ్మమే పురుషుడగుచున్నాడు.

(12). శ్లో॥ పరోక్షం బ్రహ్మవిజ్ఞానం, శాబ్దం, దేశిక పూర్వకం।
బుద్ధి పూర్వాకృతం పాపం,కృత్స్నందహతివహ్నివత్॥

తా. పరోక్ష బ్రహ్మజ్ఞానము సర్వ పాపములను దహించును.

శ్లో॥ అపరోక్షాత్మ విజ్ఞానం, శాబ్దం దేశికపూర్వకం।
సంసార కారకాజ్ఞానతమసశ్చంఢ భాస్కరః॥

తా. అపరోక్ష జ్ఞానము పురుషునకు అజ్ఞానమును నశింపజేసి, సర్వ సంసార విముక్తిని కలిగింపుచున్నది.

ఓం, తత్సత్.

—:—

# 2. పంచభూతవివేకము

(1). జగదుత్పత్తికంటె పూర్వమందు, సర్వ జగత్కారణమగు సద్రూప అద్వితీయ బ్రహ్మమొక్కటియే యున్నట్లు శ్రుతిచెప్పుచున్నది.

శ్రు. సదేవసోమ్య, దమగ్రఆసీదే, కమేవాద్వితీయం॥

(2.) ఆకాశాది పంచ భూతములును ఆపరబ్రహ్మ వల్లకలిగిన కార్యములు. ఆపంచ భూతములు బ్రహ్మమునకు ఉపాధిరూపముగానున్నవి. కార్యములగుపంచభూత స్వరూపమును, విభజించుటచేత, తత్కారణమగు బ్రహ్మము తెలియును. అందువలనపంచభూతవివేకము చెప్పబడుచున్నది.

(3). అసత్యమై కనబడుచుండెడి వస్తువు మిథ్యయని చెప్పబడును. మిథ్యారూప అసత్య వస్తువులేనిదగుటచేత, అది సద్వస్తువునకు విరోధికాదు. మిథ్యారూపమగు జగదాదికముచేత సత్తునకు భేదములేదు,

(4) మాయ, శూన్యము గానట్టియు, సద్రూపము గానట్టియు, రూపముగలది.

బ్రహ్మమందు మాయాశక్తి, యేకభాగమందే వర్తించుచున్నది. మాయారహితమైన నిర్గుణ బ్రహ్మమునకు నిర్వికల్ప స్వరూపమును శ్రుతి చెప్పుచున్నది.

(5) ఏవస్తువు స్వరూపముచేత లేనిదగుచు, ఉన్నట్లుతోచుచున్నదో, అది స్వప్నములో కనబడెడి వస్తువవలె మిథ్యయగును. యిట్టి మిథ్యాలక్షణము, ఆకాశమందుండుటచే, ఆకాశము స్వరూపముచేత లేకపోయినను యున్నట్లు తోచుచున్నది. గనుక ఆకాశము మిథ్య. ఆకాశమునకుశబ్దము;వాయువునకుశబ్దస్పర్శములు;అగ్నికి శబ్ద,స్పర్శ, రూపములు; జలమునకు,శబ్ద స్పర్శ,రూప,రసములు; భూమికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు- గుణములు; ఈగుణములన్నీ మిథ్యలే. అన్నిటిలోవున్న, వున్నది అనేసద్వస్తువ, సత్యమైనది. భూమి, దీనిగుణమగు గంధము కలసివకటిగానున్నను, రెంటికి భేదముకలదు. అటులనే ఆకాశ, సద్వస్తువలు, కలశియున్నను, వాటికి భేదముగలదు. ఆకాశము యొక్క గుణములు, అవకాశము, శబ్దము; ఆకాశము సర్వదామిథ్య.

సద్వస్తువలోనుంచి వకశక్తి బయలుదేరి అది ఆకాశరూపముగా పరిణమించినది. సద్వస్తువ, ఆకాశము, భేదములు; ఆకాశము మిథ్యపదార్థము; అందులోసద్వస్తువ, తప్ప మరియేమీ లేదు. సద్వస్తువలోని, శక్తి, ఆకాశముగా పరిణమించినది. మిథ్యాలక్షణము, మాయయందును, మాయాకార్యమైన, ప్రపంచమందునుసమాన ముగానున్నది.

ఆకాశముమిథ్యయనియు, సద్వస్తువైన బ్రహ్మమే సత్యమనియు, నిశ్చయముకలిగినపిమ్మట, వాయువుమొదలగు సర్వభూతములయందుగల సద్వస్తువనుబుద్ధిచేత నాయాభూతములవల్ల విభజించి, భిన్నముగానున్నట్లుజూడవలెను.

(6) జ్ఞానేంద్రియములు—శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము—పంచభూతములయొక్క కార్యములు. అవి అపంచీకృతపంచభూతకార్యములగుటవల్ల, సూక్ష్మరూపమును గలిగియున్నవి. అందుచేత ఆయా యింద్రియ రూపముకనబడదు.

ఈజ్ఞానేంద్రియములైదును సాధారణముగా బాహ్యప్రదేశమునకు పరుగెత్తుచున్నవి. ఒకానొకప్పుడు, అన్తర విషయ గ్రహణము జ్ఞానేంద్రియములకుగలిగియున్నది. ఎట్లనగా, జలమును త్రాగినప్పుడు, అన్నమును భక్షించినప్పుడు, గర్భములోని స్పర్శములను, త్వగింద్రియము, గ్రహించుచున్నది. కన్నును మూయుచుండగా దేహములోని చీకటిని, చక్షురింద్రియము గ్రహించుచున్నది— రసనేంద్రియమురసమును, ఘ్రాణేంద్రియము గంధమును, గ్రహింపుచున్నవి.

వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థలనెడి, పేరుగల కర్మేంద్రియములచేత, వచించుట, తీసుకొనుట, నడుచుట, మలమునువిడుచుట, ఆనన్దించుట,జలమునువిడుచుట, అనేపంచ క్రియలు, క్రమముగా కలుగుచున్నవి.

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములగు, పదింటికిని, మనస్సు అధికారి. ఆమనస్సు హృదయకమలమందుండును. ఆమనస్సు, జ్ఞానేంద్రియములతోగూడి; బాహ్యస్థలములకువ్యాపించునేగాని, తనంతట బాహ్యస్థలములకు వ్యాపింప నేరదు. అందువలన, మనస్సుఅంతరింద్రియమని, చెప్పబడును. ప్రమాతయనగా కూటస్థసహిత, బుద్ధిస్థచిదాభాసుడని తెలియవలెను.

శ్రు॥ అన్నమయం హి సోమ్యమనః।
ఆపోమయః ప్రాణ స్తేజోమయీ వాక్.

ఇత్యాది శాస్త్రము, మనస్సు మొదలగు యిందిృయములు అన్నియు పంచభూతకార్యములని చెప్పబడు చున్నది.

కర్మేంద్రియములు (5) జ్ఞానేంద్రియములు (5) పంచవాయువులు, అంతః కరణ చతుష్టయము, మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము, యివన్నియు వాటివాటికిగల, శబ్దగ్రహణాది శక్తులుగలవై సూక్ష్మమైయుండు వస్తువులు. యివన్నియు పంచభూత కార్యములు. మాయామయత్వమందు మిథ్యాలక్షణమే ప్రయోజనమగు గాని, అవ్యక్తభావము ప్రయోజనముకాదు. ఆ మిథ్యాలక్షణము మాయయందును, మాయాకార్యమైన ప్రపంచమందును, సమానముగానున్నది. గనుక వాయువును, మాయామయముగాని, దానినిగా జెప్పరాదు.

(7) ఇట్లు ఆకాశాది పంచభూతములకును, ఆభూతకార్యములగు బ్రహ్మాండలోక దేహములకున్నూ, వీటికికారణమగు మాయకున్నూ, వివేక, ధ్యానములచేత మిథ్యాభావమును అభ్యసింపవలెను. మాయకు మిథ్యాభావ దృఢత్వమువలన, సద్వస్తువునకు అద్వైత భావబుద్ధి నశింపదు. బ్రహ్మాండంబును, 14 లోకములు, శరీరములును, ఘటాది సకల పదార్థములును, పంచభూతకార్యములగుటవలన భౌతికములని చెప్పబడును.

(8). పరమార్థమగు అద్వైత దశయందు, సకలద్వైతమును నిషేధించుటచేత, ద్వైతనిషేధమునకు అవధిగా, సద్వస్తువగునిర్వికల్ప బ్రహ్మము శేషించును. ఆనిర్వికల్ప బ్రహ్మవస్తువు, నిశ్చలమైనదగును. సద్వస్తువైన బ్రహ్మము మాయాభ్రాంతిచేత ఆకాశాది రూపముగా వర్తించుచున్నది. ఆ బ్రహ్మమే శ్రుత్యర్థ విచారణచేత, ఆకాశాది భావమును విడిపించి, సద్రూపమగు బ్రహ్మమే యగుచున్నది. శ్రుత్యర్థవిచారణచేత వస్తువుయొక్క యథార్థజ్ఞానము కలుగును.

సృష్టికి పూర్వమందు రెండవది లేని సద్వస్తువొక్కటియె యున్నదని, శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడిశ్రుతిజెప్పుచున్నది. అనగా, అఖండైకరస సద్రూపమగు బ్రహ్మ వస్తువుగలదని,

చెప్పుచున్నది. ఆకారముతో గూడినవస్తువునందు, సంచరించినట్లు, యీ అద్వితీయసద్వస్తువనందు సంచరింపవలయును. యీనిర్వికల్పక సమాధి అస్పర్శయోగమనెడిప్రసిద్ధికలది. యీ నిర్వికల్ప సమాధిని, సాకారధ్యాననిష్ఠులగు, ఇతరయోగులు, పొందజాలరు. నిర్జనప్రదేశమందు బాలురు, భయహేతుత్వమును కల్పించుకొని, భయమును, పొందినట్లు, బోధలు లేనిప్రకృతిని నిగ్రహించి, బుద్ధికి సాక్షియగు, ఆత్మనంగీకరింపక, శూన్యభావమును పొందిరని గౌడపాదాచార్యులు చెప్పిరి. సద్వస్తువగు, నిర్వికల్పబ్రహ్మమందు, ఆకాశాదిపంచభూతముల యొక్క—నామరూపములను, రెంటిని, మాయాశక్తికల్పించినదని సిద్ధాంతము. సద్వస్తువునకు నామరూపములు కల్పించబడెనని చెప్పబడలేదు. ద్వైతసంస్కారముతో గూడియుండెడి, శిష్యుని బోధించెడి, నిమిత్తము, శ్రుతిప్రవర్తించి సృష్టికి పూర్వమందు సద్వస్తువక్కటి తప్పమరియెద్దియు లేదనిచెప్పెను. అందుచేత బ్రహ్మము సద్వితీయమని, శంకించగూడదు. పరమార్థమందు అద్వైతస్వరూపమే వాస్తవము.

(9) తూష్ణింభావమందు, అమనస్కులగుటచేత, సద్వస్తువుప్రత్యక్షముగాననుభవింపబడుచున్నది. ఆతూష్ణీంభావమందు, శూన్యమే ననెడి శూన్యమైన బుద్ధిలేమివల్ల, శూన్యత్వము సంభవింపదు. సద్వస్తువు స్వప్రకాశరూపమగుటవల్ల, తూష్ణీంభావమందు, సద్వస్తువిషయమైన బుద్ధివుండదు. అప్పుడు, మనోరాహిత్యమును గురించి, సద్వస్తువుబోధస్వరూపముచేత, సాక్షిగానున్నది. అనగా అప్పుడు అమనస్కత్వసాక్షిత్వము, సద్వస్తువునకు గలిగియుండుటవల్ల, అప్పుడు, సద్వస్తువున్నదని సులభముగా నెరుగవచ్చును.

(10) నిర్గుణుడగు నాపరమాత్మ భూమినియంతటను, వ్యాపించి బ్రహ్మాండము నతిక్రమించియున్నాడు.

శ్రు॥ సభూమిం విశ్వతోవృత్వాత్యతిష్ఠద్దశాంగులం॥

వికారమందువర్తింపని నిర్వికల్పరూపము బ్రహ్మమునకు గలదు.
సూ॥ వికారావర్తిచతథాస్థితిమాహ॥ గనుక శ్రుతిసూత్ర
ములవలన, మాయారహితమైన, నిర్గుణబ్రహ్మమునకు, నిర్వికల్ప
స్వరూపమును చెప్పబడినది.

వివేకముచేత ద్వైతమునకు మిథ్యాభావము, నిశ్చయించినను,
భూమ్యాది, ద్వైత స్వరూపమునకు నాశము కలిగింపమివలన,
జ్ఞానికి వ్యవహారలోపము కలుగదు. ద్వైతము మిథ్యయనెడి
జ్ఞానము దృఢమైనకొలది, అద్వైత బ్రహ్మస్వరూపమందు బుద్ధి
స్థిరముగా నిలుచును. అదియే జీవన్ముక్తత్వము. జీవించియుండియే,
సంసార బంధమువల్ల విముక్తబడిన వాడగును.

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాస్యామంతకాలేపి, బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥
(గీతావచనము)

తా॥ అంత కాలమందైనను ఈబ్రహ్మనిష్ఠయందున్నవాడు, విదేహ
ముక్తిని పొందుచున్నాడు.

శ్లో॥ దినేదినే స్వప్నసుప్త్యో రధీతేవిస్మృతేప్యయం
పరేద్యుర్నా నధీతస్స్యా త్తద్వద్విద్యా, ననశ్యతి॥ 2_107

తా॥ ప్రతిదినమందు, చదువబడిన వేదము, స్వప్నాద్యవస్థలయందు,
మరచి పోబడినను, ఆపురుషుడు పరదినమందు, వేదమును, చద
వని వాడుకాడు. అలాగే, మరణకాలమందు, మూర్ఛాదులచేత
బ్రహ్మ స్వరూపాను సంధానములేక పోయినను, జ్ఞానము నశిం
చదని తెలియవలెను.

శ్లో॥ నీరోగ ఉపవిష్టోవా రుగ్ణోవా, విలుఠన్ భువి
మూర్ఛితోవాత్యజత్వేష ప్రాణాన్, భ్రాంతిర్న సర్వథా. 2_109

టీ॥ ఏషః - ద్వైత భ్రాంతిలేని జ్ఞాని నీరోగస్సన్ - వ్యాధిలేని వాడగుచు, ఉపవిష్టోవా - కూర్చున్నవాడైనను, రుగ్ణస్సన్ - వ్యాధిగలవాడగుచు, భువి - భూమియందు, విలుఠన్వా - పొర్లాడుచున్నవాడైనను; మూర్ఛితోవా - మూర్ఛను బొందిన వాడైనను, ప్రాణాన్ - ప్రాణములను; త్యజతు - విడుచుగాక; సర్వథా - సర్వవిధములచేతను; భ్రాంతిః - ద్వైత భ్రమ: న - లేదు.

శ్లో॥ ప్రమాణోత్పాదితావిద్యా,ప్రమాణం ప్రబలంవినా
నన‌శ్యతి; నవేదాంతాత్ప్రబలం, మానమిష్యతే॥ 108

తా. బ్రహ్మజ్ఞానము వేదాంత ప్రమాణముచేత పుట్టినదగును; అట్టి బ్రహ్మజ్ఞానము బలవత్తరమైన మరియొక ప్రమాణముచేత గాని నశింపదు. వేదాంతప్రమాణముకంటె బలవత్తరమైన మరియొక ప్రమాణములేదు. గనుక బ్రహ్మజ్ఞానమెప్పటికిని, నశింపదు.

శ్లో॥ తస్మాద్వేదాంత సంసిద్ధం, సదద్వైతం, నబాధ్యతే।
అంతకాలేప్యతోభూత వివేకాన్నిర్వృతిస్థితా॥ 109

ఓం, తత్సత్

—:—

# 3 పంచకోశవివేకము.

## తైత్తిరీయోపనిషత్తాత్పర్యము



(1) ఏపరబ్రహ్మము అన్నమయాది పంచకోశములనెడి గుహాయం దుండెవని చెప్పబడునో, ఆపంచకోశములును, ప్రత్యగాత్మ స్వరూపము కంటె భిన్నములని విభజించి చూపబడును.

శ్రు॥ యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్॥

(2) స్థూలదేహము, అన్నమయకోశము; ప్రాణమయకోశము; మనోమయకోశము; విజ్ఞానమయకోశము; ఆనంద మయకోశము; ఇట్లు వకటివెనుక మరియొకటి, పరంపరాకారముగానున్న పంచకోశ స్వరూపమే, శ్రుతియందు చెప్పబడిన, గుహా, శబ్దముచేత చెప్పబడుచున్నట్టు తెలియుచున్నది.

(3) స్థూలదేహము కార్యమగుట వల్లను, జన్మమునకు పూర్వమందును, మరణమునకు బిమ్మటయు, వుండనికారణమువల్లను, ఆత్మగాదు.

(4) వాయువు (ప్రాణమయకోశము), చైతన్యముగాక, జడస్వభావమును కలిగియుండుటచే, ఆత్మగాదు.

(5) మనస్సు (మనోమయకోశము), కామక్రోధాది వృత్తులను కలిగినది; నియతరూపముగలదికాదు; వికారభావమును పొందియుండుటవల్ల అది ఆత్మ గాదు.

(6) చిధాభాసునితో (అంతఃకరణలో ప్రతిఫలించిన - ప్రతిబింబము- బ్రహ్మచైతన్య ప్రతిబింబము) గూడినబుద్ధి, సుషుప్తికాలమందు లయించుచున్నది. జాగరితకాలమందు శరీరమంతావ్యాపించియుండును. ఆబుద్ధి,విజ్ఞాన మయకోశమనబడును. ఈబుద్ధి ఒక

ప్పుడుండుట, ఒకప్పుడు లయించుట, ఇటువంటి అవస్థలను కలిగియుండుటచే యీ కోశము ఆత్మగాదు.

(7) ఒకానొకప్పుడు బుద్ధివృత్తి (నేననెడి, అహంభావము) అంతర్ముఖముగలదగుచు, ఆత్మస్వరూపమగు ఆనందరూపము యొక్క ప్రతిబింబమును పొందుచున్నది. ఒకప్పుడు నిద్రారూపముగా లీనమగుచున్నది. అట్టివృత్తి ఆనందమయమని చెప్పబడినది. అది, అనిత్యస్వభావముగలది. ఆనంద మయమనెడి ప్రతిబింబమునకు కారణభూతమైన, ఆనందబింబము, నిత్యమైనది. అది ఆత్మయగును. ఆనందమయ కోశము ఆకాశాదులవలె ఉత్పత్తి, వినాశములను గలిగినదవుటచే, ఆత్మగాదు.

(8) ఆత్మకు, అనుభవరూపత్వమే యగుగాని, అనుభవింపబడెడి స్వభావము లేదు. ఆత్మ, జ్ఞానవిషయుడు, గాడు. పంచకోశములు, ఆత్మకు జ్ఞానవిషయములు. శ్రుతులు ఆత్మకు స్వప్రకాశత్వమును బోధించు చున్నవి. ఆత్మయొక్క స్వప్రకాశత్వముచేత, సర్వ ప్రపంచము ప్రకాశింప బడుచున్నది. స్వప్రకాశత్వమే అనుభవ రూపత్వము. ఇతరజ్ఞాతృజ్ఞానములచేత అనుభవింప బడెడివాడు కాడు.

పంచ కోశములకు అనాత్మభావము నిశ్చయింపబడగా, పంచ కోశములకును సాక్షిరూపమగు బోధయే, తన స్వరూపమగు బ్రహ్మమగును.

(9) తనయొక్క అభావమును, లేకపోవుటను, యెవరూ అంగీకరించరు. బ్రహ్మము లేదని చెప్పరాదు. ఆత్మయొక్క బాధకు సాక్షి లేదు. సర్వజగద్బాధకు, సాక్షియగు, ప్రత్యగాత్మయందు, సాక్షిచైతన్యము సర్వదాఉన్నది. అహంకారాది, దృశ్యపదార్థము, ఆత్మగాదు. ఇట్లు ఆత్మయందు సత్య, జ్ఞానలక్షణములు రెండును గలవు. అనంత స్వభావమున్నూ గలదు. దేశముచేత, వస్తువుచేత, కలిగెడి పరిచ్ఛేదము ఆత్మకులేవు.

(10) ఆత్మ, బ్రహ్మములకు, భేదములేదు. ఈశ్వరత్వ, జీవత్వములు, రెండు ఉపాధులచేత, బ్రహ్మమునకే కల్పింపబడినవి. జడరూపమగు, జగత్తువలెనే, ఈశ్వరజీవులు, వాస్తవమైనవికావు.

(11) మాయా శక్తియందు, పరబ్రహ్మము యొక్క ప్రతిబింబము ప్రవేశించి యున్నది. ఆ ప్రతిబింబము చిదాభాసుడని చెప్పబడును. అట్టి చిదాభాసునితోటి, ఆమాయాశక్తి, కూడియుండుట వల్ల, అమాయాశక్తి, చేతనభావమును పొందినదానివలెతోచుచున్నది. అట్టిమాయాశక్తియే, బ్రహ్మమునకు ఉపాధియగును. ఆమాయాశక్తిరూపోపాధితోటిసంబంధమువల్ల, సత్యజ్ఞానానంద స్వరూప పరబ్రహ్మము, సర్వజ్ఞత్వాది ధర్మములుగల, ఈశ్వర భావమును పొందుచున్నది. ఆనందమయకోశము మొదలుకొని, పృధివ్యాది సర్వవస్తువుల యందును, ఈశ్వరుడు గూఢమయి యున్నవాడు. అందువల్ల, మనయింద్రియముల చేత గ్రహింపబడ లేదు. 3-40;

(12) పంచకోశ విభజనలక్షణమైన, వివేకపూర్వకముగా, పరబ్రహ్మమును, సాక్షాత్కరించుకొన్న పురుషుడు, తానే సత్యజ్ఞానానందస్వరూప పరబ్రహ్మమగుచున్నాడు. శ్రు॥. సయోహావైతత్పరమం, బ్రహ్మవేద బ్రహ్మైవభవతి బ్రహ్మవిదాప్నోతి పరం॥.

(13) పంచకోశోపాధిని ఆలోచించునప్పుడు, సత్యజ్ఞానానంత స్వరూపలక్షణపరబ్రహ్మమే, జీవవ్యవహార విషయత్వమును పొందుచున్నది. లోకమందు ఒకదేవదత్తుడనెడి పురుషుడు, పుత్రుని గురించితండ్రియగును; మనుమనిగురించితాతయగును. అటువలెనే బ్రహ్మంబును పంచకోశోపాధిని విచారించునప్పుడు, ఆబ్రహ్మమే ఈశ్వరుడగునని తెలియవలెను.

(14) పుత్ర పౌత్రాది సంకల్పము లేనప్పుడు, దేవదత్తుడనెడి మనుష్యుడు, తండ్రియుం, తాతయుం గానట్లు, మాయాశక్తి, పంచ

కోశవిషయక విచారణము, లేనప్పుడు ఆబ్రహ్మమునకు ఈశ్వ
రత్వ జీవత్వములు రెండును లేవు. 3_42

(15) ఈప్రకారము పంచకోశవిభజనలక్షణమైన, వివేక పూర్వక
ముగా, ప్రత్యగాత్మకంటె, అభిన్నమైనపరబ్రహ్మమును, యవరు
సాక్షాత్కరించుకొనుచున్నారో, అట్టివారికి, బ్రహ్మత్వములభిం
చును. అట్లుబ్రహ్మత్వము లభించుటచేత, మరల జన్మమును
పొందరు.

స్మృ॥. నజాయతే, మ్రియతేవావిపశ్చిత్.॥,

శ్రు॥. నచపునరావర్తతే:॥.

ఓం తత్సత్

---

# 4 ద్వైత వివేకము

(1) ఈశ్వరుడు, మాయను ఉపాధిగాగల అంతర్యామి. జీవుడు,
పంచకోశములను ఉపాధిగాగలిగి, నేనని అభిమానించెడివాడు.
జీవేశ్వరులచేత సృష్టింపబడిన రెండువిధములైన ద్వైతములను,
విభజించి చూపబడును. వాటిలోజీవునిచేతసృష్టింపబడిన ద్వైత
ము, బంధహేతువగుటచే, అది విడువదగినదని చూపబడును.

(2) మాయాశక్తిని,ప్రకృతిగాతెలుసుకొనవలయుననియు, మాయో
పాధికుడు మహేశ్వరుడనియు, అట్టిమహేశ్వరునివలన సర్వ
జగత్తు, సృష్టింపబడినదనియు, వేదాంతసిద్ధాంతము. ఇట్లుబహు
శ్రుతులు - అనగా శ్వేతాశ్వతరశాఖలు, ఐతరేయోపనిషత్తు
నందు, తైత్తిరీయమునందు, ఛాందోగ్యశృతి, ముండకోపనిషత్తు
బృహదారణ్యకశ్రుతి, చెప్పుచున్నవి. జీవునివల్ల జగత్తుపుట్ట
లేదనియు స్పష్టము.

1 శ్రు॥ మాయాంతుప్రకృతిం,
విద్యాన్మాయినంతుమ
హేశ్వరం, అస్యావయవభూతైస్తు,
వ్యాప్తం, సర్వమిదంజగత్॥

శ్రు॥ అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్॥
"శ్వేతాశ్వతరశాఖలు"

శ్రు॥ ఆత్మావా ఇదమేక ఏవాగ్ర,
ఆసీన్నాన్యత్కించ,
నమిషత్స, ఈక్షతలో
కాన్ను, సృజాఇతి.
సఇమాన్‌లోకానసృజత॥
"ఋక్‌శాఖలు – ఐతరేయోపనిషద్వాక్యము."

తా॥ సృష్టికిపూర్వమందు ఈజగమంతయు, పరమాత్మ మాత్రము గానేయుండెను. ఆపరమాత్మ సృష్టించెదననిసంకల్పించెను. మరియు, ఆపరమాత్మ, సంకల్పముచేత. సర్వలోకములను సృష్టించెను. ఇట్లు అద్వితీయ పరమాత్మవల్లనే సర్వజగంబు పుట్టెనని స్పష్టమవుచున్నది.

(3) జీవుడనగా, ప్రత్యగాత్మయనెడి చైతన్యము, అచైతన్యమందుకల్పింపబడిన లింగదేహము, ఆలింగదేహమందు ప్రతిబింబరూపముగానుండెడి చిదాభాసుడు–ఈమూడునుజేరి జీవుడగును. ఆనందరూపుడగు ప్రత్యగాత్మ యొక్క ప్రతిబింబము, చిదాభాసుడు.

శ్రు. చైతన్యం యదధిష్ఠానంలింగదేహశ్చయఃపునః। చిచ్ఛాయా లింగదేహస్థాతత్సంఘోజీవఉచ్యతే.॥ వే.పం.4-11

(4) మాయజడరూపమనియు, మోహనరూపమనియు, శ్రుతిచెప్పుచున్నది. అమోహనశక్తి, జీవునిమోహింపచేసి, చిదానందాది

స్వరూపజ్ఞానము లేనివానినిగా చేయుచున్నది. ఆమోహానశక్తి వలన, శరీరమే తానని తలచుచు, దుఃఖిత్వాధ్యభిమానమును జేయు చున్నాము.

(5) జీవుడుజ్ఞానకర్మముచేత సప్తాన్నములను సృష్టించెనని శ్రుతిచెప్పు చున్నది.

శ్రు. యత్సప్తాన్నాని మేధయా తపసాఽజనయత్పితా॥.
(సప్తాన్నబ్రాహ్మణము)

ఒకటి మనుష్యాన్నము, (ధాన్యాధికము); రెండు దేవాన్నము లు (అమావాస్య పూర్ణిమలు); క్షీరములు (పశ్వన్నము); మన స్సు, ఇంద్రియములు, ప్రాణవర్గము, ఇవిమూడు ఆత్మాన్నము లు; ఇవియేసప్తాన్నములు. విహితజ్ఞానము, దేవతాదిధ్యానము లు. ప్రతిషిద్ధజ్ఞానము, పరస్త్రీ, పరధనాపేక్ష; విహితకర్మము యజ్ఞాదిరూపమైనది; ప్రతిషిద్ధకర్మము, హింసాదిరూపమైనది; ఇట్లు జ్ఞానకర్మముల చేత జీవుడు ఆసప్తాన్నములను తనకు భోగ సాధనములగునట్లుగా, భోగ్యాకారత్వమును నిర్మించెను. ఈధాన్యాది జగత్తు ఈశ్వరునివల్ల బుట్టినదగుచు జీవునివల్ల భోగింపదగినదిగానున్నది.

(6) భ్రాంతి, స్వప్నము, మనోరాజ్యము, స్మృతి, ఈసమయములందు తోచెడివస్తువు మనోమయమగును. మాయావ్యాపారమే ఈశ్వర సంకల్పము; సృష్టియందే సాధనమగును. మనోవ్యాపారమే జీవునిసంకల్పము; భోగమందు సాధనమగును. భోగభేదమువల్ల, భోగ్యవస్తువునందు, కలిగెడి ఆకారభేదములు (ప్రియము, ద్వేష ము) జీవులచేత సృష్టింపబడినవి. వస్తుస్వరూపము—వస్తువ—ఈశ్వ రనిర్మితము.

(7) బుద్ధి, పదార్థములయందువ్యాపించి ప్రకాశింపజేయుటవల్ల, ఆవస్తువుయొక్క—ఆకారముగల దగుచున్నది. మనస్సుచేత, బుద్ధి

చేత, మృత్తికామయఘటముప్రకాశింపబడినట్లు, మనోమయ ఘటంబును, సాక్షిచేత ప్రకాశింపబడుచున్నది.

(8) జీవసృష్టియైన మానసప్రపంచమువలన సుఖదుఃఖములు కలుగుచున్నవి. అవి (జీవసృష్టియైన మానసప్రపంచము) సర్వ జీవులకును బంధకారియగును.

(9) యోగమునందు మనస్సును నిగ్రహించినప్పుడు, ఆక్షణమందు మాత్రమే, మానసద్వైతశాంతి కలుగును. బ్రహ్మజ్ఞానము వలననే, బంధనివృత్తి, సదా యెల్లప్పుడు కలుగుచున్నది.

శ్లో॥ బంధశ్చే న్మానసద్వైతం, తన్నిరో
ధేనశామ్యతి................ 4-38

శ్లో॥ తాత్కాలిక ద్వైతశాంతావప్యా
గామిజనిక్షయః
బ్రహ్మజ్ఞానం వినానస్యాది
తివేదాంతడిండిమః॥ 4-39

(10) ఏకాలమందు, అభ్యాసముచేత, ఆకాశమును దేహముగా ధరించి నట్లుండెదరో, ఆకాలమందు సంసారమును ఎరుగక సకల దుఃఖమును విడిచెదరని శ్రుతులు భేరీవాద్యము మ్రోగినట్లు మ్రోగుచున్నవి. గనుక, బ్రహ్మజ్ఞానమువల్లనే బంధనివృత్తియగుగాని, మనోనిగ్రహరూపయోగమువల్ల బంధము నివర్తింపదు.

శ్రు॥ జ్ఞాత్వాదేవం ముచ్యతేసర్వపా
శైః, జ్ఞాత్వా శివంశాంతిమత్యం
తమేతి యదాచర్మ వదాకాశం,
వేష్టయిష్య తి మానవాః
తదా దేవమవిజ్ఞాత్వాదుఃఖస్యాం
తోభవిష్యతి॥

(11) ఈశ్వరద్వైతమునకు (ప్రపంచమునకు) మిథ్యాభావమును నిశ్చయించి, బాహ్యప్రపంచము నివారింపబడకున్నను, బ్రహ్మవస్తువును బోధించి, బ్రహ్మజ్ఞానోదయమును పొందవచ్చును. ఈశ్వరద్వైతము, ఆకాశాదిప్రపంచము, గురుశాస్త్రాది రూపముగా, అద్వైతబ్రహ్మవిజ్ఞానమునకు, సాధనముగానున్నది.

12) జీవసృష్టియైన మానవ ప్రపంచము, శాస్త్రీయమనియు, అశాస్త్రీయమనియు, రెండువిధములుపరబ్రహ్మముయొక్క, వేదాంతశ్రవణమనన నిదిధ్యాసనమెద్దిగల్లదో, ఆశాస్త్రీయమానసద్వైతమును, బ్రహ్మ విజ్ఞానోదయ పర్యంతం గ్రహించి, పిమ్మట విడువ వచ్చును. అశాస్త్రీయ మానసద్వైతము— అనగా—కామక్రోధ, లోభ, మోహ, మదమాత్సర్య, ఈర్ష్య, దంభ, దర్ప అనూయాది దుర్గుణము లన్నియు, తీవ్రమానసద్వైతమనియు, సర్వదా స్త్రీమొదలగు విషయములను ధ్యానించుట మందమానసద్వైత మనిన్ని రెండువిధములు. వేదాంత శ్రవణాదులను జేయుటకు ప్రారంభించుటకు ముందే తీవ్ర మందములనెడి మానసద్వైతమును నివారింప జేయవలయును. సాధన చతుష్టయ సంపత్తివల్లను, ఆచార్యునియందును, వేదాంత శాస్త్రమందును ఈశ్వరుని యందుగల భక్తివల్లను, మానసద్వైతము నివారింప బడును.

(13) నిర్వికల్ప సమాధిచేత మనోరాజ్యమును జయింపవచ్చును. మనోరాజ్యము సర్వదోషములకు కారణము. సవికల్పక సమాధిచేత, నిర్వికల్పక సమాధి క్రమముగా లభించును. అష్టాంగయోగములు గలవాడు, నిర్వికల్పక సమాధిచేత, మనోరాజ్యమును నివారింప జేయగలడు. వృత్తిశూన్యముగానుండెడిమనస్సునకే పరమ పురుషార్థత్వము కలిగి యున్నదని జ్ఞానవాసిష్ఠమందు చెప్పబడినది. కామక్రోధాది వాసనలు లేనిమనస్సుయొక్క

తూష్ణీం భావముకంటె, అధికమైన పరమపదము మరియొకటి లేదని శ్రీ వసిష్ఠునిచే చెప్పబడినది.

శ్లో॥ విచారితమలం, శాస్త్రం, చిరముద్గ్రాహితంమిథః
సంత్యక్తవాసనాన్మౌనాదృతేనాస్త్యుత్తమంపదం॥ వే. పం.4.65

(14) దేహాద్యభిమానరూపమగు విక్షేపములేనిజ్ఞానిసాక్షాత్తుగా పరబ్రహ్మమేనని మహామునులు చెప్పుదురు.
శ్లో॥ విక్షేపోయస్యనాస్త్యస్య, బ్రహ్మవిత్త్వం నమన్యతే
బ్రహ్మైవాయమితిప్రాహుః, మునయః పారదర్శినః॥ 4_67
శ్లో॥ దర్శనాదర్శనేహిత్వా, స్వయంకేవలరూపతః
యస్తిష్ఠతిసతుబ్రహ్మన్, బ్రహ్మన బ్రహ్మవిత్స్వయం॥ 68

తా. ఓబ్రాహ్మణా! ఏపురుషుడు, నేను బ్రహ్మము నెరుగుదునుఁ ఎరుగననెడి, వ్యవహారద్వయమును విడిచి, తానుఅద్వితీయచైతన్యమాత్రరూపముగానుండునో, అట్టిపురుషుడు, తాను పరబ్రహ్మమే యగుగాని, బ్రహ్మవేత్తగాడని,, శ్రీవసిష్ఠమహామునిచే జెప్పబడెను.

(15) జీవమానసద్వైతమునువిడుచుటచేతజీవన్ముక్తుడగుచున్నాడు.
గనుకజీవద్వైముతను,ఈశ్వరద్వైతిమగు ఆకాశాది ప్రపంచము కంటెభిన్నముగా విభజించిచూపబడినది.
శ్లో॥ జీవన్ముక్తేః పరాకాష్ఠా,జీవద్వైతవివర్జనాత్
లభ్యతేసావతో్ౖతే దమీశద్వైతాద్వివేచితం॥ శ్లో69

ఓం తత్సత్.

— : —

# 5. మహావాక్య వివేకము :—

## ప్రసిద్ధములైన 4 మహావాక్యములు:—

(1) ప్రః॥ ప్రజ్ఞానంబ్రహ్మ
(2) ప్రః అహంబ్రహ్మాస్మి॥
(3) ప్రః॥ తత్త్వమసి।
(4) ప్రః॥ అయమాత్మాబ్రహ్మ॥.

ఈవాక్యములకు తాత్పర్యము యీపుస్తకముయొక్క ముందు భాగములోగల శ్రీమహావాక్యరత్నావళిలో చూడనగును.

ఓం తత్సత్.

—:—

# బ్రహ్మవిద్య

## 6 వ ప్రకరణము

శ్రీవేదాంత పంచదశిలోని ద్వితీయ పంచకము.

## దీపపంచకము.

### 1 చిత్రదీపము:

శ్లో. జగచ్చిత్రం స్వచైతన్యే, పటే చిత్రమివార్పితం
మాయయా; తదుపేక్ష్యైవ చైతన్యం పరిశేష్యతాం.

శ్లో. 289

తా॥ వస్త్రమందు చిత్రవర్ణము కల్పించ బడినట్లు, జ్ఞానైన పరమాత్మయందు, చిత్ర రూపమగు ప్రపంచము, మాయచేకల్పించ బడెను. ఆజగంబును ఉపేక్షించి (మిథ్యయని నిరాకరించిఅనగా వున్నట్టుగా భాసించినను విమర్శిస్తె లేకపోవడమువల్ల) పరమాత్మయే శేషింప బడుగాక. అనగా ద్వైతము నంతయుఅన్వయవ్యతిరేకముల జేత నిరాక రించగా జ్ఞానైన పరమాత్మ చైతన్యమే సత్యమై శేషించుచున్నది.

(1) అపరోక్షజ్ఞానము కలిగెడు పర్యంతము జగజ్జీవ పరమాత్మస్వరూపములను గురించి సర్వదా విచారించుచుండవలయును.

(2) పరమాత్మ చైతన్యము ఆకాశమువలె

| | | | |
|---|---|---|---|
| ప్రత్యగాత్మ, కూటస్థు, డనియు. ఘటాకాశము వలె | బ్రహ్మమనియు. మహాకాశముువలె | జీవుడనియు, జలాకాశమువలె | ఈశ్వరుడనియు, మేఘాకాశము వలె |

ట్లు నాలుగు విధములుగా వ్యవహారదశయందు దోచుచున్నది. కూటమువలె బంగారు సొమ్ములు జేయుటకు ఆధారముగ, ఇనుపముద్ద— డాగలివలె నిర్వికారముగా నుండెడి ఆత్మ చైతన్యము కూటస్థుడని చెప్పబడును.

(3) జలాకాశముచేత ఘటాకాశమంతయు తిరోధానమును బొందినట్లు జీవచైతన్యముచేత కూటస్థుడు తిరోధానమును బొందియుండుటచేత, కూటస్థుడు దోచబడలేదు. ఈ తిరోధానమే అన్యోన్యాధ్యాస. అనగా ఈ జీవుడు కూటస్థాత్మను, తనకంటె వేరుగా యెరుగడు. ఈ యెరుగమియే అనాదిగా నుండెడి అవివేకము. అవివేకమే సంసార కారణమగు అవిద్య అనగా, సంసార దశయందు జీవ కూటస్థులకు భేదమును గ్రహించ లేకపోవుటయే అవిద్య.

(4) భ్రాంతిచేత, ముత్యపు చిప్పయందు వెండివలె కూటస్థునియందు స్థూలసూక్ష్మ శరీర సహితుడగు చిదాభాసుడు కల్పించబడెను. శుక్తియందుగల నలుపు గుణము మొదలగునవి మరుగుబడినట్లు, కూటస్థునియందుగల అసంగత్వము, ఆనందస్వభావము, పరిపూర్ణత్వము మరుగుబడియున్నవి. మరియు, కూటస్థునియందుగల స్వయంశబ్దభావంబును, వస్తుభావంబును ఈ రెండును, ఆరోపించబడిన చిదాభాసునియందు దోచుచున్నవి. శుక్తియందు ఆరోపించబడిన దానికి వెండియని పేరు కలిగినట్లు, కూటస్థునియందు కల్పించబడిన చిదాభాస విక్షేపమునకు, అహం, నేను అనెడి పేరు కలిగెను. ఇటులనే, తనను స్వతః కూటస్థునే చూచుకొనుచు నేనని భ్రమచేత యభిమానింపు చున్నాడు. స్వయం శబ్దము నీవు, నేను, వాడు, వీడు మొదలగు శబ్దముల యందంతటను సమానముగా, కూటస్థునికే చెందినదైనను అన్యముగా భావించుచున్నారు. అట్లు లోక వ్యవహారమందు మాత్రమే, నని గ్రహించవలెను. పారమార్థికమందు, అన్ని శబ్దములు కూటస్థునికే సంబంధము.

(5) బుద్ధికిసాక్షియగు ఆకూటస్థుని బుద్ధిచేత, ప్రత్యక్షము జేసికొనుట అశక్యమగుటచే, జీవకూటస్థులకు భ్రాంతిచే నేకత్వమును బొందిరి.

గనుక స్థూలసూక్ష్మశరీరములతో గూడిన చిదాభాసుడు విక్షేపమనియు; స్థూల సూక్ష్మశరీరములు రెండును విక్షేప స్వరూపమనియు తెలియుచున్నది.

(6) కూటస్థజీవులయొక్క అధ్యాసవల్ల కలిగిన యేకత్వము, భ్రాంతివల్ల నని, అనగా అవిద్యవల్లనని శ్రుతితాత్పర్య విచారణము లేమిచేత విభాగంచేయలేక తెలిసికొనలేదు.

(7) ఆనందమయకోశము ఆత్మయగునని వైదికసిద్ధాంతము.
శ్రు॥ తస్మాద్వాఏతస్మాద్వి జ్ఞానమయాదన్యోంతర ఆత్మానందమయః॥

ఆత్మ ఆకాశమువలె సర్వగతుడనియు, నిత్యుడనియు, నిష్కలుడనియు నిష్క్రియుడనియు, శ్రుతిజెప్పుచున్నది. శ్రు॥ ఆకాశవత్సర్వగతశ్చనిత్యః నిష్కలం నిష్క్రియం॥.

(8) అంతర్యామిని మొదలుకొని వృక్షాదిపర్యంతముగల భూతములను ఈశ్వరునిగా జెప్పెడి, మతములు అనేకములున్నవి. న్యాయవిచారణచేతను, వేదాంతశాస్త్రవిచారణవలనను ఈశ్వర విషయమైన ప్రతిపత్తి యొక్కటియేనని తెలియగలదు. అదియెట్లనగా:—

శ్లో॥ మాయాంతు ప్రకృతింవిద్యాన్మాయినంతుమహేశ్వరం
అస్యావయవభూతైస్తువ్యాప్తం సర్వమిదంజగత్ ॥ శ్లో॥ ॥12

తా. మాయనే జగదుపాదాన కారణభూతమగు ప్రకృతినిగా తెలియవలెను. మాయోపాధికుడగు అంతర్యామినే, మాయాధిష్ఠానకునిగా, అనగా నిమిత్తకారణునిగా తెలియవలెను. ఈ యంత

ర్యామి యొక్క అంశరూపులగు చరాచరాత్మకజీవులచేత ఈసకలమగు ప్రపంచము వ్యాపించబడెను.
అనగా ఈ శ్రుతి ప్రకారము సర్వము ఈశ్వరభావమేయగుట చేత లోకమందుగల ఏమతస్థునకు విరోధములేదు.

(9) కూటస్థస్వభావముచేత నిస్సంగుడైన ప్రత్యగాత్మను, మాయ జగద్రూపము గలవానినిగా జేయుచున్నది.
ఆమాయచిదాభాస స్వరూపముచేతజీవేశ్వరుల నిద్దరినిసృష్టించినది. శ్రు॥ జీవేశావాభాసేనకరోతి॥

ఈజగంబు, పుట్టినవిధమునునిర్ణయించుటకు శక్యముగాక, మహాత్ములగుమునులు, ఈజగంబంతయు, ఇంద్రజాలంబువలె, మాయామయమని, జెప్పిరి. మనస్సుచే నైనను చింతింపదగని కల్పనాస్వరూపముగలదని చెప్పిరి.

(10) మాయాప్రతిబింబరూపుడగు చిదాభాసుడే ఈశ్వరుడు, అనగా నియామకుడు, అని శ్రుతిచెప్పుచున్నది. ఆచిదాభాసుడే అంతర్యామియనియు, సర్వమును తెలిసిన వాడనియు, ప్రపంచమునకు కారణుడనియు, శ్రుతియందువినబడు చున్నాడు.

శ్లో॥ మాయాధీనశ్చిదాభాసః శ్రుతో మాయీమహేశ్వరః
అంతర్యామీచ సర్వజ్ఞో జగద్యోనిస్సఏవహి॥ శ్లో॥ 157

(11) ఆనందమయకోశము జాగ్రత్స్వప్నాది రూపప్రపంచమును సృష్టించుచున్నది. ఆజగంబును మరియొకవిధముగా మార్పు చేయుటకు ఎవరుసమర్థుడుకాడు. అందువలన ఈఆనందమయకోశముసర్వేశ్వరుడని చెప్పబడును. శ్లో॥158
సర్వబుద్ధివాసనావంతమగు అజ్ఞానోపాధికత్వముచేత, ఈఆనందమయకోశముసర్వజ్ఞుడని చెప్పబడును. ఈశ్వరుడువిజ్ఞానమయము మొదలగుకోశములయందును, పృథివ్యాది సర్వభూతములయందును, లోపలనున్నవాడగుచు, ప్రేరేపణము

జేయుచు అంతర్యామియని శ్రుతిచేచెప్పబడుచున్నాడు. అనగా సర్వజగంబునకు ఉపాదానకారణరూపముగా వుండుటవల్ల అంతటను,స్థితిని బొందియున్నాడు. అంతర్యామి సర్వాంతరుడగుటవల్ల, కనబడడు.

శ్రు॥ యస్సర్వేషు భూతేషుతిష్ఠన్॥

శ్రు॥ యస్సర్వాణి భూతాన్యంతరోయమయతి॥

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢానిమాయయా॥
గీతాశాస్త్రము.

సర్వభూతములనగా — విజ్ఞానమయకోశరూపులగు జీవులు.

యంత్రారూఢాని — పంజరరూపముగా నుండెడి దేహేంద్రియాదిక మందుగల అభిమానిత్వమగును. ధర్మాధర్మముల యందు బ్రవర్తించుటయే భ్రమణమగును. ఈశ్వరుడుతనశక్తిచేత విజ్ఞానమయాకారముగా, ఆవిజ్ఞానమయుల ప్రవర్తనస్వరూపమువల్ల పరిణమించుచున్నాడు. ఇవియే మాయచేత భ్రమింపజేయుటయగును. ప్రవృత్తిజాతమంతయు ఈశ్వరాధీనము. సర్వముఈశ్వరాధీనము. పరమాత్మ సాక్షిస్వరూపుడు (బుద్ధియందుండెడి ఒకానొక దేవునిచేత ఏప్రకారముగా నియమింపంబడుదునో ఆప్రకారముధర్మాధర్మములం జేయుచుందును)

(12) పురుషప్రయత్నము వ్యర్థమా? — ఏకారణముచేత ఆయీశ్వరుడు పురుషప్రయత్న స్వరూపముగాప్రవర్తించుచున్నాడో ఆకారణముచేత పురుషప్రయత్నము వలనప్రయోజనము లేదని శంకింపరాదు.

శ్లో॥ నార్థఃపురుష కారేణేత్యే.వంమా శంక్యతాంయతః।
ఈశఃపురుష కారస్వరూపే ణాపివివర్తతే ॥ శ్లో. 177

ఈశ్వరుడు పురుషప్రయత్నస్వరూపముగా ప్రవర్తించుచున్నా డను జ్ఞానంబుగలిగి మెదలకుండాకూర్చున్నను అంతర్యామిప్రేరే పణమునివారింపబడదు. అనగా పురుషప్రయత్నరూపంగాప్రేరే పిస్తూవుంటాడు. అట్టి యీశ్వరజ్ఞానముచేత అనగా సర్వసృష్టి మాయయగుటచేత స్వస్వరూప భూతుడగుప్రత్యగాత్మ అసంగు డనెడి జ్ఞానముగలుగుచున్నది. అట్టిజ్ఞానముచేతనే ముక్తిగలుగు చున్నదని శ్రుతిస్మృతులు జెప్పుచున్నవి. శ్రుతిస్మృతులురెండును నాయొక్క ఆజ్ఞలగునని ఈశ్వరుడే గీతాశాస్త్రమునందు చెప్పెను.
శ్లో॥ శ్రుతి స్మృతీ మమై వాజ్ఞే ఇత్యపీశ్వరభాషితం॥.
ఈశ్వరుడొక్కడే ప్రకృతిప్రాధాన్యతచేత అచేతనములకు ఉపా దానకారణమాయెను; చిదాభాసరూపముచేత జీవులకుగారణ మాయెను.

షడ్విధలింగములచేత, ఉపనిషత్తులకు దాత్పర్యనిర్ణయముచేయ గా, బ్రహ్మముఅసంగమనియు మాయికుడైన ఈశ్వరుడు జగ త్తునుసృష్టించుచున్నాడనియు దెలియును.

(13) హిరణ్యగర్భుడు, సూత్రాత్ముడనియు సూక్ష్మదేహుడనియు ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తిమంతుడు, సర్వసృష్టిలింగశరీరములయం దు నేనని యభిమానించుచు సర్వలింగ శరీరోపాధికులగుజీ వులయొక్క సమష్టిస్వరూపుడగును.

శ్లో॥ సూత్రాత్మాసూక్ష్మదేహాఖ్య స్సర్వజీవఘనాత్మకః। సర్వా హం మానధారి త్వాత్క్రియా జ్ఞానాది శక్తిమాన్॥.

హిరణ్యగర్భావస్థయందు అపంచీ, కృత,పంచభూత కార్యముల చేప్రపంచము స్పష్టత్వమును బొందక కనబడుచుండును.
పంచీకృతకార్యోపాధికుడగు విరాట్పురుషుడువిశ్వరూపముచేత స్పష్టముగాదోచును.

బ్రహ్మదేవుడు మొదలుకొని స్తంభపర్యంతముగలజగంబంతయు ఆవిరాట్టుయొక్క స్వరూపముగా జెప్పబడెను. సర్వము ఈశ్వర రూపమేననియు, అయావస్తువుకు ప్రత్యేకముగా పూజించెడివారికి, ఆయావస్తువేఫలమునిచ్చును. పూజింపబడెడి దేవతాదిరూపముయొక్కయు, పూజయొక్కయు, పూజకునియొక్కయు, సాత్వికాది గుణభేదములచేత ఫలభేదముకలుగుచున్నది. ఈశ్వరోపాసనముచేత సాంసారిక ఫలము సిద్ధించును. బ్రహ్మస్వరూపజ్ఞానము చేతనే, సంసారంబు నివర్తించును. అనగా ముక్తి కలుగును.

(14) ఈశ్వరజీవాదిరూపమైన ఈశ్వరప్రపంచము, అద్వితీయ బ్రహ్మస్వరూపమందుస్వప్నతుల్యముగా నున్నదని శ్రుతిజెప్పుచున్నది. శ్రుతిసిద్ధతత్వజ్ఞానము లేనందున అసంగ నిర్గుణబ్రహ్మస్వరూపము నెరుంగలేక, జీవేశ్వరుల స్వరూపవిషయమై, కొంతమందికలహించుచున్నారు, కొంతమందిఈశ్వరునివిషయమై; కొంతమందిజీవునివిషయమై జీవేశ్వరవాదములయందే బుద్ధినిసర్వదావుంచకూడదు. శ్రుత్యర్థమును విచారించి, నిర్గుణపరబ్రహ్మస్వరూపమును తెలుసుకొనవలెను.

(15) ఆత్మభేదంబును, జగత్సత్యంబును, ఈశ్వరుడు తటస్థుడేగాని ప్రకృతికంటెఅన్యుడు అనుమూడు అంశములవల్లను, సాంఖ్య, యోగమతములకు, వేదాంతసమ్మతములేదు.

శ్లో॥ ఆత్మభేదోజగత్సత్యమీశోన్యఇతిచేత్త్రియంత్యజ్యతేతైస్త దాసాంఖ్య యోగవేదాంత సమ్మతిః। శ్లో॥ 228.

(16) ఆత్మఅద్వితీయుడైనను, అట్టిఆత్మ యందు బంధమోక్షావస్థలనుకల్పించుటకు మాయకుశక్తి కలదు. అసంగుడైన ఆత్మనుఅవస్థావంతునిగా భ్రమింపజేసిజ్ఞానము చేతనివర్తింపబడినదియేఅవిద్య మిథ్యారూపమగు అవిద్యయొక్క కార్యములగు ఏయవస్థలతోటియు ఆత్మకు సంబంధములేదు.

శ్లో. దుర్ఘటం ఘటయామీతివిరుద్ధం కింనపశ్యసి వాస్తవౌబంధమోక్షౌతు శ్రుతిర్నసహతేతరాం॥. శ్లో. 234

(17) తత్వజ్ఞానులలో, కొందరికి వ్యవహారముకలిగియున్నను, అవివేకదశయందువలె, భ్రాంతికలిగియుండరు.

(18) ద్వైతము మిథ్యయని మరల మరల విచారణ చేత పరిశీలింపు చుండుము. అద్వైత నిశ్చయ జ్ఞానము కలిగెడి కొరకువేదాంతార్థశ్రవణ మననాదులను మాటిమాటికి చేయుమని బ్రహ్మసూత్రములయందు, వ్యాసునిచే జెప్పబడెను. సూ॥ ఆవృత్తిరసకృదుపదేశాత్॥

(19) ఆకలిదప్పులు, అసంగుడైనకూటస్థునియందు లేవనియు: నేననెడి జీవాత్మయందు—అహంకారమందు కనబడుచున్నవనియు చింతించవలెను.

అధ్యాసనివృత్తికొరకు, కూటస్థాత్మ, చిదాభాసదేహేంద్రియాదులకంటె, నన్యుడనెడి జ్ఞానాభ్యాసమును సర్వదా చేయుచుండవలెను.

అధ్యాసమునునివర్తింపజేయుటకు వివేకజ్ఞానముదప్ప మరియొక ఉపాయములేదు.

ద్వైతమిథ్యాభావమునకు అనుభవమేసాక్షి.

జాగ్రదాది ద్వైతము, సుషుప్తియందు లేనట్లు సాక్షియగుచిత్తుచేతననుభవింపబడుచున్నది. శ్రు॥ తమసస్సాక్షీసర్వస్యసాక్షీ॥. చిత్తు, ఈపూర్వము, స్వప్రకాశత్వముచేత, ప్రకాశించుచుండుటవల్లను ద్వైతముయొక్క మిథ్యాభావము, ఆచిత్తు చేతనే అనుభవింప బడుచుండుట చేతను; చిత్తు సత్యమనియు, అపరోక్షముగా ప్రకాశించు చున్నదనియు, అద్వైతము ప్రత్యక్షము చేత ప్రకాశించు చున్నదనియు, స్పష్టమవును.

(20) అధ్యాస మూలముగల కామమే విడువదగినది. అహంకారమును బుద్ధిచేత భిన్నముగా జూచుచు కోటివస్తువులు కోరినను బాధలేదు.

(21) జ్ఞాని సంసార సంగమునకు భయపడి ఉదాసీనత్వమును బొందును. కార్యములయందు ప్రవర్తనము వుండదని బోధింపబడలేదు.

(22) వైరాగ్య బోధోపరతులు మూడును ఒక్క-పురుషుని యందున్నయడల అది పూర్వజన్మముల పుణ్యరాశి ఫలమువును. ప్రతిబంధక పాపమువల్ల ఇవిఅన్నిగాని కొన్నిగానిఒకపురుషునియందు లేకపోవచ్చును. బోధ- తత్వజ్ఞానము లేనియెడల మోక్షముకలుగదు. వైరాగ్యో పరతులను కలిగియుండుటవల్ల- అవితపంబగుటచేత పుణ్యలోకప్రాప్తి కలుగును. శ్లో. ప్రాప్యపుణ్యకృతాం... ... ... ... ...

జ్ఞానముచేత మోక్షము కలిగినను వైరాగ్యోపరతులులేనియెడల జీవించియుండగాముక్తి సుఖములభింపదు. బ్రహ్మలోకమును గడ్డిపరకను వలెవిడచుటయే, వైరాగ్యమునకు అవధి; దేహామే నేననెడి జ్ఞానమువలె, నేను పరమాత్మననెడిదృఢజ్ఞానముగలుగుట, బోధకు, పరిపూర్ణత్వము-అనగా అవధి. సుషుప్తియందువలె సర్వవ్యవహారసంక్షయమును బొంది యుండుట ఉపరతికి అవధి. ప్రారబ్ధకర్మవల్ల, జ్ఞానులకునున్నప్రవర్తనము నానావిధముగానుండును. అదిముక్తికి ప్రతిబంధకముకాదు.

జ్ఞానులు తమతమప్రారబ్ధకర్మమునమసరించి, వ్యవహారవంతులైయున్నను, నేను బ్రహ్మమునైతిననెడియాకారముగలజ్ఞానము అందరికి ఏకాకారముగానున్నది. బ్రహ్మస్వరూపముగానుండెడిముక్తియు, అందరికిని సమానముగానున్నది. ఇదియే అద్వైతసిద్ధాంతమగును.

శ్లో॥ స్వస్వకర్మానుసారేణవర్తంతాం తేయథాయథా
అవిశిష్టస్సర్వబోధస్సమామ్ముక్తిరితిస్థితిః.॥ శ్లో॥ 288

ఇంతత్పత్

---

## 2. తృప్తిదీపము

(1) ఓం. శ్లో॥ ఆత్మానంచే ద్విజానీయాదయమస్మీతిపూరుషః
కిమిచ్ఛన్ కస్యకామాయశరీరమనుసంజ్వరేత్॥ శ్లో॥ 1

టీ. పురుషుడు, ఈస్వయంప్రభానందరూపపరమాత్మ, నేనైతినని, తనను, ఎరిగినయెడల, ఏఫలమునిచ్ఛయించినవాడగుచు, ఏభోక్తయొక్క ప్రీతికొరకు, శరీరము (తపించుచుండగా) తపించునో అనగా, పరమార్థమందు భోక్తృ భోగ్యరూపమగు మాయా, కల్పితమైన ద్వైతముదోషముచేత తపించదనుట,

(2) పురుషుడు: అస్మి;

బుద్ధ్యాదులన్నియు గల్పించబడుటకు, ఆధారమైనకూటస్థ చైతన్యమే, బుద్ధియందుప్రతిబింబించుటచేత, జీవభావమునుబొందినదగుచు, ఈశ్రుతియందు పురుషశబ్దముచేత చెప్పబడుచున్నది. అట్టికూటస్థునితోగూడిన చిదాభాసుడే, మోక్షస్వర్గాదిసాధనానుష్ఠానమందు అధికారియగుచున్నాడు. కేవల చిదాభాసుడు అధికారియగుటలేదు. అధిష్ఠానభూతుడైన కూటస్థునివిడచి, కేవలచిదాభాసుడుండడు.

(3) ప్రతిబింబరూపుడగు చిదాభాసుడు కల్పితుడు; ఆ చిదాభాసునకు సంసారమోక్షాదిసిద్ధిగలిగెడికొరకు, కూటస్థ చైతన్యము గూడగ్రహింపవగును. చిదాభాసునకునిజస్వరూపముకూటస్థుడు. కూటస్థసహితుడైన, చిదాభాసుడు తానుమిథ్యారూపుడనినిన్ని, తనకుకూటస్థునకు భేదముగలదనినిన్ని, తానునిజముగా కూటస్థుడైన

టులనున్ను, యెరుగుటకు, కూటస్థసహిత చిదాభాసునకు సమర్థతగలదని, పైశ్రుతివలన వినబడుచున్నది.

(4) అయం = ఈ స్వప్రభానంద రూపపరమాత్మ ఈ పరమాత్మ నైతిని అనెడి యర్థమందు అయంశబ్దము ప్రయోగింప బడినది. కూటస్థ చైతన్యము సర్వదా స్వయముగా ప్రకాశించుచు నిత్య అపరోక్ష రూపముగా నుండుటచేత ఈపరమాత్మ యనెడి అర్థము స్ఫురించెడి అయం శబ్దము శ్రుతియందు ప్రయోగింప బడినది.

(5) ఆత్మనిత్య అపరోక్ష రూపుడైనను పరోక్షా పరోక్షవిషయత్వంబును, జ్ఞానాజ్ఞాన విషయత్వంబును, ఈరెండును పదియవ వాని యందున్నట్లు ఈసర్వము ఆత్మయందు సంభవింపగలదు.

దశమునికథ.

10మంది వకనదినిదాటి, అంతా వడ్డునచేరి లెఖ్ఖచూచుకొను టలో లెఖ్ఖ పెట్టువాడు తనను మినహాయించుకొని లెఖ్ఖ చూచి వకడు రాలేదని లేడని యేడ్చి తలబద్దలుకొట్టుకొనగా, దారివెంట వెళ్ళేవకడు 10వవాడు చావలేదు వున్నాడని చెప్పగా, దుఃఖము శాంతించుకొని తనతోకూడ తిరిగి లెఖ పెట్టుకొనగా 10మంది వున్నారని ప్రత్యక్షముగా తెలుసుకొని తృప్తిపొందెను.

ఇట్లు దశమునియందు

అజ్ఞానము;— నేను పదియవ వాడనని యెరుగమియే, అజ్ఞానము.

ఆవరణము;— 10వవాడు లేడు. తోచలేదు అని తెలిసి చెప్పుటకు కారణముయేదో అది అజ్ఞాన కార్యమగు ఆవరణము.

విక్షేపము:— 10వవాడు నదిలో జచ్చెనని యేడ్చి తలబాదుకుని గాయము కలిగించు కొనుట.

పరోక్షజ్ఞానము;— పరోక్షత్వము చేత స్వర్గాది లోకమున్నట్లు తెలుసుకున్నట్లు ఒకస్నేహితుడు చెప్పుటవల్ల దశముడు వున్నాడని తెలుసుకుని ఆవరణాంశమును నివర్తించు కొనుచున్నాడు.

అపరోక్ష జ్ఞానముచేత 10వ వాడైన తననుతాను తెలుసుకుని దుఃఖమును విడచి సంతోషించును.

దుఃఖనివృత్తినిపొందుట:— ఒకఅవస్థ

తృప్తి:— ఆనందప్రాప్తినిపొందును.

(6) స్వప్రకాశ, కూటస్థాత్మ యెరుగమియే అజ్ఞానము; కూటస్థుడు లేడు. తోచలేదుఅని, చిదాభాసుడు తెలిసిచెప్పుచున్నాడు ఇదియే అజ్ఞానకార్యమగు ఆవరణద్వయము; తనకర్తృత్వభోక్తృత్వాదులను కూటస్థాత్మయందు ఆరోపించుటవిక్షేపము. అనగాస్థూల, సూక్ష్మదేహములతో గూడినచిదాభాసుడు,విక్షేపము; గురునివలన కూటస్థుడొకడు గలడని యెరుగుటపరోక్ష జ్ఞానము; ఆకూటస్థుడే నేనైతినని ప్రత్యక్షముగా, నెరుగుటయపరోక్ష జ్ఞానము; అపరోక్షజ్ఞానమువలన, కర్తృత్వ భోక్తృత్వరూపదుఃఖరాశినంతయు విడుచుచున్నాడు. నేనుచేయదగినదంతయు, పొందదగినఫలము పొందబడెనని సంతోషించి తృప్తిపొందుచున్నాడు. ఇట్లు సప్తావస్థలున్నూ, చిదాభాసునికే కలిగియున్నవి. కూటస్థునకుకాదు. కూటస్థునియందే కల్పించబడినవి. కూటస్థునిఅవస్థలుకావు. కూటస్థుడు అసంగుడు. అజ్ఞాన, ఆవరణ, విక్షేపములనెడి మూడవస్థలవల్లను, జీవునకు బంధము కలుగుచున్నది. కర్తృత్వ, భోక్తృత్వ, ప్రమాతృత్వరూపసకల దుఃఖమును, విక్షేపరూపుడగు చిదాభాసునియొక్క కార్యమగును.

(7) శ్లో. ఆత్మానంచే......... శరీర మనుసంజ్వరేత్.

అనెడి మంత్రము, అపరోక్షజ్ఞాన, దుఃఖనివృత్తులనెడి రెండవస్థ లంజెప్పుచున్నది. చిద్రూపుడగు ఆత్మ స్వప్రకాశత్వమువల్ల(అహం), నేనని, స్ఫురించుచుండుటచేత, అపరోక్షజ్ఞాన విషయుడగును. మరియుబుద్ధిచేత, ఆయాత్మనుస్వప్రకాశునిగా జూచుటవల్ల, ఆయాత్మపరోక్ష జ్ఞానవిషయుడగును.

శ్రు॥ సదేవసోమ్యే దమగ్ర ఆసీ దేకమేవాద్వితీయం.

ఇత్యాది శ్రుతులవలన, బ్రహ్మముకలదని పరోక్షముగానిశ్చయించి; ఆబ్రహ్మమునకు ప్రత్యగాత్మ రూపమును భావించి, ఆపరబ్రహ్మ మునేనైతినని చెప్పెడి శ్రు॥ తత్త్వమస్యాది మహావాక్యములచేత, అద్వితీయ బ్రహ్మరూపుడగు తనను, నేను బ్రహ్మమునైతినని, అపరోక్షముగా సాక్షాత్కరించు కొనుచున్నాడు. జీవునకు విదేహముక్తి కలిగెడి పర్యంతము, అంతః కరణోపాధి నివర్తింపదు; అందుచేతజ్ఞానమునకువిషయమగుబ్రహ్మంబును, ఉపాధిసహితముగానున్నదని అంగీకరించ వలెను.

(8) అనాత్మకు, బుద్ధివృత్తిచేతను ఫలముచేతను వ్యాప్తి కలదు. ప్రత్యగాత్మస్వయంప్రకాశుడవుటచే, ఫలముయొక్క వ్యాప్యత్వము, ప్రత్యగాత్మకులేదు. బుద్ధివృత్తియందు ప్రతిబింబింపబడిన చిదాభాసుడు, ఫలమని చెప్ప బడును. ఘటముజడత్వము చేత స్వతః స్ఫురింప జాలమి వల్ల, చిదాభాసునివలన స్ఫురించును. బుద్ధి వృత్తియు చిదాభాసుడును ఘటమునువ్యాపించియుండును. బుద్ధియందుదానివృత్తులయందు, చిదాభాసుడున్నను, బ్రహ్మముకంటె భిన్నము గాప్రకాశింపదు. చీకటిలో వున్నవస్తువునుగ్రహించుటకు, నేత్రము, దీపము, కావలెను; దీపమునుచూచుటకు, వకనేత్రమేచాలును.

(9) నియమములు, జపములు, మంత్రములు, పరలోకహేతువులు స్వరవర్ణవిపర్యయముగా మంత్రమును జపించినయడల కీడుకలుగును. బ్రహ్మాభ్యాసవిషయమైనియమము లేదు. ప్రత్యగాత్మ

దేహముకంటె పరుడనేడి బ్రహ్మ ధ్యానమందు ధ్యానమందు గల చిత్తైకాగ్ర్యరూప నిర్బంధమువంటి నిర్బంధము లేదు. ధ్యానమందు చంచల స్వభావముగల మనస్సునకు మిక్కిలి నిర్బంధము కలిగియుండును.

బ్రహ్మ ధ్యానమందు బుద్ధికి వినోదముగా నుండును. 123
విపరీత భావనను గలిగించెడి (అనగా మరపును గలిగించెడి అనగా నేను బ్రహ్మమును ననెడి జ్ఞప్తిగలుగుటవల్ల నేను మనుష్యుడనని విక్షేపమును కలిగించే) వ్యవహారములు జ్ఞానమునకు విరోధములే యగును. శ్లో॥ జనకాదేః కధంరాజ్యమితి చేద్దృఢబోధతః। తథా తవాపి చేత్ తర్కంప కురుద్వా కృషింకురు. 130

తా॥ జనకాది జ్ఞానివర్గమునకు రాజ్య పరిపాలనాది లౌకిక వ్యవహార ప్రవర్తనము, ఎట్లు కలిగెనని యంటివేని నిశ్చలమైన అపరోక్ష జ్ఞానమువలన కలిగియుండుట వల్లనని తెలిసికొనుము. నీకును ఆప్రకారము నిశ్చలా పరోక్షజ్ఞానము కలిగి యున్నయెడల తర్కమును చదువుము లేక కృషిని చేయుము.
అనగా ధృఢ అపరోక్ష జ్ఞానము కలిగినపిమ్మట ఎట్లు ప్రవర్తించినను బాధలేదు.

(10) ప్రారబ్ధకర్మము అవశ్యము ఫలమిచ్చునదగుటవలన, జ్ఞానులకు సహితము సంసారమందు ప్రవర్తనముకలుగుచున్నది. అయితే, అజ్ఞానివలె, జ్ఞానిదుఃఖమును బొందడు.

శ్లో॥ మిధ్యాత్వ వాసనాదార్ఢ్యే ప్రారబ్ధక్షయ కాంక్షయా
అక్లిశ్యంతః ప్రవర్తంతే స్వస్వకర్మానుసారతః॥ శ్లో॥131

గనుక జ్ఞానులకు అతిప్రసంగము గలుగునని శంకింపరాదు. ప్రసంగమనగా విధినిషేధరూపశాస్త్రము — దానినతిక్రమించి ప్రవర్తించుటయే అతిప్రసంగము. పరమార్థమందు భోక్తృభోగ్య రూపద్వైతము లేమిచేత, అపరోక్షజ్ఞానవంతుడు, తపించడు.

జ్ఞానికివిషయభోగేచ్ఛ గలిగినను ప్రీతిపూర్వకముగా భోగముల నను భవింపడు. సంసారమందు ఆసక్తిలేకుండా! ప్రారబ్ధక్షయము కొరకు పరితపించుచుండును. అదిసంసారసంబంధదుఃఖముకానే రదు.

(11) జీవులకుసుఖదుఃఖములనిచ్చుటయే, ప్రారబ్ధకర్మమునకుస్వభావ ముగానున్నది. భోగ్యమగు ప్రపంచవస్తువునకు సత్యత్వమును సంపాదించెడి స్వభావములేదు.

(12) వివేకజ్ఞానమునకే విద్యాస్వభావమును జెప్పవలయునుగాని, ద్వైతముతో పమికి విద్యాభావమును జెప్పరాదు,

(13) జగన్మిధ్యాత్వ బోధచేత వాస్తవకామ్యములేదని, శ్రుతి చేత, ఏమిఫలము ఇచ్ఛయించు యర్థముగల శ్రు॥ కిమిచ్ఛన్॥ అనెడివాక్యమువలె, ఆత్మయొక్క అసంగత్వబోధచేత, వాస్త వమగు భోక్తృత్వము ఆత్మకు లేదనెడివివక్షవల్ల ఏభోక్త యొక్క ప్రీతికొరకనెడి యర్థముగల శ్రు॥ కస్యకామాయ॥ అనెడి వాక్యము శ్రుతిచేత చెప్పబడెను.

(14) కేవలకూటస్థుడు భోక్తకాడు, కేవల చిదాభాసుడు భోక్తకాడు. కూటస్థుడు అసంగత్వముచేత నిర్వికారుడగుట వలన, భోక్తృత్వ మును బొందడు. ఆధారభూతుడగుకూటస్థునివిడచిస్వాతంత్ర్య స్థితి సంభవింపమివలన కేవలచిదాభాసునకును భోక్తృత్వముసం భవింపదు. కూటస్థసహిత చిదాభాసరూపుడగు భోక్తమిధ్యా రూపు డనియు, పారమార్థికుడగుఅసంగకూటస్థునకుభోక్తృత్వ ములేదనియు, యుక్తి శ్రుతులచేత, దెలియుచున్నది.

శ్రు॥ అసంగోహ్యయంపురుషః॥

(15) భోక్తయందు సత్యత్వబుద్ధి కలుగుటకుఅజ్ఞానమేకారణమగును కూటస్థునికంటెనన్యుడనెడివిభజనలక్షణజ్ఞానములోకప్రసిద్ధుడగు భోక్తఅయినతనను లేమిచేత, కూటస్థుని యందుగలసత్యత్వము

నుతనయందారోపించుకుని తద్ద్వారా తనయందుగలభోక్తృత్వమునుసత్యముగాదలచిభోగమునెప్పటికినివిడుచుటకుసమ్మతింపడు. భోగ్యములయందు ప్రేమనువిడువవలయును; ఆత్మయందే ప్రేమచేయదగినది; అందుకుగాను ఈశ్వరునియందుప్రార్థనపూర్వకముగా ప్రేమచూపవలెను.

మనస్సువిషయాసక్తినివిడచిఈశ్వరునియందేసర్వదాస్థితినిబొంది యుండవలెను,

ముముక్షువుఆత్మను సర్వదా విచారించవలెను. శ్రద్ధాపూర్వకముగాజపయజ్ఞోపాసనాదికములుజేసినట్లు మోక్షేచ్ఛచేత శ్రుతిప్రోక్తమగు, ఆత్మయగుతనయందువిశ్వాసము గలిగియుండవలెను; ఆత్మయగుతనను, దేహాదులవల్లవిభజించి యెరుగవలయును; అట్లుచేయుటవలనజాగ్రదాదియవస్థలయందు సాక్షికిఅసంగత్వము నిశ్చయింపబడుచున్నది; సర్వావస్థలయందును, ఆత్మ స్వాభావికముగా వర్తించుచున్నాడని, ముముక్షువు తెలుసుకొనును. పుణ్యఫలమగు సుఖంబును, పాపఫలమగు దుఃఖమును స్వీకరించకనే, అన్నిఅవస్థలయందు సాక్షిస్వరూపుడుగా యున్నాడని తెయిసుకొనును; ఈ ప్రకారము వివేకజ్ఞానముచేత అవస్థాత్రయమువల్ల విభజించి యెరిగిన ఆత్మకు పునర్జన్మము లేదు: జాగ్రదాదియవస్థలయందుగల, భోక్త, భోగ్యములకు, విలక్షణుడై సాక్షిరూపముగా, నిరతిశయానందరూపత్వముచేత సర్వదా శోభాయమానుడగు, పరమాత్మ నే నైతినని, ముముక్షువు నిశ్చయించుకొనవలయును; పరమాత్మస్వరూపము, బుద్ధిచేత, ఇట్లువిభజింపబడగా, చిదాభాసునికే, భోక్తృత్వము గలిగియున్నదని తెలుసుకొనవలెను; అదియేమిథ్య; ఈచిదాభాసుడు జగత్తులో నిమిడిపడియుండుటచేత మిథ్యారూపుడు; చిదాభాసుడు, మాయకుడెప్పుడగునో, తనరూపము మాయయని, కూటస్థునికంటె విభజించి, తెలుసుకొనుచున్నాడు; మిథ్యారూ

పుడగుటచేత, తనకునాశనమును, నిశ్చయించి భోగముకోరడు; తనప్రారబ్ధకర్మక్షయించలేదని, దుఃఖముల ననుభవించ వలశిన విధియని, జ్ఞానముచే తెలుసుకొనును; తనభోక్తృత్వ మును కూటస్థునియందు ఆరోపించడు; శ్రు॥ కస్యకామాయ, అనెడి శ్రుతివాక్యమువలన, పరమార్థమందు భోక్తలేడని॥ నిశ్చయించును.

వాస్థవమందు భోక్తలేమిచేత, నిశ్చలమైన అపరోక్షజ్ఞానికి దేహ సంబంధదుఃఖము లేనే లేదు.

(16) స్థూలసూక్ష్మకారణశరీరములయందు, ప్రత్యేక, ప్రత్యేక, జ్వరముగలదు—అనగా దుఃఖము. దుఃఖహేతుత్వము.

స్థూల దేహమందుగల జ్వరము:—

శ్లో. వాతపిత్తశ్లేష్మ జన్యవ్యాధయఃకోటిశస్తనాః।
దుర్గంధిత్వకురూపత్వదాహాభం గాదయ స్తథా॥. శ్లో. 22

శ్రు॥ బ్రాహ్మణ్యం, కులగోత్రేచ, నామసౌందర్యజాతయఃస్థూల దేహగతాఏతే.॥

సూక్ష్మదేహమందు గలజ్వరము:—

శ్రు॥ క్షుత్పిపాసాంధ్యబాధిర్య, కామక్రోధాద్యఖిలాః, లింగ దేహగతా, ఏతే.॥

శ్లో. కామక్రోధాదయశ్శాంతి దాంత్యాద్యాలింగ దేహగాః।.

కారణశరీరమందుగల జ్వరము:—

శ్లో॥ స్వంపరంచనవేత్త్యాత్మావినష్టఇవకారణే
ఆగామిదుఃఖబీజం చేత్యేతదింద్రేణదర్శితం.॥ శ్లో 226

తా॥ పురుషుడు సుషుప్తవస్థను పొందుచుండగా, కారణశరీరమందు ఆపురుషునకు, ఇది నేననునట్టియు వీడు పరుడనునట్టి జ్ఞానము లేద వియు, అజ్ఞానముచే నశించిన వానివలె నున్నాడనియు, ఈకా రణశరీరము రేపు గలుగదగిన దుఃఖములకు బీజభూతములైన

వాసనలం గలిగి యున్నదనియు, శిష్యుడైన దేవేంద్రునిచేత, గురువైన బ్రహ్మదేవుని యెదుట నివేదింప బడినట్లు, ఛాందోగ్య శ్రుతివాక్యము గలదు. కనుక, స్వపరజ్ఞాన శూన్యత్వముస్థి అజ్ఞానముచే నష్టప్రాయత్వము, ఆగామిదుఃఖ బీజవాసనా, తియు, కారణ శరీరమందు గల జ్వరములు.

ఈ జ్వరములు—దుఃఖ హేతువులు, శరీరముతో గూడబుట్టిన వగుటచేత, స్వాభావికములని చెప్పబడినవి. జ్వరముల వలన దేహము వియోగమును బొందినయడల ఆ దేహమే యుండదు. మృత్తికవలన ఘటము వియోగమును బొందినయడల, ఆఘట రూపమే లేనట్లు.

(17) కూటస్థాత్మకు స్వప్రకాశత్వమే ముఖ్య స్వభావముగా విద్వాంసులకు అనుభవ సిద్ధముగా నున్నది. ఇతరస్వభావమున్నట్లు అనుభవము లేదు. కూటస్థాత్మయొక్క ప్రతిబింబ రూపుడగు చిదాభాసునకున్నూ అటువంటి స్వభావము గలదనే గ్రహించవలెను. అయితే చిదాభాసుడు, తనయందు జ్వరము లేనివాడైనను,

అవిద్యచేత, శరీరత్రయమును, తనయొక్క వాస్తవస్వరూపముగ తలచుచు కూటస్థుని యందుగల సత్యత్వము నారోపించుకుని వాటితో ఏకత్వమునుబొంది నేను తపించు చున్నాననియు యభిమానించు చున్నాడు. పుత్రభార్యాదులుతపించుచుండగా పురుషుడు వ్యర్థముగా నేను తపించు చున్నానని అభిమానించు చున్నట్లు భ్రాంతిజ్ఞానమే జ్వరమునకు—దుఃఖమునకుకారణము. వాస్తవ జ్ఞానము జ్వరాభావమునకు గారణమగును.

ఆ పరబ్రహ్మము నేనె యగుదునని వాడే పరబ్రహ్మ మగుచున్నాడనియు; తిరిగిజన్మముగలుగదనియు; దుఃఖమునుదాటు చున్నాడనియు; పాపమును తరించుచున్నాడనియు; హృదయగ్రంధుల వలన ముక్తుడవుచు అమృతరూపుడగుచున్నాడనియు, శ్రుతి చెప్పుచున్నది. శ్రు॥ సయోహవైతత్పరమంబ్రహ్మవేదబ్రహ్మైవ

భవతి। నాస్యాబ్రహ్మ విత్కులే భవతి। తరతిశోకం తరతిపాప్మానం గుహాగ్రంధిభ్యోవిముక్తోఽమృతో భవతి॥

(18) బ్రహ్మజ్ఞానోదయమైనను ప్రారబ్ధకర్మక్షయపర్యంతము , చిదాభాసుడు నశింపమిచేతజ్ఞానులకు జీవత్వవ్యవహారమునివర్తింపదు. సర్పభ్రాంతివలన గలిగిన దేహాకంపాదికార్యము, రజ్జుజ్ఞానము గలిగినతరువాత మెల్లగానశించును. మందాంధకారముగలిగినప్పుడు, ఆరజ్జువు సర్పమువలెదోచుచుండును; ప్రారబ్ధకర్మభోగమునుమెల్లగా నశించును; అప్పుడప్పుడు నేనుమనుష్యుడననెడ, విపరీతజ్ఞానంబును, జ్ఞానికి గలుగుచుండును; మరల తత్వజ్ఞానముచేత, ఆబుద్ధియే బాధింపబడును. మాటిమాటికిని దేహాదికముకంటె ఆత్మభిన్నుడనెడి వివేకమునుజేయవలయును.

(19) తృప్తిసాంకుశము. అనగానొకవిషయలాభమువలనకలిగినతృప్తి మరియొక విషయకామత్వముచేత, చెరుపుగలుగును. అనగా మొదటితృప్తినశించును. అపరోక్షజ్ఞానమువలన కలిగినతృప్తి, మరియొకసుఖేచ్ఛను గలుగ జేయదు; అందువల్ల ఈతృప్తి నిరంకుశము. అనగా చేయవలశిన కార్యరాశియంతయు జేయబడినట్లేయాయెననియు (తనకృతకృత్యతచేత) పొందదగిన ఫలవర్గమంతయు పొందబడినట్లేయాయెనని(తనప్రాప్తప్రాప్యత్వముచేతను), తృప్తినిబొందుచున్నాడు. గనుక, ఇదినిరంకుశతృప్తి. ఆకృతకృత్యత్వము శ్లో. 255 మొ॥ శ్లో 284వరకు చెప్పబడినది. ఈజ్ఞాని, ఆత్మజ్ఞానఫలమును అనుభవించుచు, తృప్తిలక్షణమును శ్లో 291 మొ 296 వరకు స్తుతించుచున్నాడు.

శ్లో. అహో శాస్త్ర మహో శాస్త్ర మహో గురు మహో గురుః। అహో జ్ఞాన మహో జ్ఞాన మహో జ్ఞాన సుఖం మహో సుఖం. 7.297

తా॥. వేదాంతశాస్త్రము ఓహోయెంతమనోహరము! వేదాంతశాస్త్రము ఎంతోమనోహరము! ఓహో మాగురువెంతవాడు! ఓహోమాగురువెంతవాడు! ఓహోఅద్వైతాత్మ తత్వజ్ఞానమెంత

మంచిది! ఓహో అద్వైతాత్మ తత్వజ్ఞానమెంతమంచిది! ఓహో మాసుఖమెంతగొప్పది ఓహో మాసుఖ? మెంతగొప్పది. అనియిట్లు జ్ఞాని, ఆశ్చర్యముగా సంతోషించుచున్నాడు. (వేదాంతపంచదశియందుతృప్తిదీపము 255 శ్లో॥ మొ॥ 297 వ శ్లోకమువరకు)

(20) కర్మనిష్ఠులమధ్యమందు జ్ఞానియున్నప్పుడు, సర్వక్రియలనుజేయ వలయును. ముముక్షువులమధ్య నున్నప్పుడు, సర్వకర్మలను దూషించుచు, తానుసర్వకర్మలను విడువవలెను. జ్ఞానియగు వాడు, అజ్ఞానులచేత నిందింపబడినను, ఆయజ్ఞానులకు తత్వ బోధ యెట్లుకలుగునో అప్రకారమాచరించుచుండును (లోకోప కారనిమిత్తమై)

శ్లో॥ తృప్తిదీపమిమం నిత్యంయేఽను సందధతే బుధాః
బ్రహ్మానందేని మజ్జంత స్తేతృప్యంతి నిరంతరం॥ శ్లో॥ 298

ఓం తత్సత్.

# 3. కూటస్థదీపము

(1) కూటస్థ చైతన్యముచేత ప్రకాశింప బడిన దేహము, బుద్ధియందుగల చిదాభాసునిచేత కూడ ప్రకాశింప బడుచున్నది.

(2) బ్రహ్మ చైతన్యముచేత, బుద్ధివృత్తి చిదాభాస ఘటముల యొక్క సమూహము యావత్తు ప్రకాశింప బడుచున్నది. చిదాభాసుడు, ఘటమాత్ర మందుండెడి ఫలరూపు డగుట వలన, ఘటము యొక్క దానినే ప్రకాశింప జేయుచున్నాడు.

(3) ఇది ఘటమనెడి వ్యవహారము, చిదాభాసునిచేత గలుగుచున్నది. ఘటంబెరుగ బడెననెడి వ్యవహారము బ్రహ్మమువలన గలుగుచున్నది.

(4) ఇట్లు దేహముకంటె బాహ్యమందు చిదాభాస బ్రహ్మలు యెరుగ బడుచున్నారు. అటులనే దేహము లోపటను, చిదాభాస, బ్రహ్మలు (కూటస్థుడు చిదాభాసుడు) కలరని తెలిసికొనవలెను

(5) చిదాభాసుడు, (అహం-నేను) అనెడి వృత్తియందును, కామ క్రోధాది వృత్తులయందును వ్యాపించి వర్తించుచున్నాడు. అనగా చిదాభాసునితో గూడిన అహమాదివృత్తులు, తమతమను ప్రకాశింపజేసుకొనుచున్నవి.

(6) బుద్ధివృత్తులయొక్క, పుట్టుకను, నశింపును, ఆరెండువృత్తులయొక్క నడిమికాలమును ఏనిర్వికార సాక్షి చైతన్యము చేత తోచ బడుచున్నవో, ఆసాక్షి చైతన్యమే కూటస్థుడు(శ్రు॥ మనస్సాక్షీ బుద్ధేస్సాక్షీ॥ అనెడి శ్రుతిబుద్ధికి సాక్షియగు కూటస్థుని ప్రతిపాదించు చున్నది. ప్రతిబింబ రూపుడగు చిదాభాసుడు కల్పింప బడెనని (శ్రు॥ రూపం రూపం ప్రతిరూపో బభూవ॥ అనెడిశ్రుతి చిదాభాసుని ప్రతిపాదించు చున్నది. చిదాభాసుని యందుగల

ఉత్పత్తి వినాశములు అనుభవింప బడుచుండుటచేత చిదాభాసునకు కూటస్థభావమును జెప్పరాదు.

(7) ఆత్మకు నాశములేకపోవుటకు అసంగత్వమే హేతువ. శ్రు॥ మాత్రాసంసర్గస్త్వస్యభవతి॥

(8) జీవుని చేత విడువబడిన శరీరము మాత్రమే మృతిని బొందుచున్నది; జీవునకు మృతిలేదు.

శ్రు॥ జీవాపేతం వావకిలేదం మ్రియతే నజీవో మ్రియతే॥

ఈశ్రుతి వలన, జీవునకు దేహాంతరప్రాప్తి కలుగునని తెలుసుకొనవచ్చును.

ఈశ్రుతి మోక్షవిషయమును జెప్పలేదు. మోక్షదశయందు జీవత్వమునకు నాశత్వము కలుగుచున్నది.

(9) సర్వజగత్కల్పనమునకు; దేహేంద్రియాది రూపమగు శరీరద్వయముతో గూడినట్టి చిదాభాస రూపభ్రమమునకు; ఏయధిష్ఠానచైతన్యముగలదో, ఆయధిష్ఠానచైతన్యము, బ్రహ్మశబ్దము చేతను, కూటస్థశబ్దము, చేతను జెప్పబడుచున్నది. సకలజగత్కల్పనమునకు అధిష్ఠానమైనది బ్రహ్మమని, దేహేంద్రియాది భ్రమమునకు కారణమైనది కూటస్థుడని, వేదాంత శాస్త్రమందు నిరూపింపబడినది.

(10). ఉపాధియగుబుద్ధిద్వారా, కర్తృత్వభోక్తృత్వ ప్రమాతృత్వాదులను, స్ఫురణ లక్షణమగు ఆత్మస్వరూపంబును, ధరించినవాడగుచు, చిదాభాసుడు స్పష్టముగాదోచుచున్నాడు. ఇతడు (భ్రమము)కల్పితుడగునని సిద్ధాంతము. ఇట్లుకూటస్థుని, చిదాభాసుని, విభజించి యెరుగవలయును.

(11). ప్రత్యగాత్మయనెడి శివుడు, అసత్యమగు సర్వజగంబునకునధిష్ఠానత్వముగా నుండుటచేతసత్యస్వరూపుడు. సర్వజడపదార్థరా

శిని ప్రకాశింపజేయుటవలన చిద్రూపుడు; సర్వదా ప్రేమవిషయుడగుటవలన, ఆనందరూపుడు.

శ్లో. అసత్యాలంబనత్వేన సత్యస్సర్వజడస్యతు.॥
సాధకత్వేన చిద్రూపస్సదా ప్రేమాస్పదత్వతః॥ శ్లో. 57

(12) మాయాశక్తి, చిదాభాసునిచేత జీవేశ్వరులను నిర్మించెను; మాయయు నవిద్యయు బ్రహ్మమేయగుచున్నది.

శ్రు॥ జీవేశా వాభాసేవకరోతిమాయా
చావిద్యాచస్వయమేవభవతి.॥

(13) మననిద్రయే, జీవేశ్వరులను(స్వప్నగతులైనట్టి, చేతనులైన)సృష్టించుచుండగా సర్వమునుకల్పించెడిమహామాయాశక్తి,జీవేశ్వరులనుసృష్టించుటయందు ఆశ్చర్యములేదు.
(నిద్రయనగా సుషుప్తిసంబంధమగుమాయ)కూటస్థుడుమాయికుడనుటయందు ప్రమాణములేదు; మాయచేతకల్పించబడినవాడుకాడు. సకలవేదాంతములు, కూటస్థునకు, వస్తుత్వమును, — అనగాపరమార్థస్వరూపుడని, యేవికారములు బాధలులేనివాడని ఘోషించుచున్నవి. శ్లో. 65

(14) శ్రుత్యర్థమును విశదీకరించుటకు, యీవేదాంతపంచదశి అనే గ్రంథము వ్రాయబడినది. తర్కోపన్యాసము జేయబడదు. తార్కికుల ఆక్షేపణకు అవకాశములేదు, శ్లో॥ 66

శ్లో. శ్రుత్యర్థం విశదీకుర్మో నతర్కాద్వచ్మికించన.

(15) అవాఙ్మానసగోచరుడగు ఆత్మనుబోధించుటకొరకు శ్రుతులయందుజీవేశ్వరాదిస్వరూపము ప్రతిపాదింపబడినది.

శ్లో॥ అవాఙ్మానసగమ్యంతం శ్రుతిర్బోధయితుంసదా।
జీవమీశంజగద్వాపిసమాశ్రిత్యప్రబోధయేత్.॥ శ్లో 72

(16) శ్రుతితాత్పర్యమునుదెలియనివారికేభేదబుద్ధిగలిగియున్నదికాని, శ్రుతితాత్పర్యవేత్తలకు భేదబుద్ధిలేదు.

శ్లో॥ శ్రుతి తాత్పర్య మఖిలమ బుధ్వా భ్రామ్యతే జడః। వివేకీ త్వఖిలం బుధ్వా తిష్ఠత్యానందవారిధౌ॥ శ్లో 74

(17) పరతత్వము ఏకరూపమైన దైనను, దానిని బోధించెడి ప్రకార మందు, బోధింపబడదగిన పురుషుని యొక్క, చిత్తభేదానుసార ముగా బోధింపబడుచున్నదని సురేశ్వరాచార్యులు చెప్పెను. 73

(18) వివేకియొక్క నిశ్చయము: మేఘమువంటి మాయ, వర్షము వంటి జగత్తును కురియుచున్నదనియు, అట్టి వర్షమువంటి జగం బుచేతఆకాశమువంటి చిదాత్మకు లాభనష్టమేమియు లేదని, ఈప్రకారము, వివేకి యొక్కనిశ్చయమగును.

శ్లో॥ మాయా మేఘో జగన్నీరం వర్షత్వేవయధాతధా।
చిదాకాశస్య నోహా నిర్మహా లాభ ఇతిస్థితిః॥ శ్లో 75

ఓం తత్సత్



హరిః ఓం

# 4. ధ్యానదీపము

(1) వేదాంత శాస్త్రవిచారము వలన— అనగా వేదాంతమహావాక్యార్థ విచారణ వల్లను— అపరోక్షజ్ఞానము, అనగా బ్రహ్మభావ లక్షణముగల మోక్షము కలుగునని సిద్ధాంతము. ఉపనిషదర్థమును గ్రహించ లేనివారికి మోక్షఫలమును కలుగజేసెడి ఉపాసనములను గురించి ఈ యధ్యాయములో నుపదేశింపబడును.

(2) శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యంచ యోగం చయఃపశ్యతి సపశ్యతి॥
(గీతావాక్యము.) —శ్లో 134

తా॥ సాంఖ్యులచేత ఏపరము పదము పొందబడుచున్నదో, ఆపరమపదము ధ్యాన యోగులచేత కూడ పొందబడుచున్నది. సాంఖ్యమును, యోగమును, రెంటిని ఫలముచేత ఒక్కటినిగా నెవడు జూచుచున్నాడో, వాడు శాస్త్రార్థమును యదార్థముగా జూచిన వాడగును. ఇందుకు శ్రుతి వాక్యముకూడ గలదు.

శ్రు॥ తత్కారణం సాంఖ్య యోగాభి పన్నం॥

తా॥ సాంఖ్యము చేతను యోగముచేతను పొందబడెడి జ్ఞానము మోక్షసాధనమగు చున్నది.

సాంఖ్యమనగా తత్వం పదార్థవిచారము.

యోగమనగా ఉపాసనము.

శ్రుతి యందును గీతా వాక్యమందును ఈయర్థమునే గ్రహించవలయునని శ్రీవిద్యారణ్యులు ఉపదేశించిరి.

(3) సాంఖ్యశాస్త్రము యోగ శాస్త్రము వీటియందు చెప్పబడిన అభిప్రాయములు, వేదాంత విరోధము లగుటచేత అంగీకరింపబడవని శ్రీశంకరులు విద్యారణ్యులు జెప్పిరి:

(4) దీప ప్రభయందు మణిబుద్ధిని కల్పించుకుని పరుగెత్తెడి పురుషునిచేత, మణి పొందబడదు. మణి ప్రభయందు మణిబుద్ధిచేత పరుగెత్తెడి పురుషునిచేత మణి లభింప బడుచున్నది. మణిలాభ లక్షణార్థక్రియలేని దగుటవలన విసంవాదిభ్రమమని; మణి లాభ లక్షణార్థ క్రియగల దానిని సంవాది భ్రమమని చెప్పబడుచున్నది.

(5) ధూమమునుజూచి, అగ్నివంతమని నిశ్చయించుట (ధూమజ్ఞానము) సంవాది భ్రమమగును; గోదావరీ జలమందు గంగోదక బుద్ధిగలిగి, దానిని ప్రోక్షించుకొని పరిశుద్ధిని పొందుచున్నాడు; ఈభ్రాంతులు సంవాదిభ్రమలు. నారాయణనామమునకు పుత్రనామత్వజ్ఞానము, సంవాదిభ్రమమగును. వీటికన్నిటికి శాస్త్రప్రమాణములు గలవు. ఇట్లు ప్రత్యక్ష విషయములందును, అనుమాన విషయ మందును, శాస్త్ర విషయమందును సంవాది భ్రమంబులు గలిగియున్నవి. శ్లో.—10

(5) సంవాది, తానుభ్రమమైనను యదార్థ వస్తుఫలంబు నెట్లిచ్చుచున్నదో, అటువలెనే, బ్రహ్మతత్వోపాసనము ముక్తిఫలమునిచ్చుచున్నది.

(7) తాపనీయోపనిషత్తునందు అనేకప్రకారముగా బ్రహ్మతత్వోపాసనము చెప్పబడెను.

శ్లో॥ ఉత్తరేతాపనీయేఽ తత్స్మృతోపాస్తిరనేకధా॥ శ్లో. 1

(8) అఖండైక రసాత్మక మైనట్టి నిర్గుణ పరబ్రహ్మ తత్వమును వేదాంత వాక్యములవలన పరోక్షముగా నెరిగి, ఈబ్రహ్మమునే నైతినని ఉపాసనముచేయుచున్నాడు.

శ్లో. వేదాంతేభ్యో బ్రహ్మతత్వమఖండైకరసాత్మకం।
పరోక్షమవగమ్యైతదహమస్మీత్యుపాసతే.॥ శ్లో. 14

(9) అపరోక్షత్వముకు బ్రయోజకమగు, ప్రత్యగ్బ్రహ్మైక్యలక్షణము లేనికారణమువలన, శాస్త్రజ్ఞానమునకు పరోక్షత్వము

కలుగును. కేవలవాక్యముచేత అపరోక్షజ్ఞానముకలుగదు. తత్వం పదార్థవిచారణకావలయును. అపరోక్షద్వైతభ్రమమునకువిరోధి కాదు. అపరోక్షశిలాజ్ఞానము, పరోక్షమగు ఈశ్వరభావమును నశింపజేయుటలేదు. విచారముచేయుటకు సమర్థులుగాని మనుష్యులు, కల్పములయందుజెప్పబడిన యుపాసనమునుగురుముఖమువలన దెలిసికొనిఅనుష్ఠానముజేయుచున్నారు, అపరోక్షజ్ఞానమునుకలిగించుటకు విచారముతప్ప, మరియొకహేతువలేదుగనుక, మరల, మరల, విచారమే, దేహమునకు మరణముకలిగెడిపర్యంతము, చేయవలయును. శ్లో 32_33

(10) బహుకాలము తత్వంపదార్థవిచారమునుజేసినను, ప్రతిబంధములవలన, పురుషుడు పరతత్వమునెరుగడని, సురేశ్వరాచార్యులు జెప్పెరి. ఆప్రతిబంధములు యేవి అనగా;

(అ) భూతప్రతిబంధమనియు, అనగా, నింతకుపూర్వము గడచినది. పూర్వజన్మమందలి ఒకమహిషీస్నేహముచేత, పరతత్వము గురునిచేత నుపదేశింపబడినను, ఆయతికి, ఆమెనుముస్ఫురించుచుండెను. ఈవిషయముగురువుతెలుసుకొని ఆమెనుమున్నుండెడి బ్రహ్మము నుపదేశించెను. గురువుచెప్పినప్రకారము ధ్యానించుచుండగా, ఆప్రతిబంధముక్షయించెను.

(ఆ) వర్తమానప్రతిబంధము. ఇది విషయాసక్తిరూపముగలదిగాను, బుద్ధిమాంద్య రూపముగాను, కుతర్కములుజేయుట రూపముగాను, ఆత్మకు కర్తృత్వాది ధర్మములుగలవని యుక్తిరహితనిశ్చయముగాను, పరిణమించును. అయితే, శమాది షట్కసంపత్తిచేతను, వేదాంతార్థశ్రవణముచేతను, వేదాంతార్థమననముచేతను, నిదిధ్యాసముచేతను, వర్తమాన ప్రతిబంధము నశించును.

(ఇ) భావిప్రతిబంధము. (ఇకను జరుగగలది.) ఆభావిప్రతిబంధమునకు భోగముచేతతప్ప నివృత్తిలేదు; గనుక, అట్టినివృత్తికి కాలనియమము లేదు. శ్లో॥ 43, 44, 45

(11) బ్రహ్మసాక్షాత్కారపర్యంతము తత్త్వవిచారమును జేయని వానికి, అనేకజన్మములు గలిగినపిమ్మట, ఆ భావిప్రతిబంధము క్షయించుచున్నది. గీతావాక్యములు శ్లో॥ ప్రయత్నాత్ యతమానస్తు యోగీ..................; శ్లో॥ బహూనాం జన్మనాం అంతే..................... శ్లో॥ ప్రాప్యపుణ్యా..............

శ్లో॥ అథవా యోగినామేవ..............................; శ్లో॥ తత్రతం బుద్ధిసం.................... శ్లో॥ పూర్వాభ్యాసేనైవ........ ఇట్లు అనేకజన్మములయందు జేయబడిన ప్రయత్నముచేత తత్త్వజ్ఞానసంపన్నుడగుచు, ఆతత్త్వజ్ఞానమువలన ముక్తినిబొందుచున్నాడు, యని గీతాశాస్త్రమందు జెప్పబడినది: గనుక భావిప్రతిబంధనివృత్తియందు కాలనియమము లేదు. వేదోక్తానుష్ఠానములయందు నమ్మకము లేని జనులనిక్కడ; ఉదహరింపరాదు

శ్లో॥ అశ్రద్ధాంగారవిశ్వాసోనోదాహరణ మర్హతి
శ్రద్ధాంగారేవ సర్వత్ర వైదికేష్వధి కారతః॥ శ్లో॥ 24

(12) బ్రహ్మలోకమును బొందవలెననెడి యిచ్ఛను దృఢముగా గలిగినన్న, బ్రహ్మాభ్యాసము చేయువాడు, ఆత్మసాక్షాత్కారమును పొందడు. అట్టిపురుషుడు బ్రహ్మలోకమందుండి బ్రహ్మదేవునితోగూడ మోక్షమును పొందును. కొంతమంది పురుషులకు, పాపకర్మముచేత, ఆత్మవిచారము ప్రతిబంధింపబడుచున్నది. శ్లో.53 మిక్కిలి బుద్ధిమాంద్యము చేతనయినను, తత్త్వవిచారముచేయుటకు సాధనములు సంభవింపమి చేతనయినను (సరియైనగురువు, వేదాంతశాస్త్రము, తత్త్వవిచారముచేయుటకు అనుకూలమైన దేశకాలాదులు), ఎవరుతత్త్వవిచారమును చేయజాలడో, వాడు, సర్వదా, నిర్గుణ బ్రహ్మముసుపాసింపవలెను.

శ్లో॥ అత్యంతబుద్ధిమాంద్యాద్వా సామగ్ర్యావాప్యసంభవాత్।

(13) నిరంతర మేకారముగా ప్రవహించుచుండెడి వృత్తి రూపమే యుపాసనమగుటవలన ఆయుపాసనము సగుణ బ్రహ్మమునందు వలెనే, నిర్గుణ బ్రహ్మమందునుసంభవించును.

బ్రహ్మమునకు ఉపాస్యత్వము వేద్యత్వంబును, నిషేధింపబడినవి. శ్రుతిబలమువలన, బ్రహ్మాకారవృత్తి, జ్ఞానోపాసనములనెడి రెండుపక్షములయందును సమానమగును. అనేకోపనిషత్తులయందు నిర్గుణోపాసనము చెప్పబడినది.

శ్లో॥ ఉత్తరస్మిం స్తాపనీయే శైబ్యప్రశ్నేథ కాఠకే ।
మాండూక్యాదౌ చ సర్వత్ర నిర్గుణోపాస్తి రీరితా.॥ శ్లో 63

నిర్గుణోపాసనముయొక్క అనుష్ఠానపద్ధతి పంచీకరణమని చెప్పబడెను. నిర్గుణోపాసనము జ్ఞానసాధనము బ్రహ్మతత్వోపాసనము చేత మోక్షమునుబొందును అని సిద్ధాంతము.
అఖండైకరసస్వరూపుడగు ఏపరమాత్మ, ఆనందాది విధేయగుణములచేతను, అస్థూలాది నిషేధ్యగుణములచేతను, తెలుపబడుచున్నాడో, ఆపరమాత్మ నేనైతినని, ముముక్షువులు ఉపాసనముజేయుచున్నారు.

శ్లో॥ ఆనందాదిభిరస్థూలాదిభి శ్చాత్మా త్రలక్షితః ।
అఖండైకరసస్సోహ మస్మీత్యేవముపాసతే॥ శ్లో. 73

| జ్ఞానము: | ఉపాసనము. |
| --- | --- |
| జ్ఞానము వస్తువుయొక్క యధీనముగలదగును. అదివస్తుతంత్రము. | ధ్యానము పురుషునియొక్క అధీనము గలదగును. అదికర్తృతంత్రము. |

(అ) వస్తుతత్వవిచారమువలన జ్ఞానము; ఆ జ్ఞానము సంసారమందు సర్వప్రపంచమునకు దోచుచుండెడి సత్యత్వమును నశింపజేయుచున్నది.

(ఆ) బ్రహ్మతత్వజ్ఞానోత్పత్తిమాత్రముచేత, కృతకృత్యుడగును, నిత్యతృప్తినిబొందినవాడగుచు, జీవన్ముక్తినిబొంది, ప్రారబ్ధక్షయమునుగోరును.

(ఇ) ధ్యానము.

ఆనందాదిగుణగోచరవృత్తులచేత ధ్యానింపబడెడి, బ్రహ్మస్వరూపజ్ఞానముకలిగెడిపర్యంతము ధ్యానించి(త్రిపుటిగా,) ఆబ్రహ్మస్వరూపాభిమానమును మరణపర్యంతముచిత్తమందుధరించియుండవలెను. నిర్గుణోపాసన,(త్రిపుటిసహితమైనది.) స్వస్వరూపసాక్షాత్కారపర్యంతము— అనగాత్రిపుటిరహితముగా—కలిగెడిపర్యంతముచేయవలయును.

(ఈ) జ్ఞానము.

ఈప్రపంచమంతయు మాయామయ మనునట్టియు, ఆత్మచైతన్యరూపుడగునట్టియు జ్ఞానముకలుగగా, లౌకికవ్యవహారమునాచరించెడిజ్ఞానికి, విరోధములేదు.

శ్లో॥ మాయామయః ప్రపంచోయమాత్మాచైతన్యరూపధృత్ ॥
ఇతిబోధేవిరోధఃకో, లౌకికవ్యవహారిణః॥ శ్లో॥88

(ఉ) ఉపాసన ......... చిత్తమునువీడించెడివాడుఉపాసకుడేయగును. జ్ఞానిగాడు.

ధ్యానములోరెండువిధములు; ఏకత్వజ్ఞానముగా; త్రిపుటీసహితముగా; రెండూధ్యానములే.

(15) జ్ఞానిఒకసారిప్రత్యగాత్మనెరిగి, తనకిష్టమొచ్చినప్పుడు, ఆప్రత్యగాత్మను తానెరిగినప్రకారము యథార్థముగా చెప్పుటకును, ఎరుగుటకును, ధ్యానించుటకును, సమర్థుడేయగును. ఉపాసకుడు ధ్యానాంబువలన దగంబును మరచుచున్నాడు; జ్ఞానిమరువడు.

(16) జ్ఞానమువలననే మోక్షముసిద్ధించుచున్నదని వేదాంతశాస్త్రసిద్ధాంతము. మోక్షముకొరకు ధ్యానము చేయదగినది కాదు.

(17) జ్ఞానికి వర్ణాశ్రమాది అభిమానము లేదు. విధినిషేధములు అన్నియు అజ్ఞానికి.

(18) జ్ఞానికి చేయదగినది లేదు. దృఢజ్ఞానముగలవానికి వాసనే లేదు; బాలునకువలె జ్ఞానికిని విధిశాస్త్రము లేదు.

(19) శాపాదిసామర్థ్యమునుగలిగించెడితపంబును; జ్ఞానమునుగలిగించెడి తపంబును – అని తపంబు రెండువిధములు. వ్యాసాదిమునులకు ఉభయవిధతపంబును గలదు.

(20) ఉపాసకునియొక్క బ్రహ్మభావము ధ్యానముకలిగినప్పుడు మాత్రమేనిలుచును; ధ్యానము లేనప్పుడులయించుచున్నది అనగా ఉపాసకునియొక్క బ్రహ్మభావమునకు సత్యత్వము లేదు; బ్రహ్మత్వము సత్యమైనదగుటచే, జ్ఞానము ఆబ్రహ్మత్వమును దెలుపునదియే యగుగాని, పుట్టించునది కాదు. తనబ్రహ్మత్వముయొక్క జ్ఞాపకము లేనిమాత్రముచేత, సత్యమగు బ్రహ్మత్వము లయించదు; జ్ఞానియొక్క బ్రహ్మభావము, జ్ఞానముచేత బుట్టినదైనయడల, జ్ఞానమునశించుచుండగా తానులయించవలెను. అట్లు లేదు.

శ్లో॥ తతోభిజ్ఞాపకం జ్ఞానం ననిత్యం జనయత్యదః
జ్ఞాపకాభావమాత్రేణ నహి సత్యం విలీయతే॥ శ్లో॥ 118

(21) నిర్గుణోపాసనకు నపరోక్షజ్ఞాన సామీప్యముగలదు. అనగా నిర్వికల్పకసమాధి లాభద్వారముచేతను, అదృష్టద్వారముచేతను, అపరోక్షజ్ఞానసాధన మగుటవలన సగుణోపాసనాదులకంటె, ఈనిర్గుణోపాసనము శ్రేష్ఠమైనది. నిర్గుణోపాసనము అతిపరిపక్వమును బొందుటచేత ముక్తికాలమందు జ్ఞానరూపమగుచున్నది. ఉపాసకుడువాస్తవమగు తనబ్రహ్మమును నెరిగిమిచేత, పురుషార్థమును తత్క్షణంపొందడు. పామర జనులయొక్క వ్యవహారము—పుణ్యతీర్థస్నానములు—సంధ్యావం

దనములు — జపయజ్ఞాదిపుణ్యకర్మానుష్ఠానము — సగుణోపాసనము; నిర్గుణబ్రహ్మోపాసనము: ఈచెప్పబడినవానికి ఉత్తరోత్తర శ్రేష్ఠత్వముగలదు. నిర్గుణోపాసనమందు జ్ఞానమును గురించి సామీప్యముగలదు. మూర్తిధ్యానాది సర్వసాధనముల కంటె శ్రేష్ఠమైనది.

(22) నిర్వికల్పక సమాధిలాభమువలన, సంగరహితమగు ఆత్మవస్తువు శేషించును. ఈఅసంగాత్మవస్తువును మాటిమాటికి భావించుచుండగా, పరతత్వ జ్ఞానముకలుగును. అనగా వేదాంతశాస్త్రమందు జెప్పబడిన, ౧ నిర్వికారత్వము, ౨ అసంగత్వము, ౩ నిత్యత్వము, ౪ స్వప్రకాశత్వము, ౫ అద్వితీయత్వము, ౬ పరిపూర్ణత్వము, మొదలగు ఆత్మధర్మములు బుద్ధియందు అతివేగముగా, అవివాదముగా బుట్టుచున్నవి.

శ్లో॥ నిర్వికారాసంగనిత్య స్వప్రకాశైక పూర్ణతాః।
బుద్ధౌఝుడితిశాస్త్రోక్తాఆరోహం త్యవివాదతః. శ్లో 128

నిర్గుణోపాసనమెప్పుడు పరిపక్వమగునో, అప్పుడుసవికల్పకసమాధియగును. దానిని—ఆసవికల్పకసమాధిని, నిరోధించుటవలన, (సూత్రం॥ సర్వనిరోధాన్నిర్బీజస్సమాధిః॥. బ—సూ), నిర్వికల్పకసమాధి, లభించును.

(23) అజ్ఞానమాత్రముచేత కప్పబడిన మనస్సుగలవారికి, తత్వవిచారము(సాంఖ్యము)శీఘ్రముగాజ్ఞానసిద్ధినిగలిగించును. బహువ్యాకులచిత్తముగలవారికి ధ్యానయోగము ముఖ్యము. దానివలన, చిత్తగర్వము నశించును.

(24) ఈజన్మమందు, నిర్గుణోపాసము పరిపక్వము పొందనిచో, మరణకాలమందో, బ్రహ్మలోకమందైనను, బ్రహ్మాత్మైకత్వజ్ఞానముకలిగి మోక్షమునుపొందును. శ్లో 139

(25) మరణకాలమందు పురుషుడు యేదేవతను స్మరించునో, ఆదేవతను బొందుచున్నాడు.

శ్లో॥ యంయంవాపిస్మరన్ శాస్త్రతః. శ్లో 137

శ్రు॥ యచ్చిత్త స్తేనైష ప్రాణమాయాతి ప్రాణస్తేజసాయుక్తః సహాత్మనా యథా సంకల్పిత లోకంనయతి.

సగుణోపాసకునకువలె, నిర్గుణోపాసకునకు, పూర్వాభ్యాసవశమువలన మరణకాలమందు నిర్గుణబ్రహ్మగోచరప్రత్యయము కలుగగలదు. శ్లో 138

అంత్యప్రత్యయమనగా, తాను బూర్వమభ్యసించుచుండెడియాయా దేవతాదివిషయాకారవృత్తిజ్ఞానము.

(26) సంసారాదిభ్రమము నామమాత్రముచేత భ్రమమని చెప్పబడునే గాని, వాస్తవమున యథార్థజ్ఞానమెట్లగునో, బ్రహ్మప్రాప్తియనెడిశబ్దమునకు—అనగా నిర్గుణమనియు నామమాత్రముచేత జెప్పబడునేగాని, అనిత్య నిర్గుణశబ్దార్థము, మోక్షరూపమేయగును.

(27) తాపనీయోపనిషత్తునందు నిర్గుణోపాసకునకు మోక్షముఫలరూపముగావినబడుచున్నది. నిర్గుణోపాసనముయొక్క-సామర్థ్యముచేత అపరోక్ష జ్ఞానముఉదయించును. గనుక

శ్రు॥ నాన్యఃపంథావిద్యతే॥
అనే శ్రుతికి విరోధము లేదు.

(28) సకాముడగుచు పరమాత్మను మూడుమాత్రలు పరిమితిగలఓం అనెడి అక్షరముతో ఉపాసనముచేయుటవలన, సకలపాపములచేతవిడువబడుచు, మహాతేజోవంతుడై బ్రహ్మలోకమునుబొందుచున్నాడని, శైబ్యప్రశ్నోపనిషత్తునందుచెప్పబడినది. శ్లో 144
బ్రహ్మరూపమునకు ఓంకారము పరాపరరూపముగలది; అనగా సగుణనిర్గుణరూపత్వము ప్రతిపాదింపబడెను.

(29) తత్త్వంపదార్థవిచారమును జేయుటకుసమర్థుడుగాని పురుషుడు, ప్రత్యగాత్మరూపపరబ్రహ్మమును సర్వదా ఉపాసనము జేయవలయునని, ఆత్మగీతయందును జెప్పబడినది. శ్లో 151

అనగా అహం బ్రహ్మాస్మి అనియిట్లు నన్ను ధ్యానించవలెను. ధ్యానించగా, పరిపక్వకాలమున, సత్యముగా బ్రహ్మసాక్షాత్కారముగలవాడగును. పరబ్రహ్మమును బొందదలచినవానికి, తన స్వరూపమును ధ్యానించుటతప్ప, మరియొకయుపాయములేదు. పురుషుడు దేహమనెడి జాతిని పెల్లగించి, మరలబుద్ధియనెడికుద్దాలకముచేత త్రవ్వి, మనస్సునందు బుట్టునట్టి శ్రేష్ఠమగు నిధివంటినన్ను, గ్రహించవలెనని ఆత్మగీతయందు జెప్పబడెను.

(30) బ్రహ్మానుభవము (అపరోక్షజ్ఞానము) లేకపోయినను, అహం బ్రహ్మాస్మి అని యిట్లుధ్యానించవలెను. అట్టిధ్యానమువలన, పూర్వములేని దేవత్వాదికంబు బొందపడుచున్నది ; అదేబొందపడుచున్నప్పుడు, స్వస్వరూపత్వముచేతసర్వదా పొందబడెడి సర్వాత్మకబ్రహ్మమును, ధ్యానమువలన, ఉపాసకుడు, తప్పక బొందుచున్నాడు.

(31) నిర్గుణబ్రహ్మధ్యానమువలన ప్రతిదినమందును అనాత్మబుద్ధిశైథిల్య రూపమగు ఫలమునుజూచుచుండియు, ధ్యానమును జేయనియెడల, వీనికంటెయితరమైన పశువులేదు. మనుష్యుడు నిర్గుణబ్రహ్మధ్యానమువలన, దేహమందు నేననెడియభిమానము నువిడచి, అమృతరూపుడై, ఈదేహమందేతనయొక్క నిజరూపమగు అద్వితీయ సచ్చిదానంద లక్షణపరబ్రహ్మము ను బొందును.

శ్లో॥ దేహాభిమానంవిధ్వస్యధ్యానాదాత్మానమద్వయం
పశ్యన్మర్త్యోఽమృతోభూత్వా హ్యత్ర బ్రహ్మసమశ్నుతే॥

ఓం తత్సత్॥

# 5 నాటకదీపము

(1) శ్రు॥ సదేవ సోమ్యేద మగ్రమాసీ దేకమేవాద్వితీయం విజ్ఞానమానందం బ్రహ్మ॥ పూర్ణమదః పూర్ణం।

తా॥ సృష్టికంటె పూర్వమందు పరమానంద రూపుడైనట్టియు, పరిపూర్ణుడగు, ఏపరమాత్మ గలడో, ఆపరమాత్మ,

శ్రు॥ మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరం.

తా॥ తన యందుగల మాయా శక్తిచేత,

శ్రు॥ తదాత్మా నగ్గ్ం స్వయమకురుత సచ్చత్యచ్చా భవత్॥

తా॥ తానే జగదాకారమును బొంది.

శ్రు॥ తత్సృష్ట్వాత దేవానుప్రావిశత్, అనేన జీవేనాత్మనానుప్రవిశ్య.

తా॥ ఆ సృష్టింపబడిన జగంబునందు జీవరూపమువలన ప్రవేశించినవాడాయెను.

(2) ఆపరమాత్మ విష్ణ్వాది ఉత్తమ దేహములయందు బ్రవేశించినవాడగుచు, దేవత, పూజింప బడదగిన వాడాయెను. మనుష్యులు మొదలగు హీన దేహములయందు బ్రవేశించినవాడై పూజకుడు (దేవతను పూజించెడివాడు) ఆయెను. ఈయుత్తమాధమభావము శరీరోపాధి నిమిత్తమైనది. ఆత్మకు స్వాభావికముకాదు.

శ్లో॥ విష్ణ్వాద్యుత్తమ దేహేషు ప్రవిష్టో దేవతాఽభవత్, మర్త్యాద్యధమ దేహేషుస్థితో భజతి దేవతాం॥ శ్లో॥ 2

(3) అనేకజన్మములయందు అనుష్ఠింపబడిన కర్మములను బ్రహ్మసమర్పణ రూపభజనముచే తనస్వరూపము యొక్క విచారమును చేయుట కిచ్ఛయించును. ఆవిచారముచేత, తననిజ ఆనందస్వరూపమును మరుగుపరచినమాయ, నివృత్తినిబొందును. తానే, పరమాత్మయే శేషించును.

(4) ద్వైతముతో కూడికయు, దుఃఖిత్వంబును, సంసారబంధమనబడును. స్వరూపస్థితియేముక్తి.

(5) విచారములేమిచేత కల్పించబడిన బంధము, విచారముచేతని వర్తించుచున్నది. జీవాత్మ, పరమాత్మలనిద్దరిని సాక్షాత్కారపర్యంతమువిచారముజేయ వలెను.

(6) (అహంకారము) చిదాభాసుడు, దేహములయందునేనని, అభిమానమును జేయుచు, కర్తృత్వాది ధర్మములను గలిగి జీవుడగు చున్నాడు. ఆజీవునకు కరణము మనస్సు. అమనస్సునకు, క్రమముగా, దేహమునకు అంతరమందు, బాహ్యమందు, వర్తించుచుండు వృత్తులు, క్రియలు,

(7) కర్తను, అనగా అహంకార రూపమును, క్రియను (నేనిదియని నిర్దేశించెడి మనోవృత్తిరూపమును)ఘ్రాణాదింద్రియముచేత గ్రహింపబడుచు అన్యోన్య భేదముగల, గంధాధి, విషయములను, ఒక్కసారియే, ఏపరమాత్మ, చిద్రూపుడైయగుచు ప్రకాశింపజేయుచున్నాడో, ఆపరమాత్మ. వేదాంతశాస్త్రమందుసాక్షియని చెప్పబడును.

(8) తనయొక్క స్థానమందుండి, దీపము, తనసమీపమునందున్న పదార్థములన్నిటిని నెట్లుప్రకాశింపజేయునో అప్రకారమేసాక్షియు,స్థిరస్థాయియగుచు బాహ్యాభ్యంతరములను ప్రకాశింపజేయుచున్నాడు. అనగాసర్వమును ప్రకాశింపజేయుచున్నాడు.

(9) శబ్దస్పర్శాది విషయములు దేహముకంటె బాహ్యమందున్నవియగును. అహంకారము, దేహమునకు లోపటనుండునది. దేహములోపటనుండెడి బుద్ధి, రూపాదికమును గ్రహించెడి కొరకు, చక్షురాదింద్రియద్వారా, మాటిమాటికి బాహ్యస్థలమునకు బోవుచున్నది. ఆబుద్ధియందుగల బాహ్యచాంచల్యమును, బుద్ధిని ప్రకాశింపజేసెడి సాక్షియందు వ్యర్థముగా నారోపింపబడుచున్నది. వాస్తవమున సాక్షిచాంచల్యములేనివాడేయగును. బుద్ధిచేతఏయేరూపాదికము కల్పించబడునో, ఆయారూపాదికముతుపరమాత్మప్రకాశింపజేయుచు, ఆయారూపాదికమునకుసాక్షియగుచున్నాడు.ఆసాక్షిఅవాఙ్మానసగోచరుడగును.

(10) సర్వాద్వైత వ్యవహారమునకు, మిథ్యాత్వ నిశ్చయముచేత, ద్వైతము తోచకపోవుచుండగా, స్వస్వరూప భూతుడగు పరమాత్మయే సత్యత్వముచేత శేషించుచున్నాడు. ఆ పరాత్మ స్వప్రకాశ స్వరూపుడగుట వలన, ప్రమాణ మపేక్షింపబడదు. ఆత్మకు స్వప్రకాశత్వముచేత, స్వతః, స్ఫురణము గలిగి యుండగా, ప్రమాణ మవసరము లేదు ప్రమాణము కావలసన్నచో శ్రుతియే ప్రమాణమగును. గురుముఖమున శ్రుతిని పఠించి, తెలుసుకొనవలయును.

(11) అహంకారము = ప్రభువు.

శబ్దస్పర్శాది విషయములు = సభయందుగల పురుషుల వంటి వగును

మతిః = బుద్ధి = నాట్యము జేసెడి స్త్రీవంటి దగును.

శ్రోత్రాది ఇంద్రియములు = తాళము మొదలగు నాట్యసాధనములను ధరించిన జనులవంటి వగును.

సాక్షి = అహంకారాది సర్వమును ప్రకాశింప జేయుచుండుట వలన, ఆసాక్షికి దీపము తోటితుల్యత్వము గలిగి యున్నది.

ప్రభువు = నృత్యాభిమాని; విషయభోగ సుఖదుఃఖములను గలవాడు.

శబ్దస్పర్శాది విషయములు సమీపమందున్నను, వాటికి సుఖదుఃఖములు లేవుగనుక అవి సభ్యులతో తుల్యులు. బుద్ధికి నానా వికారము గలిగి యుండుటచేత, నాట్యమాడెడి స్త్రీ తోటి తుల్యత్వము.

నాటకము ఆడునప్పుడున్న దీపము సభ్యులను ప్రభువును నాటక స్త్రీని, ఇతర వస్తువలన్నిటిని, ప్రకాశింప చేసినట్లున్నూ దీపము తను తటస్థంగావున్నట్లున్నూ ఈదృష్టాంతం చేత-కూటు

సాక్షాత్తును దీపమువలె తటస్థుడై - ప్రభువువంటి - చిదాభాసుని చిన్న - ఈయన ఉపాధి అయిన బుద్ధిఅనే నాట్య స్త్రీ నిన్ని - బుద్ధి వృత్తులనే సభ్యులను తనుతటస్థుడై ప్రకాశింపజేయును.

దీపపంచకము సమాప్తము.

ఓం తత్సత్.

## శ్రీ వేదాంత పంచదశి లోని 6, 7, 8, 9, 10, అధ్యాయములు (అనగా దీప పంచకముయొక్క) సంగ్రహ తాత్పర్యము.

(1) సకలజగత్ కల్పనమునకు అధిష్టానమైనది బ్రహ్మము; దేహేంద్రియాది భ్రమమునకు కారణమైనది కూటస్థుడు.

(2) బుద్ధి వృత్తులయొక్క పుట్టుకను నశింపును ఆరెండు వృత్తుల యొక్క నడిమి కాలమును ఏనిర్వికారరూప, సాక్షిచైతన్యము చేత తోచబడుచున్నదో ఆసాక్షి చైతన్యమే కూటస్థుడు.

(3) కర్తను, అనగా అహంకార రూపమును, క్రియను, గంధాదివిషయములను, ఒక్కసారియే, ఏపరమాత్మ చిద్రూపుడేయగుచు, ప్రకాశింప జేయుచున్నాడో, ఆపరమాత్మ, వేదాంత శాస్త్రమందు సాక్షియని చెప్పబడును.

(4) బుద్ధియందుగల బాహ్య చాంచల్యమును, బుద్ధిని ప్రకాశింప జేసెడి సాక్షియందు వ్యర్థముగా నారోపింప బడుచున్నది.

(5) బుద్ధిచే కల్పించబడు రూపాదికను పరమాత్మ ప్రకాశింపజేయుచు ఆయా రూపాదికమునకు సాక్షియగు చున్నాడు.

(6) ఆసాక్షి అవాఙ్మనస గోచరుడు.

(7) ఆసాక్షి స్వప్రకాశ స్వరూపుడు.

(8) ఆత్మకుస్వప్రకాశత్వముచేత, స్వతఃస్ఫురణము కలిగియున్నది.

(9) బుద్ధ్యాదులన్నియు గల్పించబడుటకు, ఆధారమైన కూటస్థచైతన్యమే, బుద్ధియందు ప్రతిబింబించుటచేత, జీవభావమునుబొందినదగుచు, పురుషశబ్దముచేత(జీవుడని) చెప్పబడుచున్నది.

(10) ఉపాధియగుబుద్ధిద్వారా ప్రతిబింబించి కర్తృత్వ భోక్తృత్వ ప్రమాతృత్వాద్యాదులను, స్ఫురణ లక్షణ మగుతనజీవఆత్మస్వరూపంబును, ధరించినవాడగుచు, చిదాభాసుడు స్పష్టముగా తోచుచున్నాడు ఇతడు(భ్రమము) కల్పితుడగునని సిద్ధాంతము. ఇట్లుకూటస్థుని, చిదాభాసుని, విభజించి యెరుగవలయును.

(11) చిదాభాసుని యందుగల ఉత్పత్తి, వినాశములు, కూటస్థునిచేత అనుభవింపబడుటచేత, చిదాభాసునకు కూటస్థభావమునుజెప్పరాదు.

(12) కూటస్థాత్మయొక్క ప్రతిబింబరూపుడగు చిదాభాసునకున్నూ కూటస్థాత్మకువలె, స్వప్రకాశత్వమే ముఖ్యస్వభావము.

(13) కూటస్థ చైతన్యము చేత ప్రకాశింపబడిన దేహము, బుద్ధియందుగల చిదాభాసుని చేత కూడ ప్రకాశింపబడుచున్నది.

(14) ప్రతిబింబరూపుడగు చిదాభాసుడు కల్పితుడు; ఆచిదాభాసునకు మోక్షాది సిద్ధికలిగెడి కొరకు, కూటస్థ చైతన్యము కూడ గ్రహింపదగును.

(15) కూటస్థునితో గూడిన చిదాభాసుడే మోక్షస్వర్గాది సాధనానుష్ఠానమందు, అధికారియగు చున్నాడు. కేవలచిదాభాసుడు అధికారియగుట లేదు.

(16) కూటస్థ సహిత చిదాభాసుడు తానుమిథ్యా రూపుడనిన్నీ, తనకు కూటస్థునకు భేదము గలదనిన్నీ తాను నిజముగా కూటస్థుడైనటుల నున్నూ యెరుగుటకు కూటస్థసహిత చిదాభాసునకు సమర్థత గలదని శ్రుతివలన వినబడు చున్నది.

(17) చిదాభాసుడు అసలు కూటస్థుడే గనుక తనయందుజ్వరములేనివాడైనను అవిద్యచేత, శరీర త్రయమును తనయొక్క వాస్తవస్వరూపముగ తలచుచు కూటస్థుని యందుగల సత్యత్వము నారోపించుకుని, వాటితో ఏకత్వమునుబొంది నేనుతపించుచున్నానని యభిమానించు చున్నాడు.

(18) తన నిజరూపము కూటస్థుడని తెలిసిన పిమ్మట చిదాభాసుడు తన కర్తృత్వ భోక్తృత్వాది గుణములను చెప్పుకొనెడి వినయమైన సిగ్గుపొందు చున్నాడు. శరీరములే తాననెడి రూపము గల తాదాత్మ్యాధ్యాసమును జేయనే చేయడు. కూటస్థాత్మ ననుసరించిన వాడగుచు, తాను పూర్ణానందైక స్వరూపకూటస్థాత్మయగు చున్నాడు.

(19) అధ్యాస నివృత్తికొఱకు కూటస్థాత్మ, చిదాభాస దేహేంద్రియాదుల కంటె నన్యుడనెడి జ్ఞానాభ్యాసమును సర్వదా చేయుచుండవలయును.

(20) ఆకలి దప్పికలు అసంగుడైన కూటస్థునియందు లేవనియు; నేననెడి చిదాభాసుని యందు అహంకారమందు కనబడు చున్నవనియు చింతించ వలెను,

(21) అధ్యాస మూలముగల కామమే విడువదగినది; అహంకారమును బుద్ధిచేత భిన్నముగా జూచుచు కోటివస్తువులను కోరినను బాధలేదు

(22) చిన్మాత్రుడగు ఆత్మ స్వప్రకాశత్వమువల్ల (అహం) నేనని స్ఫురించు చుండుటచేత, అపరోక్ష జ్ఞానవిషయుడగును; మరియు, బుద్ధిచేత, ఆయాత్మను స్వప్రకాశునిగా జూచుటవల్ల ఆయాత్మ పరోక్షజ్ఞాన విషయుడగును.

(23) వివేకజ్ఞానమునకే విద్యాస్వభావమును జెప్పవలయునుగాని, ద్వైతము తోపమికి విద్యాభావమును జెప్పరాదు. వాస్తవమందు భోక్త లేమిచేత, నిశ్చలమైన అపరోక్ష జ్ఞానికి దేహసంబంధ దు:ఖములేనే లేదు.

(24) జ్ఞానిసంసారమునకు భయపడి ఉదాసీనత్వమును బొందును. కార్యములయందు ప్రవర్తనముపుండదని బోధింపబడ లేదు

(25) సంవాది తాను భ్రమమైనను యదార్థవస్తు ఫలంబు నెట్లిచ్చు చున్నదో, అటువలెనే, బ్రహ్మతత్త్వోపాసనము ముక్తి ఫలము నిచ్చు చున్నది.

26. అఖండైకరసాత్మకమైనట్టి అనగా, పరమానందస్వరూపుడైనట్టి, నిర్గుణపరబ్రహ్మతత్త్వమును వేదాంత వాక్యములవలన పరోక్షముగా నెరిగి ఈ బ్రహ్మము నేనైతినని ఉపాసనము జేయుచున్నాడు. అనగా, అఖండైకరసరూపుడగు ఏ పరమాత్మ, ఆనందాది విధేయగుణములచేతను, అస్థూలాది నిషేధ్యగుణములచేతను దెలుపబడుచున్నాడో, ఆ పరమాత్మ, నేనైతినని, ముముక్షువులు ఉపాసనము జేయుచున్నారు.

27. నిర్గుణ బ్రహ్మధ్యానమువలన, ప్రతిదినమందును అనాత్మబుద్ధిశైథిల్య రూపమగు ఫలమును చూచుచుండియు, ధ్యానమును జేయనియెడల, వీనికంటె యితరమైనపశువు లేదు.

28. మాయాశక్తి చిదాభాసుని చేత జీవేశ్వరులను నిర్మించెను. మాయయు, నవిద్యయు బ్రహ్మమేయగుచున్నది.

26. ద్వైతముతో కూడికయు, దుఃఖిత్వంబును సంసార బంధమనబడును; స్వరూపస్థితియే ముక్తి. తనయొక్క స్వరూపముయొక్క విచారముచేత, తననిజ ఆనంద స్వరూపమును మరుగు పరచిన మాయనివృత్తిబొందును, తానేపరమాత్మయే శేషించును.

30. జీవునిచేత విడువబడిన శరీరముమాత్రమే మృతిని బొందుచున్నది; జీవునకు మృతి లేదు.

ఓం తత్సత్.

# బ్రహ్మ విద్య

## 7 వ ప్రకరణము

### శ్రీవేదాంతపంచదశిలోని, తృతీయపంచకము.

### ఆనందపంచకము.

## 1. బ్రహ్మము, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మానందము.

(1) సర్వజగత్తుకు సృష్టికర్తయగు పరబ్రహ్మస్వరూపముగలదని సర్వవేదాంతసిద్ధాంతము.

(2) ఆపరబ్రహ్మ ఆనందస్వరూపుడు. సత్యజ్ఞానానంద స్వరూపుడు.

శృ॥ సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ.

శృ॥ విజ్ఞానమానందం బ్రహ్మ.

శృ॥ స్వయంప్రకాశం స్వయంబ్రహ్మ.

శృ॥ ఆనందోబ్రహ్మ, విజ్ఞానమానందంబ్రహ్మ, నిత్యశ్శుద్ధో బుద్ధస్సత్యోముక్తో, నిరంజనోవిభురద్వయఆనందః పరః ప్రత్యగేకరసః॥

శృ॥ బ్రహ్మైవేదం సర్వం సచ్చిదానందమాత్రం

(నృసింహోత్తర తాపనీయోపనిషత్తు)

శృ॥ ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానంబ్రహ్మ॥

[ఋ — ఐతరేయోపనిషత్తు]

శృ॥ యోవైభూమాతత్సుఖం॥

[ఛాందోగ్యశృతి]

శృ॥ ఆనందో బ్రహ్మేతివ్య జానాత్॥

[తైత్తరీయశృతి]

ఇట్లు బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపముగలదగునని సిద్ధించుచున్నది.

(3) ఆ ఆనందస్వరూపుడైన బ్రహ్మవల్ల నే జగత్ సృష్టికలిగినది.
శ్రు॥ యతోవా ఇమానిభూతానిజాయంతే, యేనజాతానిజీవంతి,
యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ॥
[తైత్తరీయం]
శ్రు॥ ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతానిజాయంతే॥
ఆనందేన జాతాని జీవంతి ఆనందంప్రయంత్యభిసంవిశంతి॥
[తైత్తిరీయం]

(4) ఆ పరబ్రహ్మయొక్క నానానాకశక్తియే జగద్రూపముగా ప్రకాశించుచున్నది. ఆశక్తియే ప్రకృతి. త్రిగుణాత్మకమైనది. మృత్తికఘటమున కుపాదానకారణమైనట్లు, ఆనందము, జగంబున కుపాదానకారణము. ఆత్మ (ఆనందము) కుమ్మరివలె నిమిత్తకారణమున్ను, ఉభయమున్ను అగుచున్నది. రజ్జురూపముగానున్న వస్తువ, రజ్జ్వాకారమును విడువకనే సర్పరూపముగా ప్రకాశించుటయే వివర్తము. ఇంద్రజాలవేత్త తన శక్తిచేత సర్పాదికమును నగరమును, కల్పించునట్లు, బ్రహ్మ తనయందలి మాయాశక్తిచే ప్రపంచమును కల్పించును. (రజ్జురూపముగానున్న వస్తువ, రజ్జ్వాకారమును విడువకనే సర్పరూపముగా ప్రకాశించునట్లు) నిరవయవమయిన ఆనందస్వరూపబ్రహ్మమందు, ప్రపంచముకల్పించబడినది. నిజముగానున్నదిఆనందస్వరూపమైన బ్రహ్మమైనను, బ్రహ్మయందలి శక్తివలన, బ్రహ్మమే జగద్రూపేణ ప్రకాశించుచున్నాడు. ఇదియే వివర్తము. జగత్కారణరూపబ్రహ్మమును తెలియగోరినవారై, మునులు, ధ్యానయోగము నవలంబించి స్వప్రకాశ చిద్రూపుడైన ప్రత్యగభిన్నపరమాత్మను తనయొక్క మాయాశక్తికార్యములగు స్థూలసూక్ష్మకారణ శరీరములనే అవిద్యచేత గప్పబడియున్నదానినిగా జూచిరి. తెలుసుగొనిరి.

శ్రు॥ తేధ్యానయోగానుగతా అపశ్యన్
దేవాత్మ శక్తింస్వగుణైర్ని గూఢాం॥
[శ్వేతాశ్వతరోపనిషద్వాక్యము,]

ఈ ప్రత్యగభిన్న బ్రహ్మముయొక్క జగత్కారణశక్తి క్రియాజ్ఞానేచ్ఛా స్వరూపముగలదగుటచే నానావిధముగా వినబడుచున్నది.

శ్రు॥ పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబల క్రియాచ॥
[శ్వేతాశ్వతరోపనిషత్తు]

ఆ ప్రకారమే, పరబ్రహ్మమునకు, పారమార్థికని రూపాధిక స్వరూపము, సోపాధికరూపము, రెండున్ను, గలవని, వసిష్ఠ మహాముని యోగవాసిష్ఠమనెడి గ్రంథమందు చెప్పెను. అనగా బ్రహ్మము, వినాశములేనట్టి సర్వవ్యాపకమైన అద్వితీయ స్వరూపమున్ను, సర్వశక్తివంతమగు సోపాధిక రూపమున్ను రెండురూపములుగలిగినదని చెప్పెను. వే-పం13అ. శ్లో॥ 14

మహాసర్పముగ్రుడ్డులో సూక్ష్మరూపముగా నున్నట్లు, నీప్రపంచమంతయు సృష్టికిముందు పరబ్రహ్మయందు సూక్ష్మరూపముగా అనగా బీజరూపంగా మాయాద్వారా నుండెను.

నిర్వికారపరబ్రహ్మమునందు యీ మాయాశక్తి తిరిగి సృష్టికాలమందు భూతభౌతికప్రపంచరూపములచేత బహువిధములుగా వికారమునుపొందుచున్నది.

శ్లో॥ అవిక్రియబ్రహ్మనిష్ఠా
వికారం యాత్యనేకధా॥ శ్లో॥ 66

అనగా, ఆమాయను జగదుపాదాన కారణమైన ప్రకృతినిగా నెఱుగవలెను. మాయకు నాశ్రియుడు అవుటచేత నామాయావంతుడైనపరమేశ్వరుని (మాయిని) మాయా, నియామకుడగు మహేశ్వరునిగా నెరుగవలెను.

శ్రు॥ మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతుమహేశ్వరం॥
[శ్వేతాశ్వతర మంత్రము,]

(5) బ్రహ్మజ్ఞానమువలన—అనగా బ్రహ్మైకత్వజ్ఞానము వలన, అనగా, తత్వమసి, సర్వంఖల్విదంబ్రహ్మ, నేహనానాస్తికించన

అనే శ్రుతిప్రకారము, సమస్తము, బ్రహ్మస్వరూపమనిన్ని, అనగా ఆత్మస్వరూపమనిన్ని, అనగా సర్వమూ ఆనందస్వరూపమనిన్ని; అనగా శ్రు॥ అహంబ్రహ్మాస్మి॥ అనే శ్రుతిప్రకారముదానే బ్రహ్మస్వరూపుడనిన్ని, ఆత్మస్వరూపుడనిన్ని, జ్ఞానము కలుగును. అట్టివానికిదుఃఖనివృత్తి ఆనందప్రాప్తి, కలుగుచున్నవి. అనగా, బ్రహ్మాత్మైకత్వ జ్ఞానము లేకుండా, మరియొక సాధనముచేత బురుషుడు నిరతిశయసుఖవంతుడు కానేరడు. అనగా బ్రహ్మజ్ఞానమువలన దుఃఖనివృత్తియు, ఆనందావాప్తియు, గలుగునని సర్వవేదాంతసిద్ధాంతము.

(అ) శ్రు॥ సుఖంత్వేవ విజిజ్ఞాసితవ్యం॥

(ఛాందోగ్య శ్రుతి సప్తమాధ్యాయం.)

తా॥ సర్వజ్ఞుడైననారదుడు, తనను దుఃఖసముద్రముయొక్క అవతలగట్టును బొందింపజేయుమనిన్ని — కృతార్థతాబుద్ధినిగలిగింపుమనిన్ని, (శ్రు॥ సోహంభగవన్ శోచామి॥ శ్రు॥ తంమా భగవాన్ శోకస్య పారంతారయతు॥) అని సనత్కుమారునికోరగా, ఆమహాముని, సుఖరూపబ్రహ్మమే, తెలియబడినయెడల దుఃఖనివృత్తియగునని జెప్పెను.

(ఆ) శ్లో॥ సుఖంవైషయికంశోక సహస్రేణావృత, త్వతః॥
దుఃఖమేవేతిమత్వాహ నాల్పేస్తిసుఖమిత్యసౌ॥
వే. పం. ॥ప్ర. శ్లో॥. 21

(ఇ) శ్రు॥ బ్రహ్మవిదాప్నోతిపరం॥

(ఈ) శ్రు॥ తరతిశోకమాత్మవిత్.॥

(ఉ) శ్రు॥ బ్రహ్మవేదబ్రహ్మైవభవతి.॥

(ఊ) శ్లో॥ బ్రహ్మవిత్పరమాప్నోతి శోకంతరతిచాత్మవిత్॥
రసోబ్రహ్మరసంలబ్ధ్వానందీభవతినాన్యథా॥.
వే. పం. ॥ప్ర॥. శ్లో॥ 2

(ఎ) శ్రు॥ ఆనందం బ్రహ్మణో విద్వాన్నబిభేతికుతశ్చన॥.

(ఏ) శ్రు॥ భిద్యతేహృదయగ్రంధి శ్ఛిద్యంతేసర్వసంశయాః॥.
క్షీయంతేచాస్యకర్మాణి తస్మిన్ దృష్టేపరావరే॥.

(ముండకోపనిషత్తు)

తా. పరమాత్మ సాక్షాత్కారముగలవానికి సర్వసంశయములు చీల్చివేయబడుచున్నవనియు, మరియు, కర్మములకు మూల కారణమగు అజ్ఞానము నశించుటచేత, సంచితకర్మములన్నియు నశించుచున్నవనియు ముండకాది శ్రుతిస్థిత వాక్యము జెప్పు చున్నది.

(ఐ) శ్రు॥తమేవవిద్వానత్యేతిమృత్యుం, పంథాన, చేతరః॥

(శ్వేతాశ్వతర వాక్యము).

తా. పరమాత్మ నెరిగినవాడే మృత్యురూప సంసారమునతిక్రమించు చున్నాడనియు, కేవలజ్ఞానమే, ముక్తిసాధనమగుననియు, శ్రుతివాక్యము జెప్పుచున్నది.

(ఒ) శ్రు॥ జ్ఞాత్వాదేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణిః॥

(శ్వేతాశ్వతరవాక్యము).

తా. పరబ్రహ్మమును అపరోక్షముగా ననుభవించియుండెడివానికి, సర్వపాశములు నశించుననియు, పరలోకదుఃఖ సంబంధము లేదనియు శ్రుతి జెప్పుచున్నది.

ఓ. శ్రు॥ యదాహ్యేవైషఏతస్మిన్నుదరమంతరంకురుతే। అథతస్య భయం భవతి॥.

తా. ఆప్రత్యగభిన్నపరమాత్మయందుకొంచమైనను, ఉపాస్యోపాస కాదిభేదమును, ఏ పురుషుడు ఎప్పుడు చూచునో, అప్పుడేయా భేదదృష్టిగల వానికి సంసారదుఃఖము కలుగుచున్నది. అనగా బ్రహ్మజ్ఞానమునకు దుఃఖనివృత్తి హేతుత్వమును దెలుపుచు న్నది.

శ్రు. భీషాస్మాద్వాతః పవతే.

తా. భయమువలననేవాయువు వీచుచున్నాడు.

శ్రు. భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః.

తా. జగత్తుకు ఆధారభూతులగు వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, మృత్యువు, అనెడివంచదేవతులును, పూర్వజన్మ మందుజీవాత్మ బ్రహ్మములకుభేదమునుజూచి, ఈబ్రహ్మము వలనభయముచేత, ఈవాయ్వాదిజన్మమందు, తమతమ వ్యాపారములయందుయల్లప్పుడు ప్రవర్తించుచున్నారు.

ఇట్లుబ్రహ్మాత్మైకత్వజ్ఞానమువలననే, జన్మరాహిత్యము, దుఃఖనివృత్తి గలిగిమోక్షరూపపరమపురుషార్థము సిద్ధించునని శ్రుతులవలన వినబడుచున్నది.

## 2. బ్రహ్మానందము

పరోక్షముగా బ్రహ్మాత్మైకత్వజ్ఞానముకలిగినను, అది, అపరోక్షముగా, అనుభవరూపముగా సిద్ధించుటెట్లు? బ్రహ్మాత్మైకత్వజ్ఞానమనగా, ఆనంద స్వరూపుడైన బ్రహ్మమేతానని, ఆనందమూర్తియై, యల్లప్పుడు బ్రహ్మానందమందేనిమగ్నుడై యుండుట. జగత్తునందు అనుభవింపబడు విషయానందము, బ్రహ్మానందములోభాగమేగాని, మరియొక ఆనందముకాదు.

ఆ బ్రహ్మానందమును అనుభవరూపముగా గ్రహించుటకు, మార్గములు అయిదుఅని, శ్రీవిద్యారణ్యస్వాములవారు రచించిన, వేదాంత పంచదశి–11, 12, 13, 14, 15 ప్రకరణముల వలన, సిద్ధించుచున్నది.

(1.) చిత్తనిరోధ సమాధ్యభ్యాసయోగముచేత–అహమాది వృత్తివిలయవశమువలన అనగా యోగాభ్యాసముచేత యోగులు, అనుభవించెడి బ్రహ్మానందము, యోగానందమని వుపదేశించిరి.

(2.) ఆత్మవిచారణవలన—అనగా ఆత్మానాత్మవివేకమువలన, వివేకులు, జ్ఞానులు—అనుభవించెడి బ్రహ్మానందము—ఆత్మానందమని యుపదేశించిరి.

(3.) ద్వైతమిథ్యాచింతనచేతను, పరిశేషన్యాయముచేతను పాము పోతే త్రాడుమిగిలినట్లు, అనగా ద్వైతమిథ్యాత్వనిశ్చయముచేత బ్రహ్మానందమును అద్వైతులు అనుభవించుచున్నారనియు, అది అద్వైతానందమనియు, యుపదేశింపబడినది.

(4) గురుశాస్త్రోక్తమైన విద్యచేత, తాను దుఃఖములేనివాడు, సర్వకామప్రాప్తుండు, కృతకృత్యుండు, ప్రాప్తప్రాప్యుండునియు, తనకుకర్తవ్యంబేమియు లేదనియు తెలుసుకుని, సర్వదావిద్వాంసులు అనుభవించెడి, బ్రహ్మానందమును, విద్యానందముగానుపదేశించినారు.

(5) పామరులుబ్రహ్మానందమునే, విషయానందసుఖముగా అనుభవిస్తున్నారు.

## 3. బ్రహ్మానందముయొక్క స్వరూపము

(1) సుషుప్తియందు అనుభవింపబడు, స్వప్రకాశరూపమైన ఆనందమున్నూ; తూష్ణీంస్థితియందు విషయానుభవములేకనే, తోచుచుండెడి ఆనందమున్ను; ఇష్టవస్తుప్రాప్తివలన నంతర్ముఖమగు మనంబునందు ప్రతిబింబించినవిషయానందమున్నూ ఈమూడానందములున్ను, దప్పమరియొకయానందంబు, ఈజగంబునందు బ్రహ్మానందమునకుపమానము లేదు.

శ్లో॥ బ్రహ్మానందోవాసనాచ ప్రతిబింబఇతిత్రయం।
అంతరేణ జగత్యస్మిన్నానందోనాస్తికశ్చన॥

వే. పం. ॥ప్ర. శ్లో॥ 37

(2.) సుషుప్తియందు సకల ప్రపంచము, ప్రకృతియందు లీనమగుచున్నది. అప్పుడు జీవుడు ప్రకృతిచేత కప్పబడినవాడై సుఖ

రూపమైన బ్రహ్మమును బొందుచున్నాడు. ఇట్లు శ్రుతిచెప్పు చున్నది.

శ్లో. సుషుప్తికాలేసకలేవిలీనే తమసావృతః
సుఖరూపముపైతీతి బ్రూతేహ్యాథర్వణీశ్రుతిః॥
వే.పం.॥ ప్ర. శ్లో 58

అనగాసుషుప్తికాలమందు ఇంద్రియములు తమకారణమైన అజ్ఞానమందులయించుటవలన సుఖమును గ్రహించెడియింద్రియములు లేవు. అనగా అప్పుడు అధ్యాసము కలుగజేసెడి జీవధర్మములు వుండవు. అనగా సుషుప్తియందు జీవత్వము స్ఫురింపక, స్వరూపసుఖమునే అనుభవించుచుండును. అనగా ఆసుషుప్తియందు జీవుడు, సర్వదుఃఖములను దాటుతున్నాడని శ్రుతి జెప్పుచున్నది.

శ్రు. తీర్ణోహి,తదా, సర్వాన్, శోకాన్ హృదయేఽస్య భవతి॥
(సమనంతరశ్రుతి).

(3) అందువల్లనే అంధుడైనను సుషుప్తియందు అంధుడుగాడు; యుద్ధాదికమందు గాయముగలవాడైనను సుషుప్తియందు వ్రణభాధలేనివాడు; రోగవంతుడైనను సుషుప్తియందు రోగములేనివాడగుచున్నాడు.

శ్రు॥ తస్మాద్వాఏతంసేతుంతీర్త్వాంధస్సన్ననంధోభవతి, విద్ధస్సన్నవిద్ధోభవత్యుపతాపీసన్ననుపతాపీభవతి, తద్వద్యపీదంభగవశ్శరీరమంధం భవత్యనంధస్సభవతి.

(4.) సుషుప్తికి పూర్వక్షణమందు, సుఖసాధనములవలన, విషయసుఖమునసుభవించుచున్న, జీవుడు, ఆనందరూపబ్రహ్మమందు శీఘ్రముగా నైక్యమునుబొందు చున్నాడని శ్రుతిజెప్పుచున్నది.

శ్రు॥ సతాసోమ్యతదాసంపన్నో భవతి.

(5.) అనగా సుషుప్తికి పూర్వక్షణమందు, సుఖాకారమగు బుద్ధివృత్తి స్వరూపభూత ఆనందబింబముతోఁ నిద్రాద్వారాగా లయించినదగుచు ఆనందమయమని చెప్పబడుచున్నది.

(6.) ఆయానందమయరూపజీవుడు, తనపూర్వజన్మమందలి పుణ్యా పాపకర్మననుసరించి, మరలజాగ్రిదాదికమును బొందుచున్నా డనిశ్రుతిచెప్పుచున్నది.

శ్రు॥ పునశ్చ జన్మాంతరకర్మ యోగాత్స
ఏవజీవస్స్వపితిప్రబుద్ధః॥

[కైవల్యశ్రుతివాక్యము.]

(7.) సుషుప్తియందు అద్వైతత్వము, స్వప్రకాశత్వముసుఖము, ఆనం దము, గలవని సిద్ధాంతము.

(8.) వ్యాధిమొదలగువాటిచేత బాధపడువాడు, సుషుప్తియందు ఆబాధను అనుభవించకపోవుట సర్వానుభవసిద్ధము.

(9.) సుషుప్తినుంచి మేల్కొని లేచినవాడు. "నేను హాయిగా నిద్ర పోతిని; ఆ నిద్రలో నేనేమియునెఱుగను" అని సుఖ అజ్ఞానము లను రెంటిని స్మరించుచున్నాడు.

(10.) నిద్రాకాలమందు విజ్ఞానమయ స్వరూపమునకు, ఆనందమయ స్వరూపమునకు, నాశము లేదు. ప్రబోధకాలమునకు ఇవి ఘనీ భవించివుండి, ప్రబోధముకలగడముతోనే, తనపూర్వపుస్థితిని స్మరించుటకు శక్తికలుగును. అందువల్లనే, నిద్రనుంచిలేచిన వాడు నేనుసుఖముగా నిద్రించినాననియు, నాకేమియు తెలియ లేదనియు, జెప్పకలుగుచున్నాడు.

(11.) సుషుప్తియందు అనుభవింపబడిన బ్రహ్మానందముయొక్క సంస్కారము జాగ్రద్దాదియందును తూష్ణీంభావస్థితి యం దున్నుగలదు.

(12.) ఆసుఖము, ఘనీభవించిన అజ్ఞానముచేతగప్పబడుటవలన, వాసానా నందమని శ్రీవిద్యారణ్యగురుండువుపదేశించిరి. 11ప్ర.శ్లో 85

(13.) నిద్రారంభమందును,నిద్రాంతమందును,బ్రహ్మానందముయొక్క అనుభవముగలదు. నిద్రారంభమునకు ముందు, ఆ ఆనం దముకొఱకు సుఖసాధనములను సంపాదించుచున్నాడు. నిద్రాం

తమందు, సుఖసాధనములను విడుచుటకు, నశక్తులై, తూష్ణీం భావమును బొందుచున్నారు. ఆనందము లేదని చెప్పుటకు వీలు లేదు. ఇదే వాసనానందము.

(14.) అయితే. ఈ అనందము బ్రహ్మమని యెరుగుటచేతనే కృతార్థులగుదురు. అట్టిజ్ఞానము—అనగా, అవాఙ్మానసగోచరమైనట్టియు సర్వజ్ఞ సర్వాత్మరూపమగు బ్రహ్మమును, గురుశాస్త్రములను విడచి, మరియేయుపాయముచేతను, నెవ్వడు నెరుంగజాలడు. నేనుకృతార్థుడనైతిననెడిబుద్ధి, గురుశాస్త్రములవలన, ఎప్పుడు గలుగునో, అప్పుడుజ్ఞానమునకు సంపూర్ణత్వముగలుగునని ఉపదేశింపబడినది.

(15) సుషుప్త్యాదియందు, అహంకారవిలయముకలుగుటచే, ఆయవస్థయందు దేహముభూమిమీదపడుట కనబడును. బ్రహ్మనిష్ఠయందు దేహము భూమిమీదపడమివలనఅహంకారము లయించలేదని తెలియవలెను. సుషుప్తియందు అజ్ఞానము ఘనీభవించి నశించకయుండును. బ్రహ్మనిష్ఠయందు అజ్ఞానము సుతరాం నశించియుండును. ఈరెంటికి ఇదే భేదము,

(16) ఏకాలమందు ద్వైతము స్ఫురించదో, నిద్రయుతాదో, ఆస్థితియందు అనుభవింపబడెడిసుఖము, బ్రహ్మనందమని శ్రీభగద్గీతా శాస్త్రమందు చెప్పబడినట్లు వేదాంతపంచదశియందు చప్పబడినది. గీ. 6–25, 26, 27, 20, 21, 22, 23, 28.

(గీతాసారోద్ధారములోని 167, 168, పేజీలు చూడుడు; బ్రహ్మనందము యొక్క స్వరూపముచూపబడినది.)

వే. పం. ॥ప—శ్లో 100

(17) సుషుప్తియందు అనుభవింపబడిన ఆనందమును, సర్వప్రాణివర్గము, పూర్వకర్మములచేత ప్రేరేపింపబడి, క్రమముగా మఱచి జాగ్రదాదిఅవస్థయందు స్థితినిబొందుచున్నది.

## 4 బ్రహ్మానందముయొక్క స్వరూపము, తైత్తిరీయోపనిషత్తు, అష్టమానువాకములో 15 మంత్రములచేత చెప్పబడినది,

బ్రహ్మానందముయొక్క అంశయే, లౌకికానందమున్నూ అగుచున్నదని సిద్ధాంతము. పరబ్రహ్మము ఆనందస్వరూపుడుగనుక, అట్టి ఆనందము ఇట్టిదని యూహించుటకు లౌకికమగు మానుషానందము దృష్టాంతముగా చూపబడినది.

(1) మానుషానందము

సాధువైనవాడును, మంచియౌవనముగలవాడు, సాంగాధ్యయనమొనర్చినవాడు, ఏపనినైనను అవలీలగా త్వరలో చేయువాడు మంచి ప్రవర్తనముగలవాడై, మనస్సంబంధములైన గాని దేహసంబంధమైనగాని, రోగములు లేనివాడును, విద్వాంసుడై బలిష్ఠుడై జగమంతయు ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలునట్టి సార్వభౌమునకుగల యానందము, ఒక మానుషానందమనబడును. (శ్రీశంకరానందవిరచిత ఆత్మపురాణమునందలి శ్లో॥ 277 మొ॥ 280లుచూడుము)

(2) అట్టిమనుష్యానందముకంటె 100 రెట్లు, మనుష్యగంధర్వానందమనియు;

(3) దానికంటె 100 రెట్లు దేవగంధర్వానందమనియు;

(4) దానికంటే నూరురెట్లు చిరలోక పితౄనందమనియు;

(5) దానికంటే 100 రెట్లు అజానజదేవానందము;

(6) దానికంటే 100 రెట్లు కర్మదేవానందము;

(7) దానికంటే 100 రెట్లు దేవానందము;

(8) దానికంటే 100 రెట్లు ఇంద్రానందము;

(9) దానికంటే 100 రెట్లు బృహస్పత్యానందము,

(10) దానికంటే 100 రెట్లు ప్రజాపత్యానందము;
(ప్రజాపతి యనగా త్రైలోక్యశరీరుడగువిరాట్పురుషుడు)
(11) దానికంటే 100 రెట్లు హిరణ్యగర్భానందము;
అని శ్రుతిచెప్పుచున్నది.

హిరణ్యగర్భుడనగా వ్యష్టిసమిష్టి రూపుడగు సూత్రాత్మ. ఇత డీశరీరులలో ప్రథముడు "హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే" అనివేదము చెప్పుచున్నది. ఈ ఆనందము కంటే శ్రేష్టమైనది, బ్రహ్మానందము. అదివాగ్మనస్సులకు అగోచరము. గనుక, శ్రుతిహిరణ్యగర్భానందము, సముద్రతుల్యమగు బ్రహ్మానందమందుబిందువుతో సమానమని సూచించినది. సముద్రమునకు సముద్ర జల బిందువునకు అభేధమెట్లో, అట్లే ఆనందమునకు. ఆనందికి, అభేదమును గ్రహించవలెను.

బ్రహ్మానందమును అనుభవించుటకుసాధనములు, 1. సదాచారము. 2. అకామహతత్వము. 3. శ్రోత్రియత్వము, అని శ్రుతిచెప్పుచున్నది. అనగా అవిగలిగిన బ్రహ్మవేత్తకే బ్రహ్మానందము అనుభవసిద్ధము. పైచెప్పినగుణములు గలవానికి, సమస్తఆనందములుగలవని శ్రుతిచెప్పుచున్నది.

అవిద్యతోటి సంబంధము ఏమాత్రములేనిదియే స్వాభావికమగు పరిపూర్ణానందము. ఇట్టియానందమే అద్వైతము.

అకామహతుడనగా— మనుష్యవిషయికమయిన విషయభోగములందు ఆసక్తిలేనివాడు.

శ్రోత్రియుడనగా— సాంగవేదాధ్యేత.

అకామహతుడు, శ్రోత్రియుడు, అగువానికి, పైచెప్పిన ఆనందములు వుండును.

సదాచారము.

సదాచారమువలన శారీరక,మానసిక స్వాస్థ్యము కలుగును. సదాచారమునకు మూలము ధర్మము; ధర్మమనగా శాస్త్రీయ

విధులనాచరించుటయే; మనుష్యునియందు పశుధర్మములు (ఆలోచించకుండా పనిచేయుట.) పోవుటకుగాను శాస్త్రాచారములు ఉద్దేశింపబడినవి: ఆకలి, కోరిక, నిద్ర, యెప్పుడు కలిగితే అప్పుడు తీర్చకూడదు; శాశ్వతారోగ్యము శాస్త్రీయ సంతాపము, ఇవియే శాస్త్రవిధియొక్క ప్రయోజనములు.

ఇహలోకసుఖపరిజ్ఞానము ఆయుర్వేదమునుండియు, పరలోకసుఖపరిజ్ఞానము, ధర్మశాస్త్రములనుండియు; గ్రహించవలెను.

శ్లో॥ ఆచారాల్లభతే హ్యాయురాచారాదీప్సితాః ప్రజాః
ఆచారాద్ధనమక్షయ్యమాచారోహంత్య లక్షణమ్॥(మనువు)

నిత్యకర్మలుచేయకుండా, అనేక తక్కిన సత్కార్యములను ఆచరించినను వానికి సద్గతికలుగదని బోధాయనుడు పలుకుచున్నాడు.

శ్లో॥ యస్యనిత్యాని లుప్తాని తథైవాగంతుకానిచ
సుపథస్తోఽపినస్వర్గం గచ్ఛేత్తు పతితోహసః॥

శ్రుతిస్మృతికర్మలను చేయలేకపోతే సదాచారమునైనను అవలంబించవలెను.

శ్లో॥ శ్రౌతం కర్తుమశక్తశ్చేత్స్మార్తంకర్మసమాచరేత్॥
తత్రాప్యశక్తః కరణే సదాచారం లభేద్బుధః॥

శ్లో॥ ఆచారహీనం, నపునన్తి వేదాః॥

## 5. జాగరణావస్థయందు బ్రహ్మానందమును ఎరిగెడి యుపాయములు. విషయానందము.

ద్వారభూతమగు ఈవిషయానందముచేత, బ్రహ్మానందములోనికి ప్రవేశించవలెను.

శ్లో॥ విషయానంద ఏతేన
ద్వారేణాంతః ప్రవిశ్యతాం॥

15_శ్లో 34

(1.)విషయానందము బ్రహ్మానందముయొక్క అంశమని శ్రుతి జెప్పుచున్నది. 15అ,శ్లో1

(2.)విషయానందము, బ్రహ్మజ్ఞానమున కుపయోగికారిగానుండుట చేత, మోక్షశాస్త్రమందు చెప్పబడుచున్నది.

(3.)స్రక్చందన వనితాదులందు, సర్వప్రాణులు, అనుభవించే ఆనందము, విషయానందము. బ్రహ్మముయొక్క స్వరూపభూత పరమానందముయొక్క—అనగా బ్రహ్మానందముయొక్క లేశమైయున్నది.

(4.)ఆబ్రహ్మము—పరమాత్మ—ప్రతిశరీరమందును,ప్రతిబింబించి నదై బింబరూపముగానున్నాడని కఠశ్రుతి, "శ్లో॥ రూపం, రూపం బభూవాసౌ ప్రతిరూపఇతి శ్రుతిః॥" 15అ,6శ్లో—చెప్పెను. బ్రహ్మసూత్రకారులు "అత ఏవచోపమా సూర్యకాదివత్॥" అనెడిసూత్రమునందు, ఉదకమున ప్రతిఫలించిన సూర్యాదుల నుపమానముగా జెప్పెను. అనగా నుదకములో ప్రతిఫలించిన సూర్యబింబమువలె, మాయాకార్యమైన ప్రతి శరీరమందును, పరమాత్మవున్నట్టు చెప్పినారు.

శ్రు॥ బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా అనెడి శ్రుతివలనవినబడుచుండెడి బింబ భూతమగు ఆనందమును, బ్రహ్మలక్షణ యోజనతోటి, బ్రహ్మత్వముచే నెరిగినవాడాయెను. ఆనందమయకోశమునుబట్టి బ్రహ్మమున్నదని—అనగాబ్రహ్మకుగుర్తుగా తెలుసుకొనెను. అనగా ప్రతిబింబమునుబట్టి బింబమున్నదని వూహించుట; బింబ మనగా ఆనందబింబ స్వరూపము; ఆబింబమే బ్రహ్మస్వరూప మనినిశ్చయించినారు.ప్రతిబింబమున్నచోటల్లాపరిచ్ఛిన్నత్వమే॥

(5.)మనస్సే అవిద్య; మనస్సేబుద్ధిగాను, చిత్తముగాను, అహంకారముగాను, పరిణమించుచున్నది. మనస్సు మూడుగుణములుగలది—సాత్త్వికము, రాజసము, తామసము. మనస్సుయొక్క రాజస తామసవృత్తులయందు దుఃఖముగలదు. సాత్త్వి

కాదివృత్తులతో నైక్యము జెందుటవలన—బ్రహ్మమును, మిశ్రమని జెప్పబడినది. అనగా బ్రహ్మము పరమానందస్వరూపుడైనను, మాయాసంబంధమువలన సుఖ దుఃఖముల ననుభవించుచున్నట్లు కనుపించుచున్నాడు.

(6.) పరమాత్మయొక్క సచ్చిదానంద స్వరూప మొక్కటియైనను బుద్ధియొక్క సాత్త్వికవృత్తులయందుస్పష్టముగాను, రాజసతామస వృత్తులయందు అస్పష్టముగాను, ఒకేచంద్రుడు నిర్మల జలమునందు, మలినజలమునందువలె, స్పష్టాస్పష్టముగా గనబడును. అ15_శ్లో8

(7.) కామ్యలాభములుకలిగినప్పుడుమనోవృత్తులు, అంతర్ముఖములై ఆబ్రహ్మముయొక్క ఆనందమును పొందుచున్నవి. అనగా అప్పుడుబ్రహ్మానందస్ఫురణ బాగుగ స్ఫురించును. అ15.శ్లో19

(8.) ఇట్లు అవిద్యారూపత్రయస్థితిగలిగియున్నను, పురుషుడు బ్రహ్మమును ధ్యానించవచ్చును. మిథ్యారూపమైన జగత్తునువిడిచి, బ్రహ్మమును ధ్యానించవలెను. శిలాది జడపదార్థమందలి నామరూపములనువిడిచి, సర్వవ్యాపక బ్రహ్మరూపమగు సద్రూపమునుమాత్రముచింతింపవలెను. రాజసతామసవృత్తులయందు,సత్యజ్ఞానస్వరూపమైన సర్వవ్యాపక బ్రహ్మమున్నదని తెలుసుకొనవలెను. సాత్త్వికవృత్తులయందుసచ్చిదానందమయ బ్రహ్మమును తెలుసుగొనవలెను. ఇతడే బ్రహ్మవేత్త. ఈస్థితియే మోక్షము.

(9.) విషయవృత్తిలేని తూష్ణీంస్థితియందు స్ఫురించెడి బ్రహ్మధ్యానము నధికమైనది. ఇదియే నిర్వికల్పకసమాధి. అ15_శ్లో29

(10.) అమిశ్రబ్రహ్మము—నిర్గుణబ్రహ్మము— ఆత్మానాత్మవివేకమువలన,చిత్తనిరోధరూపమైనయోగాభ్యాసమువలన,ద్వైతమిథ్యానుసంధానముచేత, ఈ మూటిచేత తెలియబడును. (11, 12, 13, ప్రకరణములు] అనగా, సాత్త్వికవృత్తులు, రాజస

తామసవృత్తులు, అనగా, సచ్చిదానందమునకు భేదమును కలిగించెడి, యుపాధులునివర్తించుచున్నవి. అనగా, విద్యాదశయందు, సచ్చిదానందబ్రహ్మము కేవలవస్తుమాత్రరూపత్వమునుబొంది వకటిగా ప్రకాశించును.

ఓం తత్సతు.

ఇది విషయానందము—సమాప్తము,

---

# యోగానందము

(1.) నిర్మలచిత్తముగలవాడు, సంసారమును నివర్తించుకొని స్వస్వరూపభూతబ్రహ్మానందమును బొందుచున్నాడు.11ప్ర—శ్లో114

(2.) ఎండుగడ్డిపఱకలును, దూదియు, నగ్నియందు వేయబడి దహింపబడినయట్లుబ్రహ్మవేత్తయొక్క—పుణ్యాపాపకర్మలన్నియు జ్ఞానాగ్నిచేత దహింపబడుచున్నవి.

శ్రు॥ తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయే
నైవం హాస్యసర్వే పాప్మనః ప్రదూయంతే॥

శ్లో॥ ఉపపాతకేషు సర్వేషు॥
పాతకేషు మహత్సుచ॥.

(3) నిరోధ సమాధ్యభ్యాసయోగముచేత చిత్తమునకు నిర్మలత్వముకలుగుచున్నది.అట్టియోగాభ్యాసముచేత, అహమాదివృత్తికి ఎంతయంతవిలయముకలిగి, చిత్తమునకు సూక్ష్మత్వముకలుగుచున్నదో, అంతంత, నిజానందము స్ఫురించుచుండును.

(4) కాలినపుల్లలయందు, అగ్నిజ్వాలలుపోయి, తేజోరూపమైన అగ్నిమాత్రము, నిలచియుండినట్లు, చిత్తనిరోధసమాధ్యభ్యాసమువలనఅంతఃకరణయందు, రాజసాదివృత్తులు పోయినప్పుడు, సత్వముమాత్రము శేషించుచున్నది.

ఆ.॥ శ్లో॥ 111

(5) ఆసత్వగుణప్రధానాంతఃకరణయందు నిజానందముఅగుయోగానందము స్ఫురించును.

(6) పండితుడు, ఇంద్రియములను విషయములనుండి మరలించి మనస్సునందుంచవలెను. ఆ ఇంద్రియసహిత మనస్సును, బుద్ధియందుంచవలెను. ఆఇంద్రియ మనస్సహితబుద్ధిని యహంకారమందు(మహత్తత్వమందు)ఉంచవలెను; ఆఇంద్రియమనోబుద్ధిసహితహంకారమును ప్రత్యగాత్మయందుంచవలెను; బ్రహ్మసాక్షాత్కారమేబుద్ధిసూక్ష్మత్వమునకు అవధి.

శ్రు॥ యచ్ఛేద్వాఙ్మనసి, ప్రాజ్ఞస్తద్యచ్ఛేద్ జ్ఞాన,
ఆత్మని, జ్ఞానమాత్మనిమహతినియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాంతఆత్మని॥.

(7) దర్భకొనచేత నొక్కొక్క బిందువునుగా సముద్రజలమునెత్తి బాహ్యప్రదేశమునుతడిపినట్లు, మనస్సుయొక్క నిగ్రహంబును విశేషశ్రమ లేకుండా, క్రమముగా, జేయబడినయడలదీర్ఘకాలమునకైనను సిద్ధించగలదు.

(8) పురుషసంగమమునందువ్యసనముగలవనిత, తనగృహకృత్యములను చేయుచున్నను, ఆసుఖమునే సర్వదా చింతించుచుండును. అటులనే నొకమారు, సమాధివల్ల బ్రహ్మానందనిశ్చయముగలవాడు బ్రహ్మానందమునే భావించుచుండును. శ్లో॥ 119-122

(9) శ్రోత్రాదిసకలేంద్రియములను నిగ్రహించిన ధీరుడు, సంసారవ్యాపారమునువిడిచి, శ్రమలేనివాడై, విశ్రాంతిగలబుద్ధిగలవాడై, సుఖదుఃఖహేతుకాలమందుసహితము, సుఖదుఃఖానుసంధానమునువిడచి, నిజానందాను సంధానమం దెవర్తించును.

శ్లో॥. 126

(10)అగ్నిప్రవేశము చేయవలెనని కోరికగలిగి, అట్లు చేయబోవుడు వానికి శరీర అలంకారాదులయందు కోరికవుండనట్లు

వైరాగ్యాదిసాధనసంపన్నుడగువివేకికిని, బ్రహ్మానుసంధానవిరోధియగు విషయసుఖమందు ప్రీతిగలగదు. శ్లో॥ 127

(11) బ్రహ్మానుసంధానమునకువిరోధిగాని విషయసుఖముగలుగునపుడు, జ్ఞానియొక్క బుద్ధి, ఆవిషయసుఖమునందును, బ్రహ్మానందమునందును, కాకికన్నువలె, ఈవైపునకు, ఆవైపునకు,గమనాగమనములను చేయుచుండును, ఈవిషయానందమును బ్రహ్మానందమందు అంతర్భావము చేసుకొనును. శ్లో॥. 128

(12) బ్రహ్మవేత్త విషయములననుభవించుచు, విషయానందమును శాస్త్రజనిత బ్రహ్మానందమును, రెండుభాషలను తెలిసినవానివలె నెరగినవాడగును. శ్లో॥. 130

13) గంగయందు సగము దేహము తడిసినవానికి, ఏకకాలమందు శీతోష్ణబుద్ధి గలిగినట్లు, జ్ఞాని దుఃఖానుభవకాలమందును నిజానుసంధానమును జేయును. అట్టిఅనుభవము, విరుద్ధముకాదు. అనగా దుఃఖలకామందు కూడా బ్రహ్మానుభవము చెడదు.

(14) గనుక జాగరణావస్థయందు, సుఖదుఃఖానుభవ కాలమందును, తూష్ణింస్థితి యందును బ్రహ్మసుఖమేజ్ఞానికి స్ఫురించును. స్వప్నావస్థయందుగూడ, బ్రహ్మసుఖము,జ్ఞానికిస్ఫురించును.—స్వప్నము, జాగ్రద్వాసనాజన్యమగుట చేత, సదాస్ఫురించును.

(15) స్వప్నము. ఆత్మయందే అవిద్యావాసనాబలమువల్లను' గలుగుచుండును. శ్లో॥. 133

ఓం తత్సత్.

ఇది యోగానందముసంపూర్ణము

# ఆత్మానందము

1 శ్రు॥ నవాఅరే సర్వస్యకామాయసర్వంప్రియంభవతి । ఆత్మనస్తుకామాయసర్వం ప్రియం భవతి.

తా, సర్వభోగ్యరాశి (భార్య, భర్త, పుత్రుడు, ధనము, మొదలగు) యొక్క ప్రయోజనము కొఱకు ప్రేమవిషయముకాదు; భోక్తయగుతనకు సర్వభోగ్యప్రపంచము, ప్రేమవిషయమగుచున్నది. ఉదాహరణలు

శ్రు. నవా అరేపత్యుః కామాయపతిః ప్రియోభవతి;

శ్రు. ఆత్మనస్తుకామాయపతిః ప్రియోభవతి:

శ్రు. నవాఅరేజాయాయైకామాయ, జాయాప్రియాభవత్యాత్మనస్తు కామాయ, జాయాప్రియాభవతి;

శ్రు. నవాఅరేవిత్తస్యకామాయవిత్తం ప్రియంభవ త్యాత్మనస్తుకామాయ విత్తంప్రియంభవతి.

(2.) శ్రు. తదేతత్ప్రేయః, పుత్రాత్ప్రేయో, విత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాదంతరతరం యదయమాత్మా. (పురుషవిధి బ్రాహ్మణం)

తా. పుత్రధనాది సర్వప్రపంచమునకంటెను బుద్ధిరూపగుహాయం మున్నట్టి, ప్రత్యగభిన్న పరమాత్మయొక్క పారమార్థికస్వరూపముమిక్కిలి ప్రీతివిషయమైనది.

(3.) శ్రు. ఆత్మానమేవప్రియముపాసీత । సయఆత్మానమేవప్రియము పాస్తే । నహాస్య ప్రియం ప్రమాయికం భవతీతి.

(సమనంతరశ్రుతివాక్యము.)

తా. ఎవరుసాక్షియగు పరమాత్మను నిరతిశయమైన ప్రేమతోసేవించుచున్నారో, ఆపురుషునికి ప్రత్యగాత్మ-పుత్రాదికము నశించినట్లు-నాశమునుపొందదు. అనగా ప్రత్యగాత్మ నిరతిశయ ప్రే

మకునిషయుడగుట చేత, అట్టిఆత్మయందుప్రీతివృద్ధి పొందిన కొలదియు సర్వదా ఆనందరూపుడగుచు ప్రకాశించుచుండును.

(4) స్వస్వరూపమే పరమప్రేమాస్పదమని తెలుసుకొని, ప్రత్య గాత్మను ప్రేమించువాని కెన్నడును ఏవిధమైన దుఃఖమును సంభవింపదు. అనగా ఆత్మను వున్నదనినమ్మినవాని కిబ్రహ్మ సుఖమేగాని సంసారదుఃఖము లేదు. వే.పం-12అ.శ్లో.71

(5.) పుత్రాదులకుముఖ్యాత్మత్వము గలదని, కొన్నివాక్యములు, కొన్నివాడుకలు, గలవు.

శ్రు॥ ఆత్మావై పుత్రనామాసి.

తా. తానేపుత్రరూపుడైవున్నాడు.

శ్రు॥ నాపుత్రస్యలోకోస్తి.

పుత్రరహితునకు పుణ్యలోకము లేదు.

ఇట్లుచెప్పుటమాత్రముచేత, ఆత్మతాను ఎవ్వనికిని శేషి యెగాని శేషముగాడు. – అముఖ్యుడుగాడు. ప్రత్యక్షముగా తనకు, తనపుత్రునకు భేధముకనుపించుచున్నది. పుత్రాదులకు గౌణాత్మత్వము గలుగును; ముఖ్యాత్మత్వముగలుగనేరదు. పంచకోశములు ఆత్మగాకపోయినను, అవియాత్మయనిభ్రమజెందుచున్నారు. (స్థాణువును జూచి దొంగయనిరాత్రిళ్లు భయపడినట్లు) అందువలన అవిమిధ్యాత్మనబడును. సర్వముమాయాకల్పితమగుటచేత, సాక్షికి బుద్ధియువిరోధికాదు. దేహాదులకు ప్రత్యగాత్మ సాక్షిభూతుడు. సర్వాంతరత్వముచేత,స్ఫురించుచుండుటచేత ప్రత్యగాత్మకేముఖ్యాత్మత్వమని ధ్వాంతపరచబడినది.

శ్రు॥ బ్రాహ్మణో బృహస్పతి సవేనయజేత॥

శ్రు॥ రాజారాజ సూయేన యజేత॥

శ్రు॥ వైశ్యోవైశ్య స్తోమేన యజేత॥

ఇట్లు వారివారికి తగిన యజ్ఞమునందు ముఖ్యాత్వము కలుగు చున్నది. ఈవిధముగా ఆయావస్తువుయొక్క ప్రయోజన విశేషమువలన ప్రీతివిషయత్వాది రూపముకలుగుచున్నది.

(6.) ప్రత్యగాత్మ అధికప్రీతి విషయుడగును; తనకు భోగసాధన పదార్థముప్రీతివిషయమగును, వ్యాఘ్రసర్పాదికము ద్వేష విషయమగును. గడ్డిపోరక మొదలగువస్తువ ఉపేక్షావిషయ మగును. ఇది శ్రుతిసమ్మతము. ఈనాలుగు విధములకంటె అన్యమగు వస్తువులేదు. ఈవిధముగా మైత్రేయీ బ్రాహ్మణ మందు చెప్పబడినది.

(7.) విషయసుఖమందుగలప్రీతి, మరియొక విషయసుఖముప్రాప్తించి నప్పుడు, మొదటిదానిని విడిచిపోవుచున్నది. ప్రత్యగాత్మయందలిప్రీతి మరియొక సుఖాపేక్షగలదికాదు. గనుక నిరతిశయ సుఖముగలుగుచున్నది. కొంతమందికి చావవలెనని ఇచ్ఛగలగ వచ్చును; గాని అప్పుడు నశించునది దేహమేగానిఆత్మకాదు. శ్రుతులుఆత్మకు నిరతిశయప్రీతి విషయత్వమును ప్రతిపాదిం చుచున్నవి. ప్రతిప్రాణియుతనకెప్పటికినాశనముకలుగకూడదని న్నితానుశాశ్వితముగా వుండవలయుననిన్నికోరుచున్నాడు. ఇది సర్వులకు అనుభవమైన విషయము. ప్రతివాడు, తనఆత్మను, నిరతిశయప్రీతివిషయముగా, చూచుచున్నాడు.

శ్రు. ప్రియంత్వాంరోత్స్యతి॥ అనేవేదవాక్యము, వకపక్షమున శిష్యునకుబోధరూపమవును. అనగాపుత్రుడు తాను నశించుటచేత, అతనియందుగలప్రేమదుఃఖరూపముగా పరిమళించును గనుక, అట్టిప్రేమముఖ్యాత్మకాదు, అనిసూచించుచున్నది. మరియొక పక్షమున, జ్ఞాని, అజ్ఞానిని దూషించినట్లు తెలుసుకొనబడు చున్నది; అనగా పుత్రాదికమందు ప్రేమను విడువనియెడల నరకప్రాప్తిమొదలగు అనర్థకములు సంభవింపునౌవని శ్రు. ప్రియంత్వాంరోత్స్యతి॥అనేవాక్యముసూచించుచున్నది. వక పక్షమున, తన ఆత్మఅయిన ముఖ్యాత్మ కంటెగౌణాత్మ అయిన

పుత్రాదులే ఎక్కువ అయిన వారని గురు వయిన నాతో శిష్యు డవైన నీవు పోట్లాడితే నీకు ప్రియమైన కొడుకో పెళ్లాముగాని చచ్చిపోతుందని శాపముగా గురువు శిష్యునకు ఇచ్చినట్లు సూచించుచున్నది.

గనుక అశాశ్వితవస్తువులను ప్రేమించువాడు చెడును. స్వస్వరూపమునందే ప్రేమగలిగి, స్వస్వరూపసాక్షాత్కారమును బొందినవాడు ముక్తుడుఅగును.

13అ. 68శ్లో,

10. యోగాభ్యాసమువలె, వివేకద్వారా, అనగా గౌణాద్యాత్మత్వ విచారణవలనను; పంచకోశవిచారణవలనను, అపరోక్షజ్ఞానము వివేకులకును, యోగులకును, జ్ఞానద్వారామోక్షలక్షణఫలము, యేకమేనని, శాస్త్రము చెప్పుచున్నది.

శ్లో. యత్సాంఖ్యైఃప్రాప్యతేస్థానం తద్యోగైరపిగమ్యతే।
ఇతిస్మృతింఫలైకత్వంయోగినాంచవివేకినాం.

12అ. 82 శ్లో.

(11.) చిత్తనిరోధముగల యోగి—ఆత్మానాత్మవిచారముగల వివేకి. ఉభయులు—

1. రాగద్వేషాదులు సమానము. వృశ్చికాదులయందు ద్వేషము వుభయులకు సమానము.

2. వ్యవహారదశయందు, ద్వైతస్ఫురణసమానము.

3. యోగికి సమాధిదశయందు ద్వైతస్ఫురణలేనట్లు, శ్రుతియుక్తుల చేత ఆత్మానాత్మవిచారణచేసిన వివేకికిని, వివేకదశయందు ద్వైతస్ఫురణము లేదు.

12ప్ర శ్లో. 87

వివేకికి ద్వైతస్ఫురణములేనివిధము 12వ అధ్యాయమందు చెప్ప బడినది. యోగికిగలశుభమంతయు, వివేకికినిగలదు.

(12.) సర్వదాస్వస్వరూపభూత ఆనందాత్మానుభవముగల వాడగుచు యోగి, జగత్స్ఫురణము లేకుండును. ఆత్మానాత్మవివేకమును సంపూర్ణముగాను, అనుభవరూపముగాను తెలుసుకున్న వివేకియు, యోగివలె బ్రహ్మానందమందే స్థితిగలిగియుండును.

ఓం తత్సంత్.

ఇది ఆత్మానందము సంపూర్ణము

# అద్వైతానందము

బ్రహ్మాత్మైకత్వజ్ఞానము—బ్రహ్మస్వరూపము అనగా ఆనంద స్వరూపము —ప్రకృతియొక్క, అనగా మాయయొక్క స్వరూపము—వీట్లనుగురించి, వెనుకటి పేరాలలో చెప్పబడినది. ప్రస్తుతవిషయము ...అద్వైతానందము—నుగురించి, విచారణ చేయుటకు, పైవిషయము జ్ఞానము అత్యంతావసరమైయున్నది. వాటినిజ్ఞప్తిలోనుంచుకొనవలయును. అద్వైతానందము, దృఢమైన ద్వైతమిథ్యాజ్ఞానమువలన గలుగుచున్నది.

(1.) మృత్తికఘటమున కుపాదానకారణమైనట్లు, ఆనందబ్రహ్మము జగంబునకుపాదానకారణము. ఆత్మ (ఆనందము) కుమ్మరివలెనిమిత్తకారణమున్ను ఉభయమున్నుతానే; రెండవది లేదుగనుక;

(2.) నిజముగానున్నది ఆనందస్వరూపమైన బ్రహ్మమైనను, బ్రహ్మయందలి మాయాశక్తివలన, ఆబ్రహ్మమేజగద్రూపేణా ప్రకాశించుచున్నాడు. ఇదియే వివర్తము.

(3.) కార్యమగు ఘటాదికము మిథ్య. మృత్తిక సత్యత్వంబుగలది. మాయాశక్తి,దానికార్యము, అనగానామరూపజగత్తుమిథ్యలు. వీటికి, ఆధారవస్తువ, బ్రహ్మము అధిష్ఠానము—సత్యత్వము గలది. జగత్తు బ్రహ్మమందు కల్పితము.

.) అద్వైతసిద్ధాంతమందు, ఆనందస్వరూపుడైన ఆత్మకంటె, నన్య మైన సర్వప్రపంచము మిథ్యయనెడి నిశ్చయజ్ఞానమువలన, అద్వితీయానందానుభవలక్షణముగల పురుషార్థము సిద్ధించు చున్నది.

.) సర్వంబునకు ఉపాదానకారణమగు అద్వితీయబ్రహ్మము యొక్క జ్ఞానంబువలన, తత్కార్యంబగు సర్వప్రపంచజ్ఞానంబు గలుగుచున్నది. శ్రు॥ ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్॥

.) మనుష్యాదిభూతంబులన్నియు, ఆదికాలమందు బుట్టమిచేత; మధ్యకాలమందు గనబడుటచేత; యంత్యకాలమందునశించుట చేత; మరలలేకపోవుచున్నవని శ్రీకృష్ణభగవానులు గీతా శాస్త్రమందు చెప్పెను. అనగా—ఆద్యంతములయందు లేనిది మధ్య లేనిదని యర్థము.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యానిభారత
అవ్యక్తనిధనాన్యే వేత్యాహ కృష్ణోర్జునంప్రతి॥13అ—69శ్లో.

7.) జగత్తునన్నవి నామరూపములే; అవికల్పితములు; వాటికి వాస్తవస్వరూపములేదు. ఉత్పత్తివినాశములతో గూడియున్నవి

8.) ద్వైతమిథ్యాజ్ఞానమును, నామరూపముల యనృతత్వమును, ఎంతదృఢముగా గ్రహింపబడునో, అంతగాబ్రహ్మసాక్షాత్కా రమగును. బ్రహ్మసాక్షాత్కారమెంతంతగలుగునో, అంతంత నామరూపములు విడువబడును. శ్లో.81

9.) ద్వైతమిథ్యాభ్యాసముచేతను, ప్రపంచ అనాదరణాభ్యాసము చేతను, బ్రహ్మాభ్యాసముచేతను, అట్టిఅభ్యాసము చేయుపురు షుడు, ఈశరీరమును ధరించియున్నను, బ్రతికియుండియేసంసార బంధవిముక్తుడగుచున్నాడు.

(10.)బ్రహ్మాభ్యాసమనగా:—సర్వకాలములందు, సర్వావస్థలయందు బ్రహ్మస్వరూపమునే ప్రసంగించుట, ధ్యానించుట, బోధ చేయుట, శ్రవణముచేయుట, బ్రహ్మస్వరూపమునందే చిత్తము నేకాగ్రముగానుంచుట, బ్రహ్మాభ్యాసమనబడును,

శ్లో. తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనం
ఏత దేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥ శ్లో, 83

(11.) పరిచ్ఛిన్నమైన జీవునియందున్న నిద్రాశక్తి దుర్ఘటములైన పదార్థములను సృష్టించుచుండగా, అపరిచ్ఛిన్నమై పూర్ణమైన పరబ్రహ్మమందున్న మాయాశక్తిమిథ్యయైనను, జగత్తును సృష్టింపగల శక్తిగలిగి యున్నదనుటయందు ఆశ్చర్యమేమియు లేదు. నిద్రాశక్తికే యట్టిసామర్థ్యముండగా మాయాశక్తిని గూర్చి చెప్పవలసినదిలేదు. శ్లో.89

(12) సర్వప్రపంచమును బుద్ధిచేత నుపేక్షించి చూచినయెడల, సచ్చిదానందరూపంబగు సర్వాధిష్ఠాన పరబ్రహ్మము ఎరుగబడుచున్నది. ఇది నిర్విషయ బ్రహ్మ సాక్షాత్కారోపాయము.

(13.) అద్దమునందు అనేకవస్తువులతో నిండియున్న యాకాశము ప్రకాశించునట్లు, సచ్చిదానందస్వరూపమైన బ్రహ్మమునందు, ఈప్రపంచము తోచుచున్నది. అద్దమునుచూడక అద్దములో ప్రతిఫలించినవస్తువులను చూచుట కలుగదు. అలాగే, సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మ ప్రతీతిగానిది నామరూపజ్ఞానమున్ను కలుగదు.

(14!) పెద్దబండరాయిపైగా నీరెంతపారుచున్నను, బండరాయి స్థిరముగా యెట్లుకదలకయుండునో, అట్లే, జ్ఞాని, తనయొక్క బుద్ధి నామరూపముల వ్యవహారమందు తిరుగుచున్నను, పరబ్రహ్మస్వరూపముగానే నుండును. 13_100

(15). అద్వైతానంద స్వరూపబ్రహ్మమునందు మనస్సును యెల్లప్పుడు నిశ్చలముగా విశ్రమింపజేయవలయును.

ఓం తత్సత్.

ఇది అద్వైతానందము

సంపూర్ణము.

## విద్యానందము

(1) క్రమముగా యోగాభ్యాసము, ఆత్మవిచారణము, ద్వైతమిథ్యా నిశ్చయమునుగలిగి, బ్రహ్మానందముగలవానికి, విద్యానందమును, గూర్చి చెప్పబడుచున్నది.

(2) విద్యానందము బుద్ధివృత్తిరూపమే; దుఃఖాభావాది రూపముగా నాల్గువిధములు.—(1) నేను దుఃఖము లేనివాడను; (2) సర్వకామప్రాప్తుండను; (3) నేనుకృతకృత్యుండను; (4) నేనుప్రాప్తప్రాప్యుండను; అని బుద్ధిచేత అనుభవరూపముగా గ్రహించి ఆనందరూపమును బొందుట. ఇది విద్యవలన అనగా ఆత్మానాత్మ జ్ఞానమువలన గలుగును. అందువల్లనే యీవిధముగా గ్రహించినఆనందమునకు విద్యానందమని శ్రీవిద్యారణ్యస్వాములు నామమిడిరి.

(3) ఆత్మచైతన్యమునకు స్థూలసూక్ష్మకారణశరీరములతో ఏకత్వభ్రాంతి కలుగుటవలన, చిత్తునకు—చైతన్యమునకు—భోక్తృత్వము కలిగినది. ఆభోక్తయే జీవుడు.

(4) జీవాత్మ శరీరత్రయముకంటె అన్యుడు; శరీరత్రయము ఉపాధిగల ప్రతిబింబస్వరూపుడు; ఈజీవునకు బింబము పరమాత్మ. అతనికి భోక్తృత్వము వుండజాలదు. పరమాత్మసచ్చిదానందస్వరూపుడు; నామరూపాత్మ జగంబుకంటె నన్యుడు. ఆ పరమాత్మ భోగ్యరూపత్వముగల నామరూపజగత్తుకంటె వేరు.

(5) జీవాత్మయొక్క అసలుస్వరూపము అసంగకూటస్థచైతన్యమని నిశ్చయముగా తెలుసుకున్న తరువాత కామించెడువాడు లేనందున జ్ఞాని, స్థూల, సూక్ష్మ కారణ శరీరములకు సంబంధించిన జ్వరాదులను పొందడు.

(6) జ్ఞానిఅయినపురుషుడు సర్వప్రపంచమును మిథ్యయని తెలుసుకొని, ఏభోగ్యమును ఇచ్ఛగింపడు. ఇట్లు జ్ఞానికి ఐహికదుఃఖ

ము లేదు. పాపము చేసినానననిన్నీ, పుణ్యము చేయలేదననిన్నీ, రెంటియందుగల చింతయు వుండదు. అందువలన ఐహికాము ష్మిక దుఃఖమున్ను జ్ఞానికి కలుగదు.

(7) 'అహం బ్రహ్మాస్మి' అనెడి జ్ఞానముగలవానికి ఆగామికర్మ సంబంధము వుండదు. బ్రహ్మతత్త్వజ్ఞానమువలన సంచితకర్మ రాశియంతయు నశించుచున్నది. ప్రారబ్ధవశమువలన చేయు మహాపాపములవలనగూడా జ్ఞానిబద్ధుడుగాడు; అతనిదుఃఖకాంతి యైనను నశించదు.

(8) శ్రు॥ ఆత్మానంచేద్విజానీయాదయమస్మీతి పూరుషః ॥ కిమి చ్ఛన్కస్యకామాయ శరీర మనుసంజ్వరేత్॥.

తా. పురుషుడు, స్వప్రకాశానందరూపపరమాత్మనేనైతినని, తనను తెలుసుకున్న యెడల ఏఫలమునిచ్ఛయించినవాడగుచు ఏభోక్త యొక్క, ప్రీతికొరకు, దేహము తపించుచుండగా, తపించునో! అనగాపరమార్థమందు భోగ్యరూపమగు మాయాకల్పితమైన ద్వైతము తోపమిచేత, పురుషుడు తపించడు. దుఃఖముండదు. ఆనందమునే అనుభవించుననిభావము.

(9) శ్రోత్రియుడై సుఖియగు జ్ఞానికి సర్వకామప్రాప్తియు, సర్వభో గములు ఏకకాలమందే కలుగుచున్నవి. వే.పం. 14ప్ర-శ్లో.21

(10) సర్వజీవానందంబులును పరబ్రహ్మముయొక్క స్వరూపభూత మగు ఆనందాంశములగుటచేతను, నట్టియానందంబులన్నియు బ్రహ్మజ్ఞానియందుగలవు.

(11) జ్ఞాని తన ఆనందాకారబుద్ధికి సాక్షిగానుండి ఆనందియగుచు న్నాడు; ఆలాగేసర్వదేహబుద్ధులకు సాక్షిగానుండుట చేత సర్వ దేహకామభోగములు గలవాడగుచున్నాడు. శ్లో 35

(12) పంచకోశరూపగుహయందు గల బ్రహ్మమును ఎవరెరుగుచు న్నారో వాడుసర్వ కామములంబొందుచున్నాడని శ్రుతిజెప్పు

చున్నది.

శ్రు॥ యోవేదనిహితంగుహాయాంపరమేవ్యోమన్ । సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణావిపశ్చితేతి.॥
(తైత్తిరీయకశ్రుతి.)

(13) నేనుకామరూపినై సర్వలోకములయందు సంచరించుచు సర్వభోగముల ననుభవించుచున్నాననియు, భోగ్యంబును, భోక్తయునే నే యగుదుననియు–ఇట్లు దన సర్వాత్మకత్వమును, జ్ఞానియగువాడు గానముచేయుచున్నట్లు సామవేదవాక్యముచేత వినబడుచున్నది.

శ్రు॥ ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యను సంచరన్ । అహామన్నమహామన్నమహామన్నమన్నా దోహమన్నాదో హామన్నాదః॥ (సామవేదవాక్యము)

(14) జ్ఞానికికృతకృత్యత్వము గలదు. తత్త్వజ్ఞానోదయమైనతరువాత, అతనికి సాంసారికఫలేచ్ఛవుండదు. బ్రహ్మానందము సాక్షాత్కరించుటచేత, పూర్వపుకృషియాగ వేదాంత శ్రవణాదిక మంతయు జేయబడినట్లాయెను. అనుష్ఠింపదగినదిలేదు. చేయదగినదంతయు జేయబడినట్లాయెను. ఇదియే కృతకృత్యత్వము. వే–పం–14వ అధ్యాయము 40 మొ: 53శ్లో వరకు కృతకృత్యత్వము విపులముగా చెప్పబడినది. భిక్షాహారాది లౌకికవ్యవహారము, జపసమాధ్యాదిశాస్త్రీయవ్యవహారము, పతివ్రతాహింసాది వ్యవహారమైనను గలగ వచ్చును. అందుచేతబాధలేదు.

శ్లో. దేవార్చనస్నానశౌచ... శ్లో 55

శ్లో విష్ణుంధ్యాయతు... శ్లో 57

ఇట్లుజ్ఞానికృతకృత్యత్వము చేత తృప్తునిజూచి.

(15) ప్రాప్తప్రాప్యత్వముచేత తృప్తుడగుచు, తన మనస్సుచేత ఆనందమును స్మరించుచున్నాడు.

14 ప్ర-శ్లో 59 మొ 64 వరకు

మహాజ్ఞాని వేదాంతశాస్త్రమును, తనగురువును, అద్వైతాత్మతత్త్వవిజ్ఞానమును, అనేకవిధముల, ఆశ్చర్యాకారముగ పొగడుచు, తనసుఖము గొప్పదని సంతోషించుచున్నాడు.

ఇట్లువిద్యానంద ముదయించెడి పర్యంతము, బ్రహ్మాభ్యాసము చేయువలెను.

ఇదివిద్యానందము 5వ ఆనందము సంపూర్ణము

ఓం తత్సత్

---

# బ్రహ్మవిద్య

## ఎనిమిదవ ప్రకరణము

## శ్రీ వేదాంతమహావాక్యరత్నములు



1. శ్రు॥ ఇచ్ఛాద్వేష సముత్థేన, ద్వందమోహేనజంతవః। ధరావివరమగ్నానాం, కీటానాంసమతాంగతాః॥ (సామ;సన్న్యాస)
ధరావవిరమగ్నానాం = భూమియందలి రంధ్రములందు దిగబడియున్న.

2. శ్రు॥ అజ్ఞానోపహతో బాల్యే, యౌవ్వనే వనితాహతః। శేషేకళత్రచింతార్తః, కింకరోతినరాధమః॥. (సామ–౭౧ మహా ౬)

3. శ్రు॥ అనుభూతింవినా, మూఢో, వృథాబ్రహ్మణి మోదతే। ప్రతిబింబితశాఖాగ్ర,ఫలాస్వాదనమోదవత్॥.
(సామ; 2౯;మైత్రేయ అ2)

అనుభూతింవినా, = బ్రహ్మానుభవములేక. వృథాబ్రహ్మణి = వేదాంతశాస్త్రమునుచదివినంత మాత్రమున

4. శ్రు॥ మనఏవమనుష్యాణాం, కారణంబంధమోక్షయోః। బంధాయవిషయాసక్తం,ముక్త్యైనిర్విషయంస్మృతం॥. (అన్నివేదములలోను శు–యః; కృ–యః; సామ; అధర్వ)

5. శ్రు॥ నిత్యానిత్యవస్తువిచారా, దనిత్యసంసారసుఖదుఃఖ, విషయసమస్తక్షేత్రమమతా, బంధఃక్షయోమోక్షః॥.
(శ్రు–యః–3౮ నిరాలంబ)

6. శ్రు॥ విజ్ఞేయోఽక్షరతన్మాత్రో, జీవితం చాతిచంచలం ।విహాయ శాస్త్రజాలాని, యత్సత్యం తదుపాస్యతాం॥ (శు—య; శ్రీ పైంగల అ 3)

తా॥ ఆయుష్కాలము మిక్కిలి అస్థిరమైనది. అక్షరస్వభావుడైన ప్రత్యగాత్మ తెలిసికొనదగినవాడు. కావున శాస్త్రపఠనము మాని, సత్యమైన కూటస్థాత్మనుయెరిగి యుపాసనచేయవలయును.

7. శ్రు॥ ఆత్మాన మాత్మనాసాక్షా, ద్బ్రహ్మబుద్ధ్వా సునిశ్చలం । దేహజాత్యాది సంబంధాన్, వర్ణాశ్రమ సమన్వితాన్, వేద శాస్త్రపురాణాని, పదపాంసు మివత్యజేత్ ॥ (కృ—య; బ్రహ్మ విద్యాఉ.)

తా॥ నిశ్చయాత్మికయగు బుద్ధిచే తననుతానే ప్రత్యక్షముగ బ్రహ్మముగ దృఢముగ తెలిసికొని, వర్ణాశ్రమములతోగూడిన, దేహము, జాతి మొదలైన సంబంధములను, వేదశాస్త్రపురాణములను, పాదధూళివలె, విడువవలయును.

8. శ్రు॥ సుప్తేరుత్థాయ, సుప్త్యంతం, బ్రహ్మైకం పరిచిన్త్యతాం॥ (కృ—య ॥ వరాహ)

తా॥ నిద్రనుండిలేచి, నిద్రపోవువరకు, గలకాలమున, నిరాసక్తి లేక, బ్రహ్మమునే ధ్యానింపవలెను.

## ఆత్మస్వరూపవాక్యములు

9. శ్రు॥ ఇదంసర్వం॥ యదయమాత్మా. (అథర్వ—శు—య)

తా॥ ఏదిఈసర్వమో (అది)ఈఆత్మయే.

10. శ్రు॥ చిదేకరసోహ్యాయమాత్మా। ఓతోహ్యాయమాత్మా॥. (అథర్వ—నృసింహోత్తరతాపినీ)

11. శ్రు॥ అఖండైక రసోహ్యాయమాత్మా। నిర్గుణస్సాక్షీభూతోనిష్క్రియోనిరవయవోయమాత్మా॥. (అథర్వ—ఆత్మ)

12. శ్రు॥ ఏకోదేవస్సర్వభూతేషు, గూఢస్సర్వవ్యాపీ, సర్వభూతాంతరాత్మా॥. (కృ—య—శ్వేతాశ్వతర;కృ— య – బ్రహ్మ)

13. శ్రు॥ ద్వైతాద్వైతస్వరూపాత్మా। ద్వైతాద్వైతవివర్జితః।నిష్ఫలాత్మా నిర్మలాత్మా। బుద్ధాత్మా పురుషాత్మకః॥.

(కృ—య— తేజోబిందు)

## బ్రహ్మస్వరూపవాక్యములు

14 శ్రు॥ ఆనందోబ్రహ్మ. శ్రు॥. సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ. శ్రు. సత్, చిత్, ఆనందం బ్రహ్మ. శ్రు॥ ప్రజ్ఞానంబ్రహ్మ. శ్రు॥ సర్వప్రకాశకంబ్రహ్మ. శ్రు॥ సర్వంఖల్విదంబ్రహ్మ.
15. శ్రు॥ అయమాత్మాబ్రహ్మ. 16. శ్రు॥సర్వంహ్యేతద్బ్రహ్మ.
17. శ్రు॥ విజ్ఞానమానందంబ్రహ్మ. 18. శ్రు॥స్వయంప్రకాశంస్వయంబ్రహ్మ. 19. శ్రు॥ ఏకమేవాద్వితీయంబ్రహ్మ. 20. శ్రు॥సగుణనిర్గుణస్వరూపకంబ్రహ్మ. 21. శ్రు॥ఆదిమధ్యాంతశూన్యంబ్రహ్మ.
22. శ్రు॥ మాయాతీతం, గుణాతీతంబ్రహ్మ.
23. శ్రు॥ అసావాదిత్యోబ్రహ్మ. అసౌ = ఈ; ఆదిత్యః = సూర్యుడు.
24. శ్రు॥ యదిదంబ్రహ్మపుచ్ఛాఖ్యంసత్యజ్ఞానాద్వయాత్మకం॥.
తా॥బ్రహ్మపుచ్ఛమనిచెప్పబడిన ఇది ఏదియో అదిసత్యజ్ఞానాద్వితీయస్వరూపమైనది.

25. శ్రు॥ బ్రహ్మణోన్యదహంనాస్తి। బ్రహ్మణోన్యత్ఫలంనహి। బ్రహ్మణోన్యత్త్రణంనాస్తి। బ్రహ్మణోన్యత్పదంనహి॥.
అహం = అహంవృత్తియైనబుద్ధి॥ ఫలం = బ్రహ్మమును తెలిసికొనుట తప్పఇతరకార్యములను జేసినఫలములేదు. పదం = స్థానము; గతి.
26. శ్రు॥ జీవఏవ సదాబ్రహ్మ ॥ స్వయంబ్రహ్మసనాతనః॥
27. శ్రు॥ విద్యావిద్యాదిభేదేన । భావాభావాది భేదతః । గురుశిష్యాదిభేదేన । బ్రహ్మైవప్రతిభాసతే॥

# సర్వస్వరూపవాక్యములు

28 శ్రు॥ ఆత్మైవాధస్తాత్, ఆత్మోపరిష్టాత్, ఆత్మాపశ్చాత్, ఆత్మా పురస్తాత్ । ఆత్మాదక్షిణతః, ఆత్మోత్తరతః, ఆత్మైవేదం సర్వం॥ (సామ-ఛాందో)

29 శ్రు॥ స్వయంబ్రహ్మ స్వయంవిష్ణు స్స్వయమింద్ర స్స్వయంశివః స్వయంవిశ్వ మిదంసర్వం । స్వస్మాదన్యం నకించన॥
(శు-యు; అధ్యాత్మ.)

30 శ్రు॥ సర్వంచ ఖల్విదంబ్రహ్మ । నిత్యం చిద్ఘనమక్షతం । సమస్తం ఖల్విదంబ్రహ్మ సర్వమాత్మే దమాతతం॥.
సర్వమ్ + ఆత్మా + ఇదమ్ + అతతమ్. (సామ-మహో)

31 శ్రు॥ బ్రహ్మమాత్ర మిదంసర్వం, బ్రహ్మమాత్ర మసన్నహి॥ బ్రహ్మమాత్రం వ్రతంసర్వం, బ్రహ్మమాత్రం, రసం సుఖం॥
అసత్ = శూన్యము; నహి = కాదు, అసత్ = బ్రహ్మేతరమైన యసత్తు; నహి = లేదు. రసం = అనుభవము.

32 శ్రు॥ బ్రహ్మమాత్రం శ్రుతం సర్వం, స్వయం బ్రహ్మైవ కేవలం।

బ్రహ్మైవ సర్వచిన్మాత్రం, బ్రహ్మమాత్రం జగత్త్రయం॥.
శ్రుతం = సమస్తవేదాంత శ్రవణమున్ను; స్వయం = తాను,
చిన్మాత్రం = చిన్మాత్రమైన.

# జీవబ్రహ్మైక్యవాక్యములు.

33 శ్రు॥ త్వం బ్రహ్మాసి॥
(అథర్వ-మహానారాయణ)

34 శ్రు॥ అహం బ్రహ్మాస్మి॥
(శు-యు; బృహ; అథర్వ-మహానారాయణ)

(35) శ్రు॥ ప్రజ్ఞానంబ్రహ్మ॥ (ఋగ్వే—ఐతరే యోపనిషత్తు)

(అ) శ్రు॥ యేనేక్షతే శృణోతీదం, జిఘ్రతివ్యాకరోతిచ, స్వాద్వస్వాదూ విజానాతి, తత్ప్రజ్ఞానముదీరితం (కృ—యు—శుకరహస్య)

తా. నేత్రాది ఇంద్రియములద్వారా బాహ్యమునకు వ్యాపించిన యంతఃకరణవృత్తులతో గూడిన యేచైతన్యముచేత చూచు చున్నాడో, వినుచున్నాడో, వాసన చూచు చున్నాడో, రుచిని అరుచిని ఎఱుగుచున్నాడో, వాగింద్రియముచే వ్యవహ రించుచున్నాడో, ఆ చైతన్యము ప్రజ్ఞానమని చెప్పబడుచున్నది.

(ఆ) శ్రు॥ చతుర్ముఖేంద్ర దేవేషుమనుష్యాశ్వగవాదిషు। చైతన్యమేకం బ్రహ్మతః, ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి॥ (కృ—యు—శుకరహస్య)

తా. సప్తభూతములందున్న యాచైతన్యమే బ్రహ్మము—నాయం దున్న చైతన్యమే బ్రహ్మమే యగును.

36 శ్రు అహం బ్రహ్మాస్మి. (శు—యు—బృహదారణ్యకము)

(అ) శ్రు॥ పరిపూర్ణఃపరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిణి। బుద్ధేస్సాక్షిత యాస్థిత్వా, స్ఫురన్నహమితీర్యతే॥ (కృ—యు—శుకరహస్య)

తా. అంతటనునిండియున్న పరబ్రహ్మము,జ్ఞానసంపాదనకుదగిన, ఈదే హామందు బుద్ధికిసాక్షిభావముచేత ఉండిప్రకాశించుచు నేనని చెప్పబడుచున్నది.

(ఆ) శ్రు॥ స్వతఃపూర్ణఃపరాత్మాత్రి,బ్రహ్మశబ్దేనవర్ణితః।అస్మీత్యైక్యపరా మర్శస్తేన బ్రహ్మభవామ్యహం॥

తా స్వాభావికముగ, అంతటనిండియున్న పరబ్రహ్మము, ఈవాక్య మందు బ్రహ్మ యను[illegible]ముచే చె[illegible]. అస్మీతి—అగుచు చున్నాను అనుపదము ఏకత్వముతెలుపున [illegible]. ఆహేతు వుచే,అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మము. భవామి = అగు చున్నాను.

37 శ్రు॥ తత్త్వమసి. (సామవేదమందలి—ఛాందోగ్యమందున్నది.)

(అ) శ్లో॥ ఏకమేవాద్వితీయం సన్నామరూపవివర్జితం, సృష్టేఃపురాధునా ప్యస్య తాదృక్త్వంతదితీర్యతే॥

తా. సృష్టికిపూర్వమందు, నామరూపములు లేనిదియు, ఒక్కటియేయైనదియు, తనకంటె రెండవది లేనిదియునగు, ఏసద్వస్తువుకలదో ఆసద్వస్తువునకు, ఇప్పుడును (సృష్టియైనతరువాత) అట్టిధర్మమును, తత్ అనుపదముచే చెప్పబడుచున్నది.

(ఆ) శ్లో॥ శ్రోతుర్దేహేంద్రియాతీతం, వస్త్వత్రత్వం పదేరితం। ఏకతాగ్రాహ్యతేసీతి, తదైక్యమను భూయతాం॥

తా. వినువానియొక్క (ముముక్షువైన శిష్యునియొక్క) దేహేంద్రియములకతీతమై, వానికిసాక్షిగానుండు చైతన్యమను వస్తువు త్వం అనుపదముచే చెప్పబడుచున్నది. ఐక్యము, ఈవాక్యమందు 'అసి' యను పదముచే గ్రహింపబడుచున్నది. ఆయైక్యము అనుభవింపబడుగాక.

38 శ్రు॥ అయమాత్మాబ్రహ్మ. (అధర్వణవేదము—మాండూక్యము)

(అ) శ్లో॥ స్వప్రకాశా పరోక్షత్వమయ మిత్యుక్తితోమతం। అహంకారాది దేహాన్తః ప్రత్యగాత్మేతిగీయతే॥. (కృ. యు; శుకరహస్య)

తా. 'అయం' అనుమాటవలన, స్వప్రకాశమును ప్రత్యక్షత్వమును అంగీకరింపబడును. అహంకారమాదియును దేహామంతిముగాగల ప్రపంచములోనుండుట వలన ప్రత్యగాత్మయని చెప్పబడుచున్నది.

(ఆ) శ్లో॥ దృశ్యమానస్య సర్వస్య, జగతస్తత్త్వమీర్యతే బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మస్వప్రకాశాత్మరూపకం॥

తా. కనబడుచున్న సమస్తప్రపంచమునకు—జగత్తునకు—అధిష్ఠానమైనవస్తువు బ్రహ్మయనుశబ్దముచే చెప్పబడుచున్నది ఆబ్రహ్మముప్రకాశాపరోక్షములుగల ప్రత్యగాత్మనే.

39 శ్లో॥ మాయావిద్యే విహాయైవముపాధీపరజీవయోః, అఖండసచ్చిదానందం పరబ్రహ్మైవలక్ష్యతే॥ (శు—యు; అధ్యాత్మ)

తా. భాగలక్షణావృత్తిచే, పరమాత్మ జీవాత్మలకు ఉపాధులైన మాయావిద్యలను విడువగ, ఖండముగాక పరిపూర్ణమైనదియు, సత్యజ్ఞానానందమైనదియు, పరబ్రహ్మమొక్కటియే కనబడుచున్నది.

40 శ్లో॥ సకారోధ్యాయతే జంతుర్హకారోహి భవేద్ధ్రువం॥ (సామ: యోగచూడామణి—)

తా. సకారవాచ్యుడైనజీవుడు ధ్యానించుచున్నాడు; ఆహేతువుచేత హకారవాచ్యమైన బ్రహ్మము, నిశ్చయముగనగుచున్నాడు. (కీటకము భ్రమరము చేయుచున్నధ్వనిని వినుచు తదేకధ్యానమున భ్రమరమగుచున్నది.)

## విధివాక్యములు.

41 శ్లో॥ ఆత్మానమేవ వేదాహంబ్రహ్మాస్మీతి॥. తా॥ నేను బ్రహ్మమును అగుచున్నాను, అని ఈతీరున; తననే తెలిసికొనుచున్నాడు.

42 శ్లో॥ సచ్చిదానందమాత్మాన మద్వితీయంబ్రహ్మభావయేత్॥. (సామ—3 వ జాబాలిక)

తా॥ సత్యమైనది, జ్ఞానమైనది, నిరతిశయప్రేమస్వరూపమైనదియునగు ఆత్మను, తనకంటె రెండవది లేనిదగు బ్రహ్మముగా భావింపవలెను.

గమనింపు:— అవస్థాత్రయమందును బాధింపబడక, సంవిత్తున్నందున నది సత్యమగును. కావున నది సత్తనబడును. ఇతర సహాయము లేక తనంతట ప్రకాశించుచు సర్వము నెఱుగుచున్నందున, సంవిత్తు జ్ఞానమనబడును ఉపాధియందుండి నేననుశబ్దమునకు వాచ్యమై నాకెప్పుడును నాశము లేకుండుగాక యని ప్రేమస్వరూపముగ నున్నందున నానందమన బడును.

ఇట్లే గతాగమ్యము లైన మాసాబ్ద యుగ కల్పములందును, సంవిద్రూపమగు నాత్మ యుత్పత్తినాశములు లేక, స్వయంప్రకాశమానమై యున్నది. పరబ్రహ్మమునిట్టిదే గావున ప్రత్యగాత్మ బ్రహ్మలకు వేదాంతమునం దైక్యము బోధింపబడుచున్నది.

43. శ్రు॥ అహం బ్రహ్మాస్మీత్యను సంధానం కుర్యాత్. (శుక్లయజుర్వేదము.)

తా॥ నేను బ్రహ్మము అగుచున్నాను అని యోజనము చేయవలెను.

(1) శ్రు॥ అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం, జన్మపాపం వినాశయేత్॥.

(2) శ్రు॥ అహంబ్రహ్మాస్మి మంత్రోఽయం, భేదబుద్ధిం వినాశయేత్॥

(3) శ్రు॥ అహం బ్రహ్మాస్మి మంత్రోఽయం, కోటిదోషం వినాశయేత్॥

(4) శ్రు. అహంబ్రహ్మాస్మి మంత్రోఽయంజ్ఞానానందంప్రయచ్ఛతి॥.

(5) శ్రు. సర్వమంత్రాన్ సముత్సృజ్య, ఏతన్మంత్రంసమభ్యసేత్॥.

(6) శ్రు. సద్యోమోక్షమవాప్నోతి, నాస్తిసందేహమణ్వపి।.

(కృ—య— తేజోబిందు)

44 శ్రు॥ సర్వవ్యాపార ముత్సృజ్య, అహంబ్రహ్మేతిభావయ।. అహంబ్రహ్మేతినిశ్చిత్యత్వహంభావంపరిత్యజ॥

(కృ—య— తేజోబిందు)

సర్వవ్యాపార = సర్వఇంద్రియవ్యాపారము; అహంభావం = జీవభావము

45 శ్రు॥ జన్మమృత్యు సుఖదుఃఖవర్జితం। జాతినీతి కులగోత్రదూరగం। చిద్వివర్తజగతోఽస్యకారణం తత్సదాహమితిమౌనమాశ్రయ॥

చిద్వివర్తజగతః— చిద్వివర్తరూపమైన జగత్తునకు.

46 శ్రు॥ పూర్ణమద్వయ మఖండచేతనం। విశ్వభేదకలనాది వర్జితం। అద్వితీయపర సంవి దంశకం। తత్సదాహమితిమౌనమాశ్రయ॥

విశ్వభేదకలనాదివర్జితం = జగజ్జీవేశ్వరాది భేదము లేనిదియు; పర సంవిదంశకం = ఉత్కృష్టమైనజ్ఞానమేయంశముగాగలదియు నగు.

## మననవాక్యములు.

47. శ్లో॥ అహమన్న మహమన్న మహమన్నమ్। అహమన్నాదో హమన్నాదోహమన్నాదః॥

తా॥ బ్రహ్మమే భోజ్యము, భోక్తయు నని యెఱుగవలయును.

48 శ్లో॥ యథాఫేన తరంగాది సముద్రాదుత్థితం పునః। సముద్రే లీయతే తద్వజ్జగన్మయ్యనులీయతే. (సామాన్య దర్శన -౪౦ - ౧౦)

49 శ్లో॥ ప్రాణాశ్చలంతు తద్ధర్మైః। కామైర్వాహన్యతాంమనః ఆనందబుద్ధి పూర్ణస్య మమదుఃఖంకథంభవేత్॥ (ఋ - 42 ఆత్మబోధ)

50 శ్లో॥ నమే బంధోనమేముక్తిః నమేశాస్త్రం నమేగురుః। మాయా మాత్ర వికాసత్వా న్మాయాతీతో హమద్వయః॥ (ఋ - 42 - ఆత్మబోధ)

తా॥ సర్వము మాయచే కల్పించబడినది. మాయావిజృంభణమే; నేను మాయాతీతుఁడను; నాశము లేని వాఁడను గావున నాకు బంధమోక్షములు లేవు; శాస్త్రము లేదు; గురువు లేదు; నేననగా బ్రహ్మము.

51 శ్లో॥ బ్రాహ్మణ్యం కులగోత్రేచ నామసౌందర్యజాతయః। స్థూలదేహగతా ఏతేస్థూలాద్భిన్నస్యమేనహి॥ (ఋ-౪౨-ఆత్మబోధ)

52 శ్లో॥ క్షుత్పిపాసాంధ్య బాధిర్యకామక్రోధాదయోఖిలాః। లింగదేహ గతా ఏతే హ్యలింగస్య నవిద్యతే॥ (ఋ-౪౨ ఆత్మబోధ)

53 శ్లో॥ జడత్వప్రియమోదత్వధర్మాః కారణదేహగాః। నసంతిమమ। నిత్యస్య నిర్వికార స్వరూపిణః॥ (ఋ-౪౨ ఆత్మబోధ)

54 శ్లో॥ చిద్రూపత్వాన్నమే జాడ్యం। సత్యత్వా న్నానృతంమమ ఆనందత్వాన్నమే దుఃఖ మజ్ఞానాద్భాతి సత్యవత్॥

తా. సత్యజ్ఞానానందస్వరూపమైన బ్రహ్మమందు నిన్నృతస్వరూప మైనజగత్తుమాయచే కల్పించఁబడినది గాని నిజముగాదు.

55. శ్లో॥ నాహం దేహో జన్మమృత్యూ కుతో మే। నాహం ప్రాణః క్షుత్పిపాసే కుతో మే॥ నాహం చేతః శోకమోహౌ కుతో మే నాహం కర్తా బంధమోక్షౌ కుతో మే॥ (కృ—యు; 33 సర్వసార)

56. శ్లో॥ దేవార్చన, స్నానశౌచ, భిక్షాదౌ వర్తతాం వపుః। తారం జపతు వాక్తద్వత్ పఠత్వామ్నాయమస్తకం॥3.

వపుః—శరీరము; తారం—ఓంకారమును; ఆమ్నాయమస్తకం—ఉపనిషత్తును. (కృ—య78; అవధూత)

57. శ్లో॥ విష్ణుం ధ్యాయతు ధీర్యద్వా బ్రహ్మానందే విలీయతాం। సాక్ష్యహం కించిదప్యత్ర నకుర్వే నాపికారయే॥

ధీః = బుద్ధి యద్వా = లేక; విలీయతాం = లయమవుగాక; అత్ర = ఈచెప్పినవ్యాపారాదికమున; నకుర్వే = చేయుచున్నవాడనుగాను; నాపికారయే = చేయించువాడనుగాను. (కృ—యు; 79 అవధూత)

58. శ్లో॥ నభూతం నభవిష్యచ్చ చింతయామి కదాచన। నస్తౌమి, నచ నిందామి హ్యాత్మనోన్యన్నహి క్వచిత్॥

(అథర్వ;70 అన్నపూర్ణ అ. 5)

నస్తౌమి = స్తుతించువాడనుగాను; నచనిందామి = నిందింపను.

59. శ్లో॥ స్వపూర్ణాత్మాతిరేకేణ। జగజ్జీవేశ్వరాదయః। నసంతి, నాస్తి మాయాచ, తేభ్యశ్చాహం విలక్షణః॥(కృ—య 98వరాహ అ2.)

స్వ = తనరూపముచే. పూర్ణ = అంతటనిండియున్న. ఆత్మాతిరేకేణ = ఆత్మకంటెభిన్నముగా,

60. శ్లో॥ కింకరోమి క్వగచ్ఛామి కింగృహ్ణామి త్యజామికిం। యన్మయా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా॥ (కృ—య; 98వరాహ)

మహాకల్పాంబునా = మహాకల్పాంతమునసముద్రముచేపూరితమైనట్లు; = మయా నాచేత; విశ్వం = ఏవిశ్వము; పూరితం పూరితమైయున్నదో; అందువల్ల ఏమిచేయుచున్నాను; ఎక్కడికి

వెళ్లుచున్నాను; ఏమిగ్రహించుచున్నాను; ఏమివిడుచుచున్నాను.

తా. పూర్ణస్వరూపుడనగు నేను లేని చోటులేదు. గాననాకు చేయుటకుకార్యములేదు. గ్రహించుటకువస్తువును అవయవములును లేవు. విడుచుటకుయేమియును లేదు.

## జగన్మిథ్యావాక్యములు.

61 శ్రు॥ సర్వంవికారజాతంమాయామాత్రం॥.
తా॥సమస్తమును నామరూపవికారములుకలిగి యుద్భవించినది. మాయాస్వరూపమైనది. లేనిదే॥.

62 శ్రు॥మాయామాత్రమిదం ద్వైతమద్వైతంపరమార్థతః॥.(అథర్వణ)

63 శ్రు॥ మాయాకార్యమిదంనాస్తి, మాయానాస్తి భయంనహి॥.
పరంబ్రహ్మాహమస్మీతిస్మరణస్య మనోనహి (కృ—య.
స్మరణస్య = తలచుటకు.

64 శ్రు॥ వంధ్యాకుమారవచనేభీతిశ్చేదస్తిదంజగత్॥.
(అస్తు + ఇదం-వుండుగాక.

65 శ్రు. శశిశృంగేణ నాగేంద్రోమృతశ్చేదస్త్విదంజగత్॥.
(కృ—య—తేజోబిందు)

66 శ్రు. మృగతృష్ణాజలంపీత్వా తృప్తశ్చేదస్త్విదంజగత్॥.
(కృ—య—తేజోబిందు)

67 శ్రు. గంధర్వనగరే సత్యేజగద్భవతిసర్వదా॥. (కృ—య—తే.

68 శ్రు. మాసాత్పూర్వం మృతోమర్త్యో హ్యాగతశ్చేజ్జగద్భవేత్॥
(కృ—య)

69 శ్రు. గోస్తనాదుద్భవంక్షీరం పునరారోపణే, జగత్। జ్వాలాగ్నిమండలేపద్మవృద్ధిశ్చేజ్జగదస్త్విదం॥. (కృ—య)

70 శ్రు. జ్ఞానినోహ్యుదయంముక్తైర్జాతంచేదస్త్విదంజగత్.(కృ—య.)

71 శ్రు. అథమత్త్వౌజగన్నాస్తి హ్యాత్మకుక్షౌజగన్నహి॥.

సర్వదాభేదకలనం ద్వైతాద్వైతం నవిద్యతే॥. (స్కృ-యు.

72 శ్రు. నాస్తినాస్తిజగత్సర్వంగురుశిష్యాదికంనహి। సచ్చిదానందమా త్రోహమనుత్పన్నమిదంజగత్ ॥. (స్కృ-యు)

## అవశిష్ట స్వరూపవాక్యములు.

73 శ్రు. సర్వవిశేషం నేతినేతీతి విహాయ యదవశిష్యతే తదద్వయం బ్రహ్మ. (శు-యు; 53 అద్వయతారక)
సర్వవిశేషం = సమస్తదృశ్యపదార్థమును.

74 శ్రు. సర్వవేదాంత సిద్ధాంతసారం వచ్మి యథార్థతః। స్వయం మృత్వా స్వయంభూత్వా స్వయమేవావశిష్యతే॥ (స్కృ-యు; 6 కర) వచ్మి = చెప్పుచున్నాను. మృత్వా = బ్రహ్మ మగుతాను చచ్చినను (తనయందు కల్పింపబడిన శరీరములందు ప్రవేశింపగ నా శరీరములు నశించునపుడు తాను నశించునట్లు మూఢులకు గనబడుచున్నను); భూత్వా = బ్రహ్మమగుతాను పుట్టినను (తనయందు కల్పింపబడిన శరీరములు పుట్టుచుండగా తానుపుట్టుచున్నట్లుగనబడుచున్నను); స్వయమేవావశిష్యతే = బ్రహ్మమగుతానే శేషించుచున్నాడు.

తా॥ మూఢులకు తాను పుట్టుచు నశించుచున్నట్లు గనబడునుగాని, దేహాత్మబుద్ధి లేని జ్ఞానికి తాను శేషించుటయే తెలియును. 'నాసతోవిద్యతేభావోనాభావోవిద్యతేసతః'. అనుగీతావాక్యము (2-16) చెప్పున సద్వస్తువున కెప్పుడును లేకుండుటయుండదు; అసత్తుకుండుటయుండదు. ఇదియే సర్వవేదాంత సిద్ధాంతము.

## స్వానుభూతి వాక్యములు

75 శ్రు. త్రిషు ధామసు యద్భోజ్యం, భోక్తాభోగశ్చయద్భవేత్ తేభ్యోవిలక్షణస్సాక్షీ, చిన్మాత్రోహం సదాశివః॥ (స్కృ-యు)

12 కైవల్య) త్రిషు = మూడైన; ధామసు = స్థానములందు,జాగ్ర
త్స్వప్నసుషుప్తులందు; సదాశివః = నిత్యమంగళ స్వరూపుడను.
తా॥ జాగ్రత్స్వప్న సుషుప్తులందు భోజ్యభోక్తృ భోగస్వరూపముగ నేదియుండునో దానికి నేనువేరైనవాడను. వాని వృత్తులనెరిగెడి సాక్షిని. చిన్మాత్రుడను. నిత్యమంగళస్వరూపుడను. శరీరత్రయమునకు విలక్షణమైన ఆత్మను.

76 శ్రు. మయ్యేవ సకలంజాతం। మయిసర్వం ప్రతిష్ఠితం। మయిసర్వం
లయంయాతి।తద్బ్రహ్మాద్వయమస్మ్యహం॥ (కృ-య;12 కైవల్య)

77 శ్రు. సత్యానందస్వరూపోహం, జ్ఞానానందఘనోస్మ్యహం। నామ
రూపవిముక్తోహం,మహామానందవిగ్రహః॥ (శు-య; తేజోబిందు)

## జీవన్ముక్తివాక్యము.

78 శ్రు. అహంబ్రహ్మాస్మ్యహం బ్రహ్మాస్మ్యహంబ్రహ్మేతినిశ్చయః।
చిదహం చిదహంచేతి సజీవన్ముక్త ఉచ్యతే॥ (కృ-య; తేజోబిందు)
తా॥ తానేబ్రహ్మమనియు, ప్రత్యగాత్మయనియు తలచువాడు జీవన్ముక్తుడు. కొందరుజగత్తు, తోచకుండుటజీవన్ముక్తి యందురు. అదిసరికాదు. అదివిదేహముక్తి. తానేబ్రహ్మమను నిశ్చయము గలిగి, జగత్తు ఇంద్రజాలమువలె మిథ్యగా జూచుచుండుట జీవన్ముక్తియనబడును.

## సమాధియనగా

79 శ్రు. జీవాత్మ పరమాత్మైక్యావస్థాత్రిపుటీరహితా। పరమానంద
స్వరూపాశుద్ధచైతన్యాత్మికాసమాధిః॥.(అథర్వ-58శాండిల్య,అ।)

80 శ్రు. మనః ప్రచారశూన్యం పరమాత్మని, లీనం, భవతి॥.
(శు-య, 48 మండలబ్రాహ్మణః;బ్రా2)

## విదేహముక్తివాక్యములు

81 శ్రు ప్రారబ్ధక్షయవశాద్దేహత్రయభంగం ప్రాప్య, పాధివినిర్ముక్త,
ఘటాకాశవత్పరిపూర్ణతా, విదేహముక్తిః. (శు-య)

ఘటాకాశవత్ = ఆఘటాకాశము మహాకాశమునగలిసి పరిపూర్ణమైనట్లు

82. శ్లో. యత్సర్వశాస్త్ర సిద్ధాంతం యత్సర్వ హృదయానుగం

యత్సర్వం సర్వగం వస్తు యత్తత్త్వం తద సౌస్థితః॥

(అధర్వ—70 అన్నపూర్ణఅ5) యత్ = ఏది; సర్వశాస్త్రసిద్ధాంతం = ఈశ్వరుని గూర్చి చెప్పెడి సమస్తశాస్త్రముల యొక్క సిద్ధాంతమో; హృదయానుగం = సమస్త భూత హృదయములం దున్నదో; సర్వం = సమస్తమో; సర్వగం = అంతట నున్నదో; వస్తు = వాస్తవమైనదో తత్త్వం = జగత్తున కధిష్ఠానమైనదో 8 తత్ = అదియేఅయి; అసౌ = ఈవిదేహ ముక్తుడు; స్థితః = ఉన్నవాడు—

తా. శూన్యవాదుల కేదిశూన్యమో; బ్రహ్మవాదుల కేది బ్రహ్మమో; సాంఖ్యుల కేది పురుషుడో; యోగుల కేది ఈశ్వరుడో, శైవుల కేది శివుడో; విజ్ఞానవాదులకు యేది విజ్ఞానమో, కాలవాదుల కేది కాలమో, యేది సమస్తశాస్త్ర సిద్ధాంతమో; యేది సర్వగతమో; యేది జగదధిష్ఠానమో యావస్తువే యీ విదేహ ముక్తుడవుచున్నాడు.

# శ్రీరామతత్త్వమహావాక్యములు.

(83) శ్లో. అథోరాతత్పదార్థ స్స్యాన్మకార స్త్వం పదార్థవాన్, తయోస్సంయోజనమసీత్యర్థే తత్త్వ విదోవిదుః॥ (అథర్వ—శ్రీరామ రహస్య అ2)

టీ. రా = రా యనుఅక్షరము, తత్పదార్థస్స్యాత్ = తత్పదవాచ్యమైనబ్రహ్మము, మకారః = మకారము, త్వంపదార్థవాన్ = మకారము త్వంపదవాచ్యమైనజీవుడు. తయోః = ఆ రెండక్షు

రించేటటువంటి శ్రీదక్షిణామూర్తి స్వాములవారికి నానమస్కారములు.

7 శ్లో॥ రాహుగ్రస్త దివాకరేన్దు సదృశో మాయాసమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూత్సుషుప్తః పుమాన్
ప్రాగస్వాప్స మితిప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీగురుమూర్తయేనమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

తా॥ గ్రహణముపట్టినప్పుడు రాహువుచేత మింగబడ్డసూర్య చంద్రులవలె, మాయచేత కప్పబడ్డ జీవుడైనపురుషుడు, మాయాసృష్టికంటె పూర్వమందు పరమాత్మస్వరూపుడై, నిద్రాకాలమందు (అజ్ఞానంకూడా పేరుకొన్న నెయ్యిలాగుజాగ్రత్కాలమందువలె వికాసించకుండా వుండగా) కేవలఆత్మ స్వరూపుడై, ఆ త్మానందమునుఅనుభవిస్తూవున్నప్పటికి అప్పుడుఆత్మానందములేనివాడై నిద్రనుంచిలేచినతరువాతనేనుసుఖంగానిద్రించినానునాకేమితెలియలేదు, అనేస్మరణకలవాడైయుండును. స్మరణఎప్పుడూఅనుభవపూర్వకమైనది గనుక నిద్రాకాలమందువున్న పరమాత్మతో ఏకమై పరమాత్మ సుఖమును అనుభవించిన పురుషునికే తెలివివచ్చిన తరువాత స్మరణకలుగుతున్నది. కాబట్టి కాలత్రయమందు పురుషుడు ఒక్కడేగనుక సృష్టికంటె పూర్వమందు ఏపరమాత్మవున్నదో, ఆపరమాత్మే తనమాయాశక్తిచేత నానారూపములుగలదిగావున్నట్లుకనబడునుగాని వస్తుతః "ఏకమేవాద్వితీయం"అనేశ్రుతిచేత ఎప్పుడుఒక్కడేసర్వవ్యాపి అయివుండును. ఆకాశమువలె నిరవయవము. ఇటువంటిపరమాత్మ స్వరూపుడైన శ్రీదక్షిణామూర్తిస్వాములవారికి నానమస్కారములు.

8 శ్లో॥ బాల్యాదిష్వపిజాగ్రదాదిషు తథాసర్వాస్వవస్థాస్వపి। వ్యావృత్తాస్వనువర్తమానమహమిత్యంతస్ఫురంతంసదా। స్వాత్మానంప్రకటీకరోతిభజతాంయోముద్రయాభద్రయా। తస్మైశ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే॥

86 శ్రు॥ సదోజ్జ్వలోఽవిద్యాతత్కార్యహీనః, స్వాత్మబంధహార స్సర్వ దాద్వైతరహిత ఆనందరూపస్సర్వాధిష్ఠానచిన్మాత్రో, నిరస్తా విద్యాతమోమోహ ఏవాహంఓం, తద్యత్పరంబ్రహ్మ రామ చంద్ర చిదాత్మకస్సో, హమోం తద్రామభద్ర పరంజ్యోతిస్సో, హమోం. (అథర్వ—౫౫—రామోత్తరతాపినీ)

87 శ్రు॥ తత్పరః, పరమపురుషః, పురాణపురుషోత్తమో, నిత్యశుద్ధ బుద్ధ, ముక్తసత్య, పరమానందానంతాద్వయ పరిపూర్ణః, పరమాత్మా, బ్రహ్మైవాహం, రామోస్మి.

(అథర్వ—౫౫ రామోత్తరతాపినీ; శు—యజు—౧తారసార)

గమనంపు: శ్రీరామపరబ్రహ్మలకు అభేదమునుబోధించుచు నుపాసించు వాడే రాముడని ఈవాక్యము చెప్పుచున్నది.

88 శ్రు॥ రామఏవ పరంబ్రహ్మ, రామఏవ పరం తపః, రామఏవ పరం తత్త్వం, శ్రీరామోబ్రహ్మతారకం॥

అథర్వ—౫౮ రామ రహస్య)

ఓం తత్సత్

# బ్రహ్మవిద్య

## తొమ్మిదవ ప్రకరణము

శ్రీమత్ శంకర భగవత్పాద విరచిత, శ్రీదక్షిణామూర్తి

### స్తోత్రము

1. శ్లో॥ మౌనవ్యాఖ్యా ప్రకటిత పర బ్రహ్మతత్త్వం యువానం। వర్షి
ష్ఠాన్తే వసదృషి గణైరా వృతం బ్రహ్మనిష్ఠైః।
ఆచార్యేన్ద్రం కర కలిత చిన్ముద్ర మానన్ద మూర్తిం। స్వాత్మా
రామం ముదితవదనం శ్రీదక్షిణామూర్తి మీడే॥

తా॥ ఒకానొక సమయమునందు శ్రీదక్షిణామూర్తి స్వాములు వారు, చిన్ముద్రమును ధరించి కేవలము "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అనే శ్రుతిప్రకారము నిరతిశయానంద స్వరూప స్థైర్యధ్యానమందు వున్నసమయమున, మోక్షేచ్ఛగలిగిన సమస్త మైన సనకసనందనాది శిష్యులు నిస్సంసయ పూర్వకముగా ఆత్మతత్త్వమును తెలుసుగో తలచినవారలై వచ్చినప్పుడు, దయచేతను తాను పిన్నవయస్సు ధరించినట్లు తోచబడినప్పటికి, స్వతః వయస్సు జాతివ్యక్తి ద్రవ్యగుణ పరిచ్ఛేద రహిత మైన తనయొక్క పరమార్థ స్వరూపమును, బ్రహ్మనిష్ఠులై వృద్ధులై తన చుట్టూ కూర్చుండి తనను సేవిస్తూ వున్న సమస్త మైన శిష్యులకు

శ్రు॥ "యతోవాచో నివర్తంతే అప్రాప్యమన సాసహా" అనే శ్రుతి ప్రకారము "యేబ్రహ్మని, వాక్కులు మనస్సుతో కూడా తెలుసుకొనలేక మరలిపోతున్నవో" అటువంటిపూర్వోక్తమైన బ్రహ్మతత్త్వమును, ఆశిష్యులయొక్క సర్వసంశయములను, చెప్పుటకు వీలుకానిదియు, మనస్సుకుగోచరము కానిదియు,

అనగా అతిసూక్ష్మతరమైనది యుదుర్లక్ష్యమైనది అనేఅర్థమును ఆత్మనుగురించిస్పష్టముగా, సూచించుచుమౌనముధరించి, సూనవనేభోధించుచున్నపరమాత్మ స్వరూపులైన శ్రీదక్షిణామూర్తిస్వాములవారిని నేనుస్తోత్రంచేయుచున్నానని తాత్పర్యము.

2. శ్లో॥ విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాన్తర్గతం।
పశ్య న్నాత్మనిమాయయా బహిరివో ద్భూతంయథానిద్రయా
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయన్
తస్మై శ్రీగురుమూర్తయేనమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.॥

తా॥ లోకములో ప్రతిమనుజుడు తనయందున్న, అనగా తనలోపలవున్న ఈప్రపంచమునున్ను, తనజీవుణ్నిన్నీ తననిజరూపముల తెలియక పోవడం చేత తనకంటె భిన్నముగానున్ను ఎదురుగా వున్నట్టుగానున్ను సత్యమైనదానినిగానున్ను, చూచుచున్నాడు. దీనికి దృష్టాంతము:— మేడలు, గృహములు, స్త్రీపురుషాదులతో గూడ చిత్రింపబడిన చిత్రపటమును అడుగున పెట్టి పైన అద్దమును పెట్టి లోపలవున్న బొమ్మలను పైనవున్నట్లు ఎట్లు చూచుచున్నామో ఆప్రకారమే అంతా లోపలనేవున్నది. అద్దముపైని ఏమియులేదు. ఇంకొకదృష్టాంతము:— ఒకపురుషుడు తనకు స్వప్నము వచ్చినప్పుడు చూచిన ఆఏనుగ ఆపెద్దపులి ఆమనుష్యులు మొదలైన వాటినన్నిటిని తనకంటెవేరుగావున్నట్టున్ను ఎదురుగుండా పైనవున్నట్టు చూచుతూ, మేల్కొన్న తరువాత అవిఅన్నీ లేనట్టున్ను, తనుఒక్కడేమిగిలివున్నట్టున్ను చూచును. ఇట్లే అధికారి అయినముముక్షువున్ను అవిద్యచేత తనకంటే భిన్నముగా కనిపించే జీవజగత్తులను, గుర్వనుగ్రహము చేత శాస్త్రాభ్యాసానంతరమందు విద్యచేత, తన కంటెఇతరము అంతామిథ్య అవిన్నీ అంతా తనస్వరూపమే అవిన్నీ, తనుఒక్కడేవున్నట్టున్ను తెలుసుకున్నపిదప సమస్తదుఃఖ నివృత్తి కలిగి నిరతిశయానందమును అనుభవించుచూ ఆత్మారాముడై సుఖముగా వుండును. ఈయనే జీవన్ముక్తుడున్ను పరబ్రహ్మ

స్వరూపము. ఇట్టువంటి పరమాత్మస్వరూపమైన శ్రీదక్షిణా మూర్తి స్వాములవారిని నానమస్కారమని, శ్రీశంకరా చార్యులవారు స్తోత్రము చేయుచున్నారని దీనితాత్పర్యము.

3 శ్లో॥ బీజస్యాన్తరివాఙ్కురోజగదిదం ప్రాఙ్నిర్వికల్పంపునః మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతమ్। మాయావీవవిజృమ్భయత్యపిమహాయోగీవయస్స్వేచ్ఛయా। తస్మైశ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే॥

తా॥ మొట్టమొదట ఈప్రపంచము బీజమందు అంకురమువలె, ప్రాదుర్భవించక స్వరూపశూన్యమై, బ్రహ్మయందే తనకుకారణమైన మాయతోగూడా, (కార్యమైన ప్రపంచముసృష్టికంటె పూర్వమందు బ్రహ్మయందు శక్తిరూపేణ) ఏకీభూతమై తిరిగి తను ఉద్భవించతగ్గ సమయమునందు పరమేశ్వరసంకల్పమున తిరిగి ఉద్భవమైనది. ఈప్రపంచమును గారడీవాడుసమస్తపదార్థములను హేలగానిర్మించినట్లున్ను, మహాయోగితనప్రభావముచేత అనేకస్వరూపములను నిమిషంలో ఏప్రకారము స్వేచ్ఛచేత సృజించునో, ఆప్రకారముగా, యేపరమేశ్వరుడు సృజించునో, అట్టిపరమాత్మ స్వరూపుడైన దక్షిణామూర్తిస్వాములకునానమస్కారము.

4 శ్లో॥ యస్యైవస్ఫురణంసదాత్మకమసత్కల్పార్థగంభాసతే। సాక్షాత్తత్త్వమసీతి వేదవచసాయోబోధయత్యాశ్రితాన్।యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తిర్భవామ్భోనిధౌ। తస్మైశ్రీగురుమూర్తయేనమఇదం శ్రీదక్షిణామూర్తయే॥

తా॥ మిథ్యాభూతమైన ఈప్రపంచమందైన ప్రపంచరూపమైనసత్తా, స్ఫూర్తులు, ఈరెండున్ను ఏపరమాత్మ భిన్నములైనవో యేదక్షిణామూర్తిస్వరూపుడైన పరమాత్మ తనశిష్యులకుతత్త్వమసీతి వేదవాక్యంచేత స్వస్వరూపమును బోధించుచున్నాడో;

ఏఆత్మసాక్షాత్కారంవల్ల తిరిగిసంసారమందు జన్మముండదో; అటువంటి దక్షిణామూర్తిస్వాములవార్కి నానమస్కారములు.

5శ్లో॥నానాఛిద్రఘటోదరస్థిత మహాదీపప్రభాభాస్వరం। జ్ఞానంయస్యతు చక్షురాది కరణద్వారా బహిస్స్పందతే। జానామీతి తమేవభా న్తమనుభాత్యేతత్సమస్తంజగత్। తస్మైశ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

తా॥అనేకబెజ్జములుగల కుండలో వున్నదీపము చిల్లులుద్వారా పైకి వచ్చివ్యాపించినట్లు, జ్ఞానరూపమైన పరమాత్మ దశేంద్రియాధ్యక్షుడైన మనస్సుద్వారా పైకి వ్యాపించినపుడు ప్రతిమనుష్యుడు నేను ఈఘటమును తెలుసుకుంటున్నాను అని వ్యవహారంకలవాడగును. గనుక సమస్తప్రపంచము, లోపలస్వతః ప్రకాశించుచున్న ఆత్మమూలకముననే, స్వయంగాప్రకాశించుచున్నది. గనుక సమస్తజగత్తుకు ఆధారస్వరూపుడైనయేపరమాత్మ స్వయంగాప్రకాశించుచున్నదో, ఆపరబ్రహ్మస్వరూపుడైన శ్రీదక్షిణామూర్తిస్వాములవారికి నానమస్కారములు.

6శ్లో॥ దేహంప్రాణ మపీంద్రియాణ్యాపిచలాం బుద్ధించ శూన్యంవిదుః। స్త్రీబాలాన్ధ జడోపమాస్త్వహమితి భ్రాంతా భృశంవాదినః। మాయాశక్తివిలాసకల్పిత మహావ్యామోహ సంహారిణే। తస్మైశ్రీగురుమూర్తయేనమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥.

తా॥దేహము ఆత్మయని కొంతమంది; ప్రాణములే ఆత్మయని మ కొందరు; చంచలమైన బుద్ధి ఆత్మయని మరికొందరు; శూన్యమేఆత్మయనిమరికొందరు; ఈప్రకారంగా కొందరు, స్త్రీలు బాలురితో సమానులయ్యె మూఢులైనవారు, చెప్పుచున్నారు. అవిఏవి ఆత్మకావు. మాయకంటెను, దీనికార్యమైన ప్రపంచమునకంటెను, విలక్షణమైన పరమాత్మవేరేవున్నది. ఈపరబ్రహ్మస్వరూపుడైన, సమస్త మాయా వ్యామోహమును సంహా

రించేటటువంటి శ్రీదక్షిణామూర్తి స్వాములవారికి నానమస్కా-
రములు.

7 శ్లో॥ రాహుగ్రస్తదివాకరేందు సదృశో మాయాసమాచ్ఛాదనా।
త్సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూత్సుషుప్తః పుమాన్
ప్రాగస్వాప్స మితిప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే।
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

తా॥ గ్రహణముపట్టినప్పుడు రాహువుచేత మింగబడ్డసూర్యచంద్రు
లవలె, మాయచేత కప్పబడ్డ జీవుడైనపురుషుడు, మాయాసృష్టి
కంటె పూర్వమందు పరమాత్మస్వరూపుడై, నిద్రాకాలమందు
(అజ్ఞానంకూడా వేరుకున్న నెయ్యిలాగుజాగ్రత్కాలమందువలె
వికాసించకుండా వుండగా) కేవలఆత్మ స్వరూపుడై, ఆత్మానంద
మునుఅనుభవిస్తూవున్నప్పటికి అప్పుడుఆత్మానందములేనివాడై
నిద్రనుంచి లేచినతరువాత నేనుసుఖంగానిద్రించినానునాకేమి తెలి
య లేదు, అనేస్మరణకలవాడైయుండును. స్మరణఎప్పుడూఅను
భవపూర్వకమైనది గనుక నిద్రాకాలమందువున్న పరమాత్మ
తో ఏకమై పరమాత్మ సుఖమును అనుభవించిన పురుషునికే
తెలివివచ్చిన తదువాత స్మరణకలుగుతున్నది. కాబట్టికాలత్ర
యమందు పురుషుడు ఒక్కడేగనుక సృష్టికంటె పూర్వమందు
ఏపరమాత్మవున్నదో, ఆపరమాత్మే తనమాయశక్తిచేత నానా
రూపములుగలదిగావున్నట్టుకనబడునుగాని వస్తుతః "ఏకమేవా
ద్వితీయం" అనేశ్రుతిచేత ఎప్పుడువక్కడేసర్వవ్యాపి అయివుండు
ను. ఆకాశమువలె నిరవయవము. ఇటువంటిపరమాత్మ స్వరూ
పుడైన శ్రీదక్షిణామూర్తి స్వాములవారికి నానమస్కారములు.

8 శ్లో॥ బాల్యాదిష్వపిజాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి। వ్యావృత్తా
స్వనువర్తమానమహమిత్యంతఃస్ఫురంతంసదా। స్వాత్మానంప్రక
టీకరోతిభజతాంయోముద్రయాభద్రయా। తస్మైశ్రీగురుమూ
ర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

తా॥ బాల్య కౌమార యౌవనవార్ధక్యావస్థలయందున్ను, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థయందున్ను, సర్వావస్థలయందున్ను, అవస్థలు క్రమముగా మారినప్పటికీ, ఏయాత్మమూర్తి లేక ఏకరూపమున వుండి ఆఅవస్థలను అనుసరించి నేను నేనని ఆబాలగోపాలంవ్యవహరింపబడుచు ప్రకాశించుచున్నదో అట్టి పరబ్రహ్మస్వరూపుడైన శ్రీదక్షిణామూర్తిస్వాములవారికి నానమస్కారములు.

9 శ్లో॥ విశ్వంపశ్యతి కార్యకారణతయాస్వస్వామిసంబంధతః। శిష్యాచారతయాతథైవ పితృపుత్రాద్యాత్మనాభేదతః। స్వప్నేజాగ్రతివాయ ఏషపురుషోమాయాపరిభ్రామితః। తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే॥

తా॥ లోకములో ప్రతిపురుషుడు, మాయతోకూడి మోహమును పొంది జాగ్రత్ స్వప్నములయందు విశ్వమును సత్యమనినమ్మి తండ్రియని, కొడుకని, గురువని, శిష్యుడని, ప్రభువని, భృత్యుడని నేనుధనికుణ్ని, ఇదిసాధనమనిన్నీ దీనికిఅదికారణమనిన్నీ, దానికి దికార్యమనిన్నీ తానుఒక్కడైనప్పటికితనయందు సమస్తప్రపంచమును భేదముగాజూచుచున్నాడు. అట్టిమాయాకార్యవిరహితుడైన శ్రీదక్షిణామూర్తిస్వాములవారికి నానమస్కారములు.

10, శ్లో॥ భూరంభాంస్యనలో ఽనిలోఽంబరమహర్నాథోహిమాంశుః పుమానిత్యాభాతిచరాచరాత్మకమిదంయస్యైవమూర్త్యష్టకం। నాన్యత్కించనవిద్యతేవిమృశతాం యస్మాత్పరస్మాద్విభోః। తస్మై శ్రీగురుమూర్తయే నమఇదం శ్రీదక్షిణామూర్తయే॥

తా॥ భూమిమొదలయిన పంచభూతములున్నూ, సూర్యుడు, చంద్రుడు జీవుడు, ఈఎనమండుగురు ఏపరమేశ్వరుని అంశలో (భాగములో) శాస్త్రప్రకారం విచారించగా ఆయనకంటే ఇతరముగా ఏదీ వేరుగా ప్రకాశించడంలేదో, ఏకమేవాద్వితీయం అనేశ్రుతిప్రకారం, అంతాతనే ఆకాశమువలె వ్యాపించియున్నాడో, అట్టిదక్షిణామూర్తి స్వాములవారికి నమస్కారము.

11. శ్లో॥ సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం యస్మాదముష్మింస్తవే। తేనాస్య శ్రవణాత్తదర్థమననా ధ్యానాచ్చ సంకీర్తనాత్। సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యాదీశ్వరత్వంస్వతః। సిద్ధ్యేత్తత్పునరష్టధా పరిణతం చైశ్వర్యమవ్యాహతం॥

తా॥ ఈ ప్రపంచము సర్వము ఆత్మస్వరూపమే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే శ్రుతివచనప్రకారమున, వేరొకటి అణుమాత్రమయిన లేదు; ప్రకాశించడం లేదు. "ఆత్మైవేదం సర్వం" అనే శ్రుతిప్రకారమున్నూ ప్రపంచము యొక్క సత్తాస్ఫూర్తులు ఆత్మవే. ఆ పరమాత్మస్వరూపుడే ఈ దక్షిణామూర్తిస్వాములవారు అని స్తోత్రము చేయబడినది. ఈ స్తోత్రమును చదివినవారికి, విన్నవారికి, అర్థం తెలుసుకొని మననంచేసినవారికిన్ని, సమస్తమైన పుత్రపౌత్రాది సంపత్తులు, అఖండైశ్వర్యము, మోక్షము మొదలయిన సమస్త శ్రేయస్సులు శ్రీపరమేశ్వరానుగ్రహము సిద్ధించును.

శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము సమాప్తము.

ఓం తత్సత్

## స్వప్న-జాగ్రత్తలు,

1. సృష్టి దృష్టి వాదులయొక్క అభిప్రాయము. లోపలనున్న ప్రపంచమునే, నేత్రములద్వారా పైకివచ్చి వున్నట్లున్నూ, దానినిజూచి, పైనవున్నట్టుగా మనము వ్యవహరిస్తున్నాము. దీనికి ప్రమాణము విశ్వందర్పణ అనే శ్లోకము.

2. దృష్టి సృష్టి వాదమనగా, పైనచూచిన వస్తువనే, మనము అంతఃకరణాలోనికి తీసుకునివ్యవహరిస్తున్నాము. బయటవున్న మహాప్రపంచకమును లోపల అంతఃకరణచేత గ్రహించుట అసంభవముగనుక, జాగ్రత్ పదార్థములుకూడా, మిథ్యలే యని, తెలుచున్నది. యీయుక్తినే, నతత్రరథాః అనే శ్రుతి అనువదిస్తున్నది.

3. స్వప్నప్రపంచమువలె, జాగ్రత్ ప్రపంచకమునకుకూడా, శ్రుతియుక్తులచేత మిథ్యాత్వమే.

(1) లోపల ఇముడకపోవుటము.

(2)ఆద్యంతములు కలిగియుండుటవకయుక్తి, అనగా, పూర్వ మందువుండదు; అంతమందుకూడా వుండదు. ఆదిమధ్యయందు లేనట్టే. శ్రుతిఅయితే—నతత్రరథా అనే మొదలుగాగలది.

4. స్వర్గములోనికివెళ్లినవారికికూడా, అక్కడవన్నిధృఢముగాకనుపిం చినప్పటికి, యిక్కడ భోగములువలెనే మిథ్యలే. ఇదిస్థానిక ధర్మము.—అనగా,యేప్రదేశము వెళ్లినవారికి,ఆప్రదేశములో వేకనుపించుటస్థానిధర్మము.

5. స్వప్నజాగ్రత్తులయందు చూడబడ్డ వస్తువులన్నియు, చిత్తము చేత చూడబడుటచేత, ఆరెండింటియొక్క లేకపోవడములో, వుదాహరణసమానమే. గనుకచిత్తముచేత చూడబడేవన్నియు మిథ్యలే,చిత్తములేకుండాజాగ్రత్తు లేదు. గనుక, జాగ్రత్తుమిథ్య.

## గౌడపాద కారికలు.

1. ఆగమ ప్రకరణం, వైతథ్య ప్రకరణము, అద్వైత ప్రకరణము, అలాతిశాంతి ప్రకరణము, అని 4 ప్రకరణములు గలవు.

2. ఆగమ ప్రకరణములో మాండూక్యోపనిషత్తులోని వాక్యము లకు సంక్షేపముగా, బ్రహ్మ సత్యం, జగన్మిథ్య అనేదానిని తెలియపరుచుట, వైతథ్య ప్రకరణమందు, జగన్మిథ్య అనే విషయమును బలపరుచును. వైతథ్యమనగా మిథ్య.

అద్వైత ప్రకరణమందు, యీమిథ్య అయిన ప్రపంచకమును, అనేక, యుక్తి, న్యాయదృష్టాంత, దార్ష్టాంతి, కములచేత విపు లపరుచుట. అలాదిశాంతి ప్రకరణమందు, మొదటి 3 ప్రకరణ ములయందు చెప్పబడ్డ విషయమును, అనేక యుక్తి న్యాయ ములచేత, ప్రకారాంతరేణా బలపరుస్తూమూర్ఛ చెప్పుట.

3. సృష్టియావత్తు స్వప్నముతోటి, మాయతోటి తుల్యము; అనగా సుతరాం లేదని తాత్పర్యము వంధ్యాపుత్రునివలె.

4. ముక్తులకు, బాధాయాం సామానాధికరణ్యం అనేన్యాయము చేత, అపవాదే సిద్ధాంతము. ఉపాసకులకు అభేదే సామానాధి కరణ్య మనే న్యాయముచేత, అధ్యారోపమే సిద్ధాంతము.

5. ప్రపంచముపుట్టలేదు. కుండకు, పూర్వము మట్టి వున్నట్టుగా దీనికి పూర్వమందు సదసదాది త్రివిధ కారణములులేవు. బ్రహ్మ అసంగుడు గనుక కారణముగాదు. ప్రపంచము, ప్రకాశించుచున్న దని చెప్పక తప్పదు. అనగా, వంధ్యాపుత్రుడు, స్వప్నగజమువలె, అనిర్వాచ్యమని అర్థము.

6. "తత్త్వమసి" అనేమహావాక్యముచేత, జీవేశ్వరులకు యేకత్వము బోధింపబడినది. ఇదే, బాధాయాంసామానాధి కరణ్యం అనేన్యాయము.

బ్రహ్మాత్మైకత్వము,—అనగా, బ్రహ్మకు, ప్రత్యగాత్మకు, అనగా జీవాత్మకున్ను, అభేదే సామానాధి కరణ్యం; ఇదే అధ్యారోపము.

7. బాహ్యపదార్థములు లేవు. ఆంతరపదార్థములు—అనగా ఆభాసలు—అంతః కరణయందు వున్నవి. అవే, నేత్రేంద్రియముల ద్వారా పైకివచ్చి, బహిః పదార్థములుగా, అనగా సత్యములుగా, గనుపించుచున్నవి. అనగా లేవని అర్థము. గనుక ఆంతర పదార్థములు, బాహ్య పదార్థములు యెప్పుడైతే లేవో, చిత్తముకూడా, అనగా మాయ, అనగా, భ్రాంతికూడా నిరధిష్టాన భ్రమ వుండదు గనుక, తనంతట తానే తగ్గిపోయి,

అనగా, జీవభావము స్వప్నభ్రమముగా పోయి, బ్రహ్మలో నైక్యభావ మునుపొంది, అనగా, బ్రహ్మమై యుండును. ఇదియే సమ్యక్ దర్శనము. గనుక చిత్తముపుట్టలేదు. చిత్తదృశ్యంపుట్టలేదు. ఆభాసమాత్రం; ఇదేవిద్వత్ దృష్టి. చిత్తముపుట్టేది కాదు. లేదు. గౌడపాదాచార్యులువారు సిద్ధాంతపరచినారు.

మూ॥ చిత్తం నసంస్పృశత్యర్థం। నార్థాభాసం తథైవచ। అభూతో హియతశ్చార్థో। నార్థాభాస స్తతః పృథక్. (అలాతి శాంతిప్రకరణము. 26 శ్లో॥

తా॥ బాహ్యార్థములేదు కావున చిత్తముఅట్టి బాహ్యార్థమునుస్పృశించుటయే లేదు. పదార్థమును తాకపోవుటయే కాదు, పదార్థాభాసమును కూడ చిత్తము స్పృశించుటయేలేదు. స్వప్నమునందు వలె జాగరిత దశయందును,చిత్తము పదార్థమునుగాని, పదార్థాభాసమునుగానిస్పృశించుటయేలేదు. చిత్తమేఘటపటాది బాహ్యపదార్థరూపమున గనంబడుచున్నది గాని చిత్తముకంటె వేరుగ నేమియు లేదు.

8. ఆత్మకుబంధమోక్షములు లేవు. స్థూణానిఖన న్యాయముచేత, పూర్వోక్తమైన అంశమునే ప్రకారాంతరేణా తిరిగి విచారణ చేయుచున్నారు.

స్వప్నములో తిన్నవి, జాగ్రత్తలో పుష్టిగావుండవు. జాగ్రత్తలో తినినను, స్వప్నములో, పుష్టిలేనట్లు కనుపించుటకలదు. అందుచేత, జాగ్రత్ స్వప్నపదార్థములు సమానమే. ఫలములేకపోవుటలో రెండూసమానమే.

9. ఒకచిత్తముతోనే, ఒకఆసామియే స్వప్నజాగ్రతలలో, వస్తువు లను కల్పించుచున్నాడు. ఒకఅవస్థలో సత్యమనిన్నీ, స్వప్నావస్థలోనిది అసత్యమనిన్నీచెప్పటన్యాయముకాదు. గనుక రెండూ మిథ్యలే,

10. జాగ్రత్తులో పదార్థములు నిజముగా లేవుగనుకనే, స్వప్నావస్థలో మిథ్యాభూతమైనటువంటి జాగ్రత్తులో చూచిన, పదార్థములను, చూచినట్లు తన్మయుడై యుంటాడు. ఈకారణంచేతనే, మెలుకవవచ్చిన తరువాత, లేకపోవుచున్నవి.

11. జగత్తును సత్యమని, నమ్మి, సదాచారసంపత్తిగలిగినవారికి, జగత్తు మిథ్యయని తెలుసుకొనలేకపోయినప్పటికి, ఉత్తమ పురుషార్థమైన మోక్షము లభించదుగాని, స్వర్గాది ఫలములభించునుగనుక, జగత్ సత్యత్వబుద్ధిస్వల్పదోషము.

శ్లో॥ జాత్యాభాసం చలాభాసం, వస్త్వాభాసం తథైవచ। అజాచల మవస్తుత్వం, విజ్ఞానమ్ శాంతమద్వయం॥. 45 శ్లో (అలాతశాంతిప్రకరణం)

తా॥ లోకమునందేదో వకసద్వస్తువను ఆధారముచేసుకుని, అసద్వస్తువులు ఆరోపితములగుచున్నవి. అట్లే, అజము, అచలము, అవిక్రియము, శాంతము, అద్వితీయము, విజ్ఞానరూపమునగు, ఆత్మతత్వమునందే, జాత్యాభాసము (పుట్టుక లేకపోయినను పుట్టుకవున్నదానివలె తోచుట); చలాభాసము (అచలమైననుచలించునట్లుతోచుట): వస్త్వాభాసము (పదార్థముకాకపోయినను వస్తువవలెకనబడుట);ఆరోపితములగుచున్నవి.

12. చిత్తముపుట్టలేదు; చిత్తమువల్లకల్పించబడేఘటపటాదులుపుట్టుటలేదు. ఈవిధముగా, ఆభాసమాత్రమని తెలుసుకున్నవిద్వాంసులు, సంసారమందుపడరు.

13. శ్లో. ఋజువక్రాదికాభాసం అలాతస్పందితంయథా।
గ్రహణగ్రాహకాభాసం విజ్ఞానస్పందితంతథా॥.

తా॥ కొరివియొక్క త్రిప్పటంవల్లనుంచే, నానావిధమైన రేఖలుయేవిధముగా బయలుదేరుచున్నవో, ఆప్రకారంగానే, బ్రహ్మముయొక్క

మాయవల్లనుంచి, యీజగత్తంతా పుట్టినట్టుగా, సత్యంగా కనుపిస్తున్నది. శ్లో॥47

14. శ్లో॥ అస్పందమానమలాతమనాభాసమజంయథా,
అస్పందమానం విజ్ఞానమనాభాసమజంతథా.॥ శ్లో. 48

తా॥ కొరివి, చలించబడనిదై, రేఖలులేనిదై రేఖాకారముగా యే ప్రకారముగాపుట్టలేదో, ఆప్రకారముగానే, బ్రహ్మము భ్రాంతిలేని దవుతుంటూ, జగత్తు రూపకముగా పుట్టుకలేని దైయుగుచున్నది.

15. శ్లో॥ ననిర్గతాస్తే విజ్ఞానాత్ ద్రవ్యత్వాభావయోగతః।
కార్యకారణతా భావాత్ యతోఽచింత్యాస్సదైవతే॥ 52 శ్లో.

తా. బ్రహ్మవల్లనుంచి, ఘటపటాదివస్తువులు, యదార్థమైన వస్తువులుకాకపోవడము వల్ల, కార్యకారణభావములేదు, గనుక, అనిర్వాచ్యములే, అనగా పుట్టలేదు.

ప్రపంచకము ద్రవ్యము, సత్యము అన్నట్టయితే, ద్రవ్యము వల్లనే పుట్టవలెను ఆత్మ ద్రవ్యము కాదు. రూపనామములు లేనిది. గనుక ప్రపంచకమునకు కార్యకారణ భావములేదు. ఆత్మ, అద్రవ్యము కాదు. ఆత్మ, ఆత్మే. కాలము-దిక్కు, అద్రవ్యములు; ఆత్మ, ద్రవ్యాద్రవ్యములు కాదు. గనుక, కార్యకారణ భావము, ద్రవ్యా, ద్రవ్యములకే గనుక, ఆత్మ వకదానికి కార్యముకాదు. కారణముకాదు.
యీప్రపంచము నకు, కారణములేదు, గనుక, అనగా ఆత్మ కారణముకాదు గనుక, మిథ్యయే యవుచున్నది.

16. వస్తువులు చిత్తమువల్ల పుట్టినవికావు. చిత్తమువస్తువువల్ల పుట్టినదికాదు. చిత్తము వస్తువలు, ఆభాస మాత్రములు గనుక, యీప్రపంచమునకు ఆభాసతప్పయథా

ర్థమైన కార్యకారణభావము లేదని నిశ్చయించినారు. యీప్రపంచకమునకు మోహాపేక్ష రూపకమైన పట్టుదలతప్ప వేరే కార్యకారణ భావము లేదు. మోహరూపమైనపట్టు దల క్షీణించగానే, కార్యకారణ భావముకూడా క్షీణించును. అనగా, బ్రహ్మ సత్యము జగన్మిథ్యయని తాత్పర్యము.

17. మాయామయమైన బీజమువల్లనుంచి, మాయామయమైన అంకురముపుట్టినట్లు కనుపించునేగాని, యదార్థముగా పుట్టుక లేదు; పోవడము లేదు. యీప్రకారముగానే, యీప్రపంచకము మాయామయము గనుక పుట్టాలేదు; చావను లేదు.

18. శ్లో. దుర్దర్శమతిగంభీరమజం, సామ్యం, విశారదం, బుద్ధ్వా, పదము, నానాత్వం, నమస్కుర్మో, యథాబలం॥ శ్లో, 100.

తా. చూడడమున్నకు శక్యముగానిది, అత్యంతగంభీరమైనది, పుట్టనిది, యెప్పుడూ సమభావముకలది నేర్పుకలది, నానాభావము లేనిది ఇటువంటి పదమును— స్థానమును— అనగా బ్రహ్మను, బుద్ధ్వా = తెలుసుకొని, యథాబలం = మనోవాక్కాయ పూర్వకముగా నమస్కుర్మః = నమస్కారము చేస్తున్నాను. త్రికరణ శుద్ధిగా నమస్కారము చేస్తున్నాను.

ఓం తత్సత్.

# కొన్ని వేదాంతశాస్త్రలక్షణములు

జహల్లక్షణ; ఉదాహరణ:—గంగాయాంఘోషః = స్వార్థమైన గంగనువిడిచిపెట్టి, అన్యార్థమైన తీరమును గ్రహించుట.

అజహల్లక్షణ; ఉ:—శ్వేతఃధావతి = స్వార్థమైన తెలుపును విడిచిపెట్టకుండా, శ్వేతత్వ ధర్మవిశిష్టమైనధర్మిని గ్రహించుట.

జహదజహల్లక్షణ; ఉ:—తత్త్వమసీత్యాది వాక్యములయందు తత్ పదమందున్నట్టి సర్వజ్ఞత్వమును విడిచిపెట్టి చైతన్యమును గ్రహించుటయున్నూ; త్వంపదమందున్నటువంటి కించిజ్జ్ఞత్వమును విడిచిపెట్టి, చైతన్యమును గ్రహించుటయున్నూ; ఇట్లు చేసిన యెడల, తత్త్వమసి అనే వాక్యమునకు, ఏకత్వము కుదురును.

లక్షణయనగా వైవిధ్యముగా అర్థము చేయుట.

సామానాధికరణ్యము అనగా, ఏకవ్యక్తి బోధకత్వము.

ఉ:—నీలోత్పలము, అనగా నీలపదము, ఉత్పలపదము ఏకవస్తువనే చెప్పుచున్నది. బాధాయాం, సామానాధికరణ్యం; అభేదే సామానాధికరణ్యం. యీ రెండు న్యాయములు ఏకవస్తువనే మిగుల్చును.

ఓం తత్సత్.

—:—

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 22 | ఛందో | ఛందస్సు |
| 6 | 16 | పరమేశ్య | పరమేశ్వ |
| | 20 | స్యైప | స్వైష |
| | 21 | తనూస్యామ్ | తనూస్వామ్ |
| 7 | 2 | తదర్ఫమన | తదర్థమనన |
| | 3 | నధిధ్యాస | నిదిధ్యాస |
| 8 | 17 | యోగాధికము | యోగాదికము |
| | 23 | విధివధుప | విధివదుప |
| | 24 | పాణయో | ప్రాణయో |
| 9 | 18 | ఉపాద్ది | ఉపాధి |
| 14 | 6 | ధేనవిష్య తే | ధేవలిప్య తే |
| | 4 | ఆసంగమును | అసంగమును |
| | 16 | చాణవత్ | బాణవత్ |
| 15 | 24 | విశుభ్దసత్వాః | విశుద్ధసత్వాః |
| | 25 | శంశంలాకం | శంతంలోకం |
| 16 | 12 | దుఖము | దుఃఖము |
| | 13 | ఉపరత | ఉపరతి |
| | 13 | విత్రపక్తము | విధ్యుక్తము |
| 19 | 5 | నిశ్యపభూతామే | నిశ్వాసభూతామే |
| 21 | 8 | మనాద్యనస్తం | మనాద్యనన్తం |
| | 13 | స్వ్యశక్తితో | సర్వశక్తితో |
| 22 | 14 | ఆబన్ఫః | తాబన్దః |
| | 24 | సమన్త | సమస్త |
| 23 | 12 | సహలాంవాన | సహోవాచ |
| 24 | 4 | నిత్యానంద | నిత్యానందా |
| | 18 | హ్యత్తి | హత్తి |
| 25 | 20 | సజాతి, విజాస్వగత | సజాతి, విజాతి స్వగత |
| 29 | 5 | ఏవా/ విద్యమానా | ఏవాఽవిద్యమానా |
| 32 | 21 | శరపాములకంటె | శరావాదులకంటె |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 36 | 3 | గంగానిమాగ్నార్థ | గంగానిమగ్నార్థ |
| 37 | 19 | అగహణం | అగ్రహణం |
| 38 | 16 | కిలాలుడు | కులాలుడు |
| 39 | 2 | ప్యాత్రర్బ్రహ్మ | ప్యాతద్బ్రహ్మ |
| 40 | 5 | దీంచేత | దీపంచేత |
| 44 | 21 | జేసేదిత్మ | జేసేదిఆత్మ |
| 47 | 28 | వీరుద్ధమైనది | విరుద్ధమైనది |
| 50 | 14 | త్వరాజ్ఞే | త్వరాగ్జ |
| 51 | 10 | భూతసముదా యయు | భూతస ముదాయము |
| 54 | 11 | అధికరణను | అధికరణము- |
| 61 | 4 | అవాఙ్ఞానస | అవాఙ్మానస |
| | 10 | ర్థ్రిష్ణారం | ర్ద్రిష్టారం |
| 63 | 22 | బహాత్మైక | బ్రహ్మాత్మైక |
| 64 | 1 | నాసేశి | నాసేహ |
| | 7 | ఏజింగిశి | ఎతింగిన |
| | 16 | ధర్మన | ధర్మజి |
| 65 | 8 | అన్విష్టఃస్వాత్వ | అన్విష్టస్వాత్వప్రి |
| 68 | 20 | త్రియోశ్చైకం | తయోశ్చైకం |
| | 20 | పరం బహ్మ | పరంబ్రహ్మ |
| 69 | 15 | జ్జిహ్వాఘూ్రిణ | జ్జిహ్వాఘ్రాణ |
| 72 | 15 | మేవాద్వితేయం | మేవాద్వితీయం |
| 76 | 2 | అద్వితేయ | అద్వితీయ |
| 83 | 11 | వసృజతేత | నసృజత |
| | 15 | సంకల్పముచేత. సర్వాలోకములను | సంకల్పముచేత, సర్వాలోకములను. |
| 84 | 2 | దుఃఖిత్వాధ్య భిమానము | దుఃఖిత్వాద్యభి మానము |
| 86 | 7 | రెండువిధము లు పరబ్రహ్మము | రెండువిధములు. పరబ్రహ్మము |
| 87 | 9 | హితాత్వ | హితాత్వా |
| | 17 | జీవద్వైతముత | జీవద్వైతము |
| 89 | 2 | తదుపేక్షైవ | తదుపేక్షైవ |
| 90 | 25 | బావించు | భావించు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 26 | మాత్రమే.నని | మాత్రమేనని |
| 92 | 18 | సర్వజగద్యో | సర్వజ్ఞోజగద్యో |
| 102 | 21 | వాసనాదాఢ్యై | వాసనాదార్ఢ్యై |
| 103 | 1 | ప్రీలిపూర్వకముగా | ప్రీతిపూర్వకముగా |
| | 24 | కారణమగును | కారణమగను. |
| 105 | 1 | వుడగుటచేత | పుడగుటచేత |
| | 24 | వియు | నియు |
| 106 | 4-5 | వాసనాతియు | వాసనాదియు |
| 107 | 8 | మనుష్యుకనెడ | మనుష్యుడనెడి |
| 108 | 13 | నిమజ్జంతస్తే | నిమజ్జతస్తే |
| 110 | 13 | చిబాభాస | చిదాభాస |
| 112 | 2 | తిష్టత్యానంద | తిష్ఠత్యానంద |
| 113 | 23 | అభిప్రాయగులు | అభిప్రాయములు |
| 114 | 16 | బ్రహ్మతత్వోపా సనము | బ్రహ్మతత్వో పాసనము |
| 120 | 22 | చిత్తగర్వము | చిత్తగర్వము |
| 122 | 14 | బ్రహ్మధ్యానము | బ్రహ్మధ్యానము |
| 123 | 5 | తదాత్మనగ్గ్రి | తదాత్మనగ్గ |
| 124 | 23 | బాహ్యాచాంచల్యము | బాహ్యచాంచల్యము |
| 127 | 20 | గలదనిప్ని | గలదవిన్ని |
| 128 | 17 | అపరోక్షజాన విషయుడు | అపరోక్షజ్ఞాన విషయుడు |
| 132 | 5 | స్వాభావికి | స్వాభావికీ |
| 136 | 12 | దెశించినారు | దేశించినారు |
| 138 | 23 | వాసానందమని | వాసానానందమని |
| 140 | 7 | దృష్టాతముగా | దృష్టాంతముగా |
| 141 | 11 | అబెధమెట్లో | అభేదమెట్లో |
| | 17 | శ్రుతిచెప్పునున్నది | శ్రుతిచెప్పుచునదిన్ని |
| 143 | 17 | వ్రతిష్ఠా | ప్రతిష్ఠా |
| 144 | 5 | మొకట్టిర్యైనను | మొక్కటిదైనను |
| 149 | 19 | మిథ్యాత్మనబడును | మిథ్యాత్మలనబడును |
| 163 | 3 | ముదీరితి | ముదీరితం |
| | 19 | వర్ణిత | వర్ణితః |
| 166 | 22 | చిద్వ్యవస్థ | చిద్వ్యవస్థ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 167 | 20 | క్షుత్పిఫాసాం | క్షుత్పిపాసాం |
| 168 | 22 | ఫూరితకైయున్నదో | పూరితమైయున్న |
| 169 | 19 | హ్యాగ[illegible] | హ్యాగచ్ఛేజ్జ |
| | 24 | జగంనహి | జగన్నహి |
| 171 | 20 | త్రిపుటీంహాతా | త్రిపుటీంహితా |
| 173 | 19 | కస్మిత్ర | అస్మిత్ర |
| 175 | 13 | నిస్సంసయు | నిస్సంశయు |
| 176 | 26 | తెలుకున్న పిదప | తెలుసుకున్న పిదప |
| 177 | 4 | రివాంబ్రగో | రివాంబ్ర్గో |
| 178 | 18 | సంహాతే | సంహారితే |
| 179 | 17 | తడువాత | తరువాత |
| | 21 | ఎపపడు | ఎప్పుడు |
| 180 | 1 | జాగ్రిత్సప్న | జాగ్రిత్స్వప్న |
| 184 | 7 | హాయతశ్చాద్రో | హాయతశ్చాప్రో |